# చ రి త్ర లు - క థ లు

| | రు | అ |
|---|---|---|
| బమ్మెర పోతరాజు | | 1 |
| శ్రీకృష్ణదేవరాయల చరిత్ర | | 1 |
| నలమహారాజు కథలు (వచనం) | | 1 |
| పంచపాండవుల అజ్ఞాతవాసం పెద్దది బైండు | | |
| శ్రీరామ వనవాసం | | |
| పరమానంద శిష్యుల కథలు | | |
| భోజకాళిదాసు కథలు | | 1 |
| భట్టీవిక్రమార్కుని కథలు | | |
| డిటో చిన్నసైజు | | 1 |
| స్త్రీల వ్రత కథలు 1, 2, 3 భా॥ | | 1 |
| రైతుఋణచట్టం | | |
| పాండవ వనవాసం | 1 | |
| కాశీక్షేత్ర మహాత్మ్యం | 0 | 1 |
| మహాపతివ్రతల కథలు | 0 | 1 |
| మదనకామరాజు కథలు | 1 | |
| హరిశ్చంద్ర (వచనం) | 0 | |
| మైరావణ చరిత్ర | 0 | |
| డిటో పెద్ద సైజు బొమ్మలతో | 1 | |
| ప్రవృద్ధపాండవం | 0 | |
| అభయరాఘవం | 0 | |
| సౌభ్రాత్రరాఘవం | 0 | |
| విక్రమరాఘవం | 0 | |
| భట్టీ విక్రమార్కుని కథలు (క్యాలికో బైండు) | 3 | |
| చమత్కారకథాకల్లోలిని 1 వ భా॥ | 1 | |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# నవ్వులగని



చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే
రచియింపఁబడియె



పబ్లిషర్సు :
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి
1946



[ వెల 1-8-0

# విషయసూచిక

# నవ్వులగని

నూతన పంచాంగము.

కృష్మూర్జాలదేవతాయైనమః.

గీ. కుడుములన్ మెక్కి పొంగిన కడుపు; చేట
చెవులు; నేనుగు తొండంబు; చెవులుగొలుప
రుబ్బు రోల్పొత్రమట్లు కూర్చుండి కదల,
లేని గణనాథు నవ్వులకై నుతింతు.

ఈపంచాంగము కళంకి బ్రాహ్మణమహావంశజాతుండును కేన చిచ్ఛిద్ధాంతినాగణిత పధకతస్కరుండును, కిరాత మహారాజాస్థాన విద్వాంసుడును, అగు కుండగోళక సిద్ధాంతిచే రచింపంబడి, దౌర్భాగ్య పురము దగుర్భాజీపేటలోని అనృతవాదినీ ముద్రాక్షరశాలయందు దీర్ఘ వాలవు గ్రామసింహారావు పంతులుగారిచే ముద్రింపబడి లోకవినోదార్థము ప్రకటింపంబడియె.

ఆంజనేయ స్తుతి.

గీ. భాస్కరునిగాంచి ఫలమనుభ్రమయు బుద్ధి,
శాలి; లంకనుగాల్చిన చక్కనయ్య!
ఆంజనేయుండు కృతిభర్తకనుదినంబు
తనగుణంబులొసంగుచుఁ దనుపుగాత.

సంవత్సరఫలము.

ఈ సంవత్సరము గుంటూరు అత్తరువు సాహేబులకు బేరముల వలన మంచిలాభమును సాతానులకు ముష్టివలన సుఖజీవనమును కలు

గును. తురకపకీరులు అడుగుకొనుటవలన సాధారణలాభమే కాని విశేష లాభము కలుగదు. వేశ్యలకు మేళములవలన వచ్చు ఆదాయముకన్న బాల్యులగు ధనికుల ప్రాపకములవలన కొంత జీవనోపాధి కలుగును. బృహస్పతి పరగృహావరియై యుండు సమయమున చంద్రుఁడు బృహస్పతి యింట్లో ప్రవేశించును గావున యేమి ఫలము గలుగునో చదువరులే యూహించగలరు. దీనికై యే విఘ్నాశములు గలుగకుండా నవగ్రహదానములు చేయవలయునని మేము సలహాయిచ్చుచున్నాము. అమావాస్య దినంబున చంద్రగ్రహణంబును పౌర్ణమిదినంబున సూర్యగ్రహణంబును కేవల మద్భుతంబులై సంభవించును [ఇది నమ్మనివారు మహాపాపమును జెందెదరు] పంటలు మొత్తముపై బాగానే పండినను రహితులు పండలేదని గోలలెత్తుచునే యుందురు. సర్వేషాం సన్మంగళానిభవంతు.

## పంచాంగ పీఠిక.

### ఇష్టదేవతా ప్రార్థనము.

సీ. పల్లికల్ తామరల్ బాపునమరవిల్లి
యెల్లమ్మదేవత నెదఁ దలంచి
రహి మాలపేరంటాండ్రను శివమాడించు
జగ్గంగి యసిరమ్మ సన్నుతించి
కోళ్ళపొట్టేళ్ళ కై కొని మింగు కోరంగి
తణుకులమ్మను మదాత్మను నుతించి
రాజమహేంద్రవరంబు నందున్న
చామాలమ్మ తల్లిని మదిభజింతు

గీ. పిదప గంజాము ముసలమ్మ వినుతిజేసి
కోరి నూకాలశక్తి కుపార మొసఁగి
వన్నె కెక్కిన గ్రామదేవతల నెన్ని
వ్రాయఁబూనితి పంచాంగ రాజమవని.

గురుధ్యానము.

సీ. డొక్క నెక్కుడసయిన నొక్కయక్కరమైన
గలగియుండని మహా ఘనుడెవండు?
పలుమారు నోటిమాటలు నాడుటకైన
బడిమందిలో తడబడు నెవండు?
పుట్టినదాది యేపాత్రమైనను చేతఁ
బట్టియెఱుంగని ప్రౌఢ మెవఁడు?
తన తెల్వి కొందరెంతని సంతసించిన
మారుమాటాడని మౌనియెవఁడు?
గీ. శుంఠ లందరిలో మేటి శుంఠ యెవఁడు?
భోజనమున కెంత దవ్వయిన బోవు నెవఁడు?
దర్భపోటన్న రయమున దరలు నెవఁడు?
అట్టి మద్గురు పర్యనే నాత్మదలఁతు.

పు ర వ ర్ణ న ము

సీ. ఏమహాపట్టణం బేచోట దప్పక పరసురామప్రీతిఁ బరగుచుండు
ఏపీట నేచోట శ్రీవిశూచీదేవి లలిజమాబందీల నలుపుచుండు
ఏపురవీధులం దెల్లపగల్ గృధ్రములు రాత్రులందు నక్కలు చరించు
ఏయూర శునకంబు లిండ్ల వాకిండ్ల దొంగలు పెరళ్ళన్ మైత్రి
[మెలగుచుండ్రు
గీ. ఏపురము జారిణుల కెల్ల కాపురంబు
ఏపురము త్రాగుబోతుల కెల్ల యిరవు?

ఏపురము కలహములఁకిల్లు ఆపురంబు
పాపనిలయంబు దౌర్భాగ్య పట్టణంబు.

గీ. మహాజరులు వ్రాయనేర్చిన మాన్యజనులు
దారులను దోచనేర్చిన ధైర్యయుతులు
బాలికల నమ్ముకొనునట్టి పండితులును
రహిఁ జెలంగుదు రాకాశ రామపదులు.

ప్ర భు వ ర్ణ న ము

గీ. ఆపురంబున వసియించు నంతిపురము
గాచికొనియెడి బూదేని కడుపునిండ
ద్రావి మత్తిలు షట్పద రాజుమాడ్కి.
ప్రభు వొకండొప్పు నవని కిరాతుఁడనగ.

క. కలనైన నిజము వల్కఁడు
తులువల సాంగత్య మెపుడు తొలఁగ డనిశమున్
కల్లుద్రావి పేకలాటల
కలకాలము గడుపుచుండు కాపురుషుండై.

దైవజ్ఞ ప్రశంస.

గీ. అక్షరజ్ఞాన శూన్యుఁడైనట్టి ప్రభున
కన్నిటఁ దగు సిద్ధాంతి నగుట తన్క
రంపు పంచాంగరాజమర్పణసేతు
క్షితి నిరంతర మీతనిక్కృతి వెలుంగ.

శా స్త్రి ప్ర శం స.

మ. తెలుపున్ భూతభవిష్యద్దర్ధముల జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతముల్
పొలుపారంగ ముహూర్తమున్ దెలుపునామహూర్తసిద్ధాంతముల్
భళిరా ! ఇందు విశేషమేమి ? పటుసర్వజ్ఞత్వముం గూర్చుచున్
దలపన్ మత్కృతమైన తన్కరణ సిద్ధాంతంబె మేలిన్నిటన్.

అన్యవిరోధికృద్వత్సరస్యనహుషుడుశకము 50,000 తారకాసుర శకము 40 వేల సం॥రములు. రావణశకము 30 వేల సం॥రములు. మహిషాసురశకము 20 వేల సం॥రములు మరియు మహమ్మదుబీను టోగ్లాకుషహాశకము ఔరంగజేబుశకము. టిప్పుసుల్తానుశకము నాదర్షా శకము. సురాజదౌలశకము ఈమొదలగు యోగ్యులగు చక్రవర్తులశకములు పాటించుకొనవలయును. (షరా:—ఈ సంవత్సరముల లెక్క శాస్త్రజ్ఞానమువల్ల చేయబడినదిగాన సరికానిచో ఈతప్పు జ్యోతిష శాస్త్రము గుణించివ్రాసిన సిద్ధాంతులదిగానితన్కు-ఉంచి వ్రాసినవాడెంత మాత్రమును గాదని మాచదువరు లెఱుంగ వలయును.) అథాస్మిన్ దేశేలోక వ్యవహారార్థం హూణమానేన 1911 అబ్దోగ్రాహ్యాని. దేశేనా మహిమాలమస్య దక్షిణభాగే బె ఆఫ్ బెంగాల్ అరేబియన్ సీ మధ్య ప్రదేశే పారిలన్ పేసేజిపర్యంతం సూర్యోదయప్రభృత నిర్ని యతవంత ధాపనాది సమస్త నిత్యకృత్య నిర్వహణార్థం తస్కరణ సిద్ధాంతోక్త ప్రకారేణ మయాలిఖ్యంతే.

## అథసంవత్సర ఫలం.

సూర్యుడు పశుపాలుడు డగుటచే వట్టిపోయిన ఆవులు తిరిగి యీనేవరకు పాలియ్యవు. నిశాధిపో చంద్రః। పడుచు భార్యలుగల మునలి మగలకు రాత్రులయందు సరిగా నిద్రపట్టదు — శ్వానపాలకః కుజః। పట్టణములయందు మ్యునిసిపాలిటీలవల్ల ఊరుకుక్కల కప్పా డప్పా డకాల మృత్యువు గలుగుచుండును— న్యాయపాలకో బుధః। అబద్ధవాజ్యములు కోర్టులో వేసి రాజీకి తిరుగ నారంభించు పార్టీలు మెండయి జిల్లాకోర్టులమీద జిల్లాకోర్టులు సబుకోర్టులమీద సబుకోర్టులు కావలసివచ్చును. విత్తాధిపోగురుః। పార్టీలకు డబ్బులేనప్పుడు తమకే సెట్టుబడిపెట్టి పత్రములు వ్రాయించుకొనుట, ఇతరులవద్ద అప్పులు కుదుర్చుట మొదలగు పనులు ప్లీడరు లారంభింతురు—కాలాధిపోశుక్రః ఎండకాలమున వేడిమి, వర్షాకాలమున బురద, శీతాకాలమున చలి

సర్వత్రా కలిగియుండును—నష్టాధిపశ్శనిః। పాలకుండలకు పిల్లులువల్ల నష్టము, తినుబడిసామానులకు ఎలుకలవల్లనున్నూ, కర్రసామానులకు చెదవల్లనున్నూ, మాధుర్యమైన పదార్థములకు చీమలవల్లను డామేజీ కలుగుచుండును—పుస్తకాధిపో రాహుః। అక్షరజ్ఞాన మెఱుగని శుంఠల పేర్లతో గ్రంథములు వెలువడును. మాటలాడుటకు తడుముకొనుశుంఠలు గ్రంథవిమర్శనముల కారంభించెదరు—పంచాంగాధిపతిః కేతుః। సిద్ధాంతమననేమో యెఱుగని శెట్టిమొగముల పేర్లతో పంచాంగములు వెలువడును.

ఈసంవత్సరమున ముప్పదిమూడు కోట్ల ముప్పదిమూడు లక్షల ముప్పదిమూడు వేల మున్నూటముప్పదిమూడు అర్బుదముల వర్షము కురియును. (అనుమానము గలవారు సరియైన సిఖా కుంచములతో కొలిచి చూడవచ్చును.)

ఉష్ణము 11 పాళ్ళు; గుమాయింపు 10 పాళ్ళు; చెమట 8పాళ్ళు; గాలి 10 పా॥ ధూళి 5 పా॥ చలి 10 పా॥ ఒణుకు 8 పా॥ రొంపలు 4 పా॥ దగ్గు 5 పా॥ తుమ్ములు 4 పా॥ ఆవలింతలు 12 పా॥ ఎక్కిళ్లు 7 పా॥ మత్తు 1[illegible] పా॥ నిద్ర 13 పా॥ స్వప్నములు 6 పా॥ కలవరింతలు 6 పా॥ తుళ్ళిపాటు 10 పా॥ భార్యాభర్తలకలహములు 8 పా॥ వాళ్ళలో వాళ్లే రాజీపడడము 4 పా॥ ఇతరులతగవులు తీర్చడం 3 పా.

వంట బ్రాహ్మణుల గిరాకీ 16 పా॥ చాకలివాళ్ల గిరాకీ 8 పా॥ సానిమేళములగిరాకీ 1టెన్నర పా॥ తద్దినపుబ్రాహ్మణుల గిరాకీ 8 పా॥ పట్టణములయందు అద్దెల గిరాకీ 10 పా॥ రైలు స్టేషనులవద్ద బళ్ల గిరాకీ 8 పాళ్లు.

కోతులవృద్ధి 4 పా॥ గాడిదలవృద్ధి 8 పా॥ పందులవృద్ధి 5 పా॥ కాకులవృద్ధి 6 పా॥ పిచ్చికలవృద్ధి 6 పా॥ పిల్లులవృద్ధి 4 పా॥ బల్లులవృద్ధి

3 పా॥ తొండలవృద్ధి 3 పా॥ ఉడతలవృద్ధి 4 పా॥ బొద్దెకలవృద్ధి 2 పా॥ సాలెపురుగులవృద్ధి 2 పా॥ కప్పలవృద్ధి 3 పా॥

ఆయవారపు బ్రాహ్మలు ముష్టివల్ల ఆదాయము 4 పా॥ వ్యయము 3 పా॥ సదస్యపు సంభావనవల్ల ఆదాయము 3 పా॥ సదస్యాలు మానివేయడమువల్ల నష్టము 3 పా॥ జగన్నాధము పండాలకు రాబడి 10 పా॥ కమీషనుక్రింద నష్టం 6 పా॥ క్షౌరములవల్ల మంగళ్ళకు రాబడి 10 పా॥ గుజ్జుపుజాతులవలన బేరం తగ్గిపోవడం 3 పా॥ నేప్పీ రేజర్లు వల్ల బేరంనష్టం 3 పా॥ స్త్రీపునర్వివాహములవల్ల బేరము పడిపోవటము 3 పా॥ తిరుపతి వేంకటేశ్వరులకుముడుపువల్ల రాబడి 6 పా॥ దాసులు మధ్య తినడంవల్ల నష్టము 2 పా॥ ఉద్యోగస్తులుచిట్టాలో జమకట్టక తస్కరించడంవల్ల నష్టము 2 పా॥ యాత్రస్తులు తలలు గొరిగించుకొని మొక్కు తీర్చుకొనుటవల్ల స్వామివారికి జమవచ్చే వెండ్రుకలు సవరాలుచేయించి అమ్మించే యెడల రాబడి 3 పా॥ సానులకు విటులవల్ల ఆదాయము 8 పా॥ తగిలిన సంకటాలు కుదుర్చుకోడానికి వ్యయం 4 పా॥ గవర్నమెంటు ఉద్యోగస్థులకు (పుచ్చుకొనే యెడల) లంచాలువల్ల ఆదాయము 8 పా॥ లంచపు చార్జీలక్రింద వ్యయము 10 పా॥ గ్రామమునసబు కరణాలకు గ్రామస్థులవల్ల ఆదాయము 15 పా॥ గవర్నమెంటు ఉద్యోగస్థులకు నష్టయిక్రింద వ్యయము 12 పా॥ స్వదేశీషాపులవల్ల ఆదాయము 6 పా॥ పెద్దమనుష్యులమను పేరిడుకొన్న మేనేజర్లు తస్కరించి లెక్కలు లేవన్నయెడల నష్టము 16 పా॥ చౌకరకం వాచీల ఖరీదు 16 పా॥ వాటిమరమ్మత్తుక్రింద ఖర్చు 20 పా॥ మ్యునిసిపల్ దీపాలవల్ల వెలుగు ౦ పా॥ కంట్రాక్టర్లు సరిగా చమురు పోయించక పోవడంవల్ల చీకటి 2 పా॥ చాకలివాళ్ళు చమురుతస్కరించడమువల్ల చీకటి 3 పా॥ రాత్రులయందు బీటు తిరగడములో పోలీసు కానిస్టేబిల్లుకు హుషారీ 4 పా॥ కునికిపాట్లు 3 పా॥ బద్ధకం 2 పా॥ తణికీ సరిగాలేకపోతే

నిర్భయం 2 పా॥.—బిళ్ళగోచీలు 4 పా॥ జారుకచ్చలు 6 పా॥ గూడ కట్లు 2 పా॥ పె.రాయిలు 8 పా॥ పిలకజుట్లు 6 పా॥ తివాసీక త్తిరజుట్లు 6 పా॥ వైష్ణవజుట్లు 5 పా॥ జునపాలు 4పా॥ గేరాజుట్టులు 5పా॥ గుణ్ణపు జుట్టులు 14 పా॥ కేవలము బోడిగుళ్ళు 3 పా॥ పంపరపనాసకాయడిప్ప జుట్లు 2 పా॥ వంకరపిలకజుట్లు 3 పా॥ మార్వాడీజుట్లు 1 పా॥ వేంక టేశ్వరమొక్కు కోడిజుట్లు 2 పా॥ చింపిరిజుట్లు 2 పా॥ తుప్పతలకాయలు 2 పా॥ పూర్తిగా పెంచేసిన జుట్లు 3 పా॥

అథరాజపూజ్యావమానాని

భాగ్యవంతులకు రాజపూజ్యము 10 పా॥ బీదలకుఅవమానం 13 పా॥ యోగ్యులకు రాజపూజ్యము 10 పా॥ జారులకు (సానివీధులలో) రాజపూజ్యము 12 పా॥ (సంసారులవీధులలో) అవమానము 16 పా॥ వైద్యులకు (ఆరోగ్యమురోగికి కలుగువరకు) రాజపూజ్యము 16 పా॥ (పిమ్మట కట్నము అడిగినయడల) అవమానము 14 పా॥

అథసంక్రాంతి పురుషలక్షణము.

అస్య సంవత్సరస్య భ్రష్టనామకోసంక్రాంతి పురుషః ఊర్ధ్వము ఖం ఏకనేత్రం - గార్ధభవాహనం - పంకలేపనం - షోడశోర్ధ్వపుండ్రధార ణం - మర్కటాకారం - కుంకుడుకాయల ఫలహారం - ఉమ్మెత్తకాయ శాఖం (ధాన్యంలోపుట్టు)జోడాలు లేక గోలివెలు అన్నభోజనం- అన్య పురుషస్యధర్మపత్నీ-మహామారీదేవి-పిశాచీ జ్యేష్ఠసోదరీమానవభక్షణీ- బొంబాయివాసినీ విజయుతే—

[తిధులు మామూలుగనున్న వేకాన మేము వ్రాయులేదు.]

సమాప్తము

## ప్రశ్నలు.

ప్రశ్న—భాగ్యవంతు డెప్పుడు బీదవాడగును ?

ఉత్తరము—పన్నులిచ్చుకోవలసివచ్చినపుడును, కొడుకుగాని తమ్ముడుగాని చనిపోయిన తరువాత కోడలుకో మరదలుకో మనువర్తి యిచ్చుకోవలసివచ్చినపుడును మనుష్యులు పేదవారగుచుందురు. ఇతరుల భూములు వ్యవసాయము జేయు రహితులు, ఈనాముదారులకు భూమిశిస్తు నీయవలసి వచ్చినప్పుడు తప్పక పేదవారగుచుందురు.

ప్రశ్న—పేదవాడు భాగ్యవంతు డెప్పుడగును ?

ఉత్తర—తనకుగాని తన కుమారునకుగాని తన తమ్మునకుగాని పెండ్లి సంబంధము వచ్చినప్పుడు ప్రతిమనుష్యుడు వడ్డీవ్యాపారము జేయువాడగును. ఈనాముదారు డగును. ఒకరికి పెట్టి తాను తినవలసినంత భాగ్యశాలి యగును.

ప్రశ్న—ముసలివాడు చిన్నవా డెప్పుడగును ?

ఉత్తరము—కళత్ర నష్టమైనప్పుడు ముసలివాడు తప్పక పడుచువాడగును. అఱువదియేండ్లవా డేబదియేండ్లవా డగును. ఏబదియేండ్లవాడు నలువదియేండ్లవా డగును. తలవెంట్రుకల నెరుపు బాలనెరుపగును. శరీరములో నోపిక లేకపోవుట సుకుమారముచేత గాని వార్ధక్యముచేత గాదని సిద్ధాంతపడును. మఱియు సర్కారులో నుద్యోగము గావలసివచ్చినప్పుడుగూడ పెద్దవాడు చిన్నవా డగుచుండును. ఇరువదియైదేండ్లు దాటిన తరువాత గవర్నమెంటువారి కొలువులో ప్రవేశించుటకు వీలు లేదు గనుక ఎందుకైనా మంచిదని నాలుగేళ్ళో అయిదే

శ్లోకే మొదట తగ్గించి చెప్పుట శిష్టసాంప్రదాయము. వేశ్యాంగన లెంత ముసలివారైనను పంద్రెండేండ్ల బాల లగుదురు.

ప్రశ్న—చిన్నవాడు పెద్దవా డెప్పుడగును.

ఉత్తరము—తప్పుసాక్ష్య మీయవలసివచ్చినపుడు అనగా నలువదియేండ్ల వయస్సు గలవారు తాను పుట్టకమునుపు గాని తన చిన్నతనములో జరిగిన సంగతి గాని కోర్టులో జెప్పవలసి వచ్చినప్పుడు అబ్బో నేనిప్పటివాడనా అఱువదియేండ్లున్న వని యొకడు ఆనకట్టుకట్టునప్పటికై దేండ్లవాడి నని యొకడు, వికారిసంవత్సరము గాలివానకు వీథుల వెంట దిరుగుచుంటినని మఱియొకడు జెప్పి పెద్దవాడు కావలసిన యువసరము వచ్చును. సన్యాసులు చిన్నవారైనను పెద్దవారగుట అవశ్యము. ఏలఅనగా సన్యాసులలో చాతుర్మాస్య లెక్కుడు గడచినవాని కేగాని పూజలు గలుగవు. అందుచేత చిన్నవాడయినను ఎక్కువచాతుర్మాస్యలు చెప్పుకొనుచుండును.

ప్రశ్న—తల్లిదండ్రులయెడ భక్తి లేనివాడు ఎప్పుడు పరమభక్తుడగును.

ఉత్తరము—తల్లిదండ్రులు చనిపోయిన తరువాత నొకప్పుడు పరమభక్తు డగును. బ్రతికియున్నపుడు తలిదండ్రులకు బట్టలియ్యనివాడు శ్రాద్ధసమయములందు బ్రాహ్మణులకు మంచి బట్ట లిచ్చును. బ్రతికియుండగా వారి కన్న మెప్పుడు బెట్టనివాడు, బ్రాహ్మణులకు అరిశెలు గారెలు పరమాన్నముతో భోజనము పెట్టి మామిడిపండ్లు నరటిపండ్లు ఫలహారము లిచ్చును. బ్రతికియున్నపుడు మరియాద లేకుండ దిట్టినవాడు చనిపోయిన తరువాత మానాయనగా రని మానాన్నగారని ప్రశంసించుచుండును.

ఒకేపట్టణమున జిల్లాకోర్టు, సబుకోర్టు కూడా కలదు. అక్కడి ప్లీడర్లలో కొందరికా సబుజడ్జిగారియందుండు వైషమ్యముచే ఆకోర్టుకు తాము వెళ్ళనేవెళ్ళమని బింకములు పలికిరేని ఆబింకములు తక్కిన ప్లీడర్లకొక్కై నేతిలో పడుటకేనా. ఇంకేమయిన ప్రయోజనము కలదా?

రివిన్యూ యిన్‌స్పెక్టరువారు తమ ఖండములో సర్వేలు దయచేయించే దినములలో కరణంగారింట్లో తవ్వవేస్తె (భోజనముచేస్తె) సౌఖ్యమా, లేక గ్రామస్థులకొంపలుమాపి సప్లయిపుచ్చుకుని వంటచేసుకొని భోజనముచేస్తే సౌఖ్యమా?

ఒక గ్రామమందుండు ముసలి సోమయాజులుగారిని, ఆయన తాలూకు పడుచు సోమిదేవి నానాదుఃఖములు పెట్టి యేడ్పించుచుండును. ఆసోమయాజులుగారి యజ్ఞఫలము సమకూడి రంభాసమాగమమునకు స్వర్గయాత్ర కేగుతరి సోమిదేవిగారు ఎలుగెత్తి రోదనము జేయసాగిరి. ఆమె ఏడ్పుటకు కారణము తలవెంట్రుక లూడిపోవుననియా తాను నానాదుఃఖములు పెడితే పడువారు యెవరూ లేరనియా? సాగనుక త్రేయగు రంభను తనభర్త కూడుననియా, లేక ఏడువలేకపోతే యిరుగుపొరుగు అమ్మలక్కలు మూతులు ముక్కులు విరుతురనియా?

లింగధార్లకు వైష్ణవులకు మత సంబంధమగు కల్లలు పెరిగి నాయకులగు బసవయ్యలింగంగారు మారెడుకొమ్మ పట్టుకొని, రంగాచార్యులుగారు తులసికొమ్మ పట్టుకుని యుద్ధ మారంభించిరేని ఎవరికి జయము ఎవరికి పలాయనము?

దావా తెచ్చినప్పైని రాజీపూర్వకముగ నేమైనలభించునని తెచ్చిన దావాలో రాజీకుదరదని తన కపజయము తప్పదని తెలుసుకున్న పార్టీ సాధ్య మగునంతకాలము దావా విచారణ జరగకుండా వాయిదాలు

వేయించే ప్రయత్నము చేయవలసినదేనా, ఇంకేమయిన ఆలోచన ఉన్నదా?

## ఫూల్సు (Fools)

తన అసమర్థతను గుర్తెఱుగక ఇతరులను హేళన చేయువాడు నాలగవవంతు ఫూలు (One fourth fool)

తన్ను లోకమందు తెలివితక్కువ మనుసదెఱుంగక యితరులను 'ఫూలు' అనువాడు సగముఫూలు (Semi fool)

అసమర్థతచే కలమాడక, పిరికితనముచే నోరు పెకలక, ఇంట భార్య కోపించునను భయము, బయట అధికార్లు కోపింతురను భయము, నలుగురిలో ఎవ్వరేమి పరిహాసింతురో యను భయము గడగడ చలివేయుచుండ, పయివారెవ్వరు లేకుండ జూచి తన క్రిందివారితో మెల్లగా ఊపిరి బిగియబట్టి గొప్పవారిని ఫూలు అనువాడు సరియయిన ఫూలు (Fool)

ఈతని సంగతి ఎంతటిదో చూతమని పదేపదే "తన్నే తాబాన స్య" చేయుచున్న క్లయింటును లోకువగా నెంచి ఇదే సమయమని నిక్కి విర్రవీగుచు "నాక్లయింటు నాకాలి క్రిందపడి వుండవలెనని" ప్రగల్భములు కొట్టి ఆక్లయింటు తన్ను లక్ష్యపెట్టక పరాభవించిన పయిని ఏదో జేసినము త్తయిదువవలెనే మౌనముద్ర వహించిన న్యాయవాది. డబుల్ ఫూల్ (Double fool)

ఎదుట నీవు దేవుడంతవాడవు నేను నీ భక్తుడను నీ అంతటివాడు లేనే లేడని ప్రతివారిని ముఖమున పొగడుచు పరోక్షమున ఆ నోటనే హేళనముజేయుచున్న గడసరియొక్క నైజము అందరు గుర్తెరిగి యీతని మాటలకు నవ్వి ఊరకుంటయె ముఖస్తుతులకు తగు పరాభవమని లోకు లల్లాచరించుట గ్రహింపలేక నదేపనిగ తానే గడు

ను వాడననుకొని ఎదుటపొగడుచూ, వెనుక హేళనము చేయుచుండు పెద్దమనిషి. ట్రిబిల్ ఫూల్ (Trible fool)

ఇట్లు ఫూల్సు అయిదు తెగలవారు. వీరికి క్రమాలంకారముగా ఇడీఎట్, డన్సు, క్రేక్, బ్లాక్ హెడ్, స్టుపెడ్ అను పర్యాయనామము లను పెద్దలమర్చియున్నారు. సరసులగు చదువరులు నవ్వుచు దీనిం జదివి ఆనందించెదరు గాని పయిలిష్టులోచేరిన ఫూల్సు ఆగ్రహించు కొనక మానరు. వారిసంగతి వివరించితినేగాని వారిని నేను తిట్ట లేదని విన్నవించుచు వారికి కలిగెడు యాగ్రహము వారు ఫూల్సు అవుటనే కలిగినదని యథార్థవాదినగు నన్ను మన్నించమనియు వేడు కొనుచున్నాను.

ప్రశ్న—క. వరహాలపురములో పూర్వము జడ్జిపనిచేసిన దొర గారు చెరువుగట్టుమీద కట్టించిన సత్రమిప్పుడున్నదా? ఉన్నపక్షమున దానిలో నిప్పుడు వెనుకటివలెనే మార్గస్థులు బసలు దిగి వంటలు చేసి కొనుచున్నారా?

చ. మునిసిపల్ పెంటబండ్లను లాగునట్టి యెద్దుల నిమిత్తమై యుపయోగపడుచున్న తట్టలు, గడ్డిమోపులు మొదలయిన సరకులు ఆ సత్రములో దిగి బసచేయుచున్నవనియు, అందుచేత మనుష్యులు మును పటివలె బసలుచేయుటకు వీలులేకున్నదనియు జనులు చెప్పుకొనుచున్న మాటలో నేమైన సత్యము కలదా?

ప్రశ్న—క. మునిసిపల్ బండ్లను లాగునట్టియెద్దులలో కొన్నిటి కన్నులు ఎండవేడిమిచేత పువ్వులు వేసిపోయినవని లోకు లనుకొను చున్న వాడుక నిజమా యబద్ధమా?

చ. ఇప్పుడు చూపుచున్న యాదరణమే యాయెడ్లకుచూపు చున్నపక్షమున తక్కినయెద్దుల కన్నులుపోవుట కెంతకాలముపట్టును?

ప్రశ్న—వరహాలపురము మునిసిపల్ ఆసుపత్రిలో జనుల కవసరములైన యౌషధములు కొన్ని లేకపోవుటకు గారణ మేమి? మునిసిపల్ వారు తగినంత సొమ్ము కర్చుపెట్టకపోవుటచేతనా? జనుల దురదృష్టముచేతనా? మనవారు కొనదలచినప్పటికి ఔషధములు దొరకకపోవుటచేతనా?

ప్రశ్న—క. అనప్పిండివారి వీధిపైన పారుచున్న మురికినీళ్ళ యేరు లేకుండ జేయుటకై ఏమేమియుపాయములు మీకు తోచుచున్నవో అవియెల్ల వ్రాయుడు?

చ. కొరెముతో మాట కాని పత్తామెత్తుటగాని .కూడతోడుగాని చేసి యీనీ రావలకు వెళ్ళగొట్టవచ్చునా లేక కెరసనాయిలు యింజను పెట్టవలసియుండునా?

ప్రశ్న—క్రొత్తగాపోసిన పోతగట్టుకు ప్రతిదినము వందలకొలది మనుష్యులు దిగుచున్న కంభంవారి సత్రమురేవున విశాలములైన మెట్లువేయక జనశూన్యమైన వడివీధికి యెదురుగ విశాలమైన మెట్లుకట్టుట యెవరి బుద్ధికుశలత? దీని కిప్పుడైన ప్రతిక్రియ జరుగుటకు వీలున్నదా?

ప్రశ్న—మునిసిపల్ కౌన్సిలరులు తమ నియమితకాలమనగా మూడుసంవత్సరములు సమాప్తము కావచ్చినప్పుడు తిరిగి కమీషనరు పదవి తమకు వచ్చుటకై పడవలసినజాగ్రతలేమిటి? అరుగులు పెంచి గోడలు జరిపి జనులుచేసుకొన్న ఆక్రమణలు చూచి, చూడనట్టూరకొనుట, తూములలోనుండి వచ్చిన మురికినీరునకు ప్రాసిక్యూషను చేయకపోవుట, వార్డులలోనికి సాధారణముగ రాకపోవుట యనెడు జాగ్రత్తలుగాక యితరములైన జాగ్రత్తలేవైన పడవలెనా?

ప్రశ్న—క. పెద్దదొడ్డు లేనివారు నూయి త్రవ్వించుకొనవలసి వచ్చినప్పుడు తమ నూతినీరు వీధిలోనికి వెళ్ళినపక్షమున తమ కేవిధ

మైన యిబ్బంది లేకుండ జేసికొనుటకై ధర్మమును పేరుపెట్టి సగము సగాయికాని నూతిలో నాలుగవవంతుగాని ప్రజలనిమిత్తమై వదలి వేయుట గాక మరి యుపాయ మేదైననున్నదా ?

చ. చిన్న చిన్న సందులలో గొందులలో గూడ ధర్మనూతులు బయలు దేరుట కీకారణముగాక మరియొక కారణమేమైననున్నదా ?

ప్రశ్న—తాలూకాబోర్డు మెంబర్లకు డిస్ట్రిక్టుబోర్డు మెంబర్లకు మునిసిపల్ కౌన్సిలర్లకు తమచుట్టు జరుగుచున్న అక్రమములు, ఆక్ర మణలు కనబడునట్లు చేయుటకై ఏదైన మంచికాటుకచేసి యియ్యగల వైద్యుడు లోకమున కలడా ?

---

## పు ర మం ది ర ము

(గజముఖరావుగారు హయగ్రీవరావగారు ప్రవేశించుచున్నారు)

గజ—ఏమండోయి హయగ్రీవరావుగారు ! ఈవేళ మీకే మైనా పని యున్నదా ?

హయ—అట్లే పనేమీ లేదు. కాని యెందుకు ? నావల్ల మీ కేమిపని కావాలి.

గజ—నాతో కూడా మీరొకచోటికి సాయము రావలెను.

హయ—ఎక్కడికి ?

గజ—నేను పురమందిరమునకు వెళ్ళుతున్నాను.

హయ—పురమందిరానికి వెళ్ళితే సాయ మెందుకండోయి. మీమాటలు విచిత్రముగా నున్న వేమిటి.

గజ—ఎందుకయితేమి మీరువస్తురూ నామాట విని. కారణం తరువాత చెపుతాను.

హాయ—కారణం చెపితేనేకాని నాకు రావాలని లేదు. ముం దుగా కారణం చెప్పండి.

గజ—పురమందిరములోకి నేనొంటిగా వెళ్ళిన పక్షమున ఒంటి గాడినిచేసి నన్ను యెవరైనా దొంగలు కొడతారని భయము.

హాయ—(ఆశ్చర్యముతో) ఇదేమిటండోయి, ఇప్పుడు సాయం కాలము ఆరుగంటలైనదికదా, ఇండ్లలోకి సయితము దొంగలర్ధరాత్రి వేళ నిద్రపోవుచున్నపుడు కాని రారు. నూట దీపాలు పెట్టలేదిప్పటికి ఇప్పుడే అంత భయమేమిటయ్యా పురమందిరములో.

గజ—జనసమ్మర్దము లేని చోట పగలేమిటి రాత్రేమిటి. మావూరి సంగతి మీరు బొత్తిగా ఎరుగరు. పట్టపగలు రెండుజాముల వేళ పురమందిరమువద్ద ఒక యింట్లో ఒక పిల్లని చంపివేసినారు. పట్ట పగలే యింతపని జరిగినప్పుడు సాయంకాలము ఆరుగంటలకు పురమంది రము వంటి జనసమ్మర్దము లేనిచోట యేదైనా ప్రమాదము జరుగుట దేమియాశ్చర్యము.

హాయ—సమర్దము లేకపోవడ మేమిటి. అందులో మెంబ ర్లెంతమందున్నారు.

గజ—నూటపాతికమం దున్నారు.

హాయ—నూటపాతికమం దున్నప్పుడు భయమేమిటయ్యా.

గజ—ఉండడం నూటపాతికమం దున్నారు. కాని వచ్చేవా రెందరని అడగరేమి మీరు.

హాయ—అందరూ రారా యేమిటి సాయంకాలము చదువు కుందురు ?

గజ—అందరూకాదు కొందరు వస్తారా అని అడగండి.

హాయ—ఎవరూ రారా యేమిటి.

గజ—రాకేమి. నావంటి తెలివితక్కువవాళ్ళు యిదివరకొక్కడో యిద్దరో వస్తున్నారు.

హాయ—ఎందుచేత రావడంలేదు.

గజ—ఎందుచేతనని చెప్పను. రావలెనని యిష్టములేదు. అందుచేత రావడంలేదు. వారు పెద్దలు మన మనడానికి తగదు.

హాయ—అయితే చందాలిచ్చుకొని చదువుకోకుండా యూరకుంటారా?

గజ—ఎవరో తెలివిమాలినవాళ్లు నావంటివాళ్ళే చందాలు యిచ్చుచున్నారు. తెలివయినవాళ్ళావనిగూడా చెయ్యడంలేదు. ఒక్కొక్కరు నెలకి రు 0-8-0 లు చందా యివ్వవలసినవాళ్ళు అరవయి డెబ్బదిరూపాయలవరకు బాకీయున్నారు. నూరు రూపాయలు కూడా యున్నారు.

హాయ—చీట్లపేక బల్లలు చదరంగపు బల్లలు లేవా యేమిటి మీపురమందిరములో.

గజ—లేకేమి మునుపె చదరంగపుబల్ల చీట్లపేకబల్ల కొంచెము సందడిగా యుండేది. వాటిమీద కూడా యిప్పుడు మోజు తగ్గిపోయినది. టెన్నిసుకోర్టుంది కాని సరసంచారము లేకపోబట్టి అక్కడ చిగిలింత సీమసేపాళము మొలిచినది.

హాయ—అయితే యిటువంటి భయసమయములో నీవు వానుహాలు కెందుకు వెళ్లవలెను.

గజ—దక్షిణాఫ్రికాలో మనవారి గతియేమైనదో కాస్త పత్రికలలో జూడవలెననియున్నది. కాని వెళ్లితే యెుంటిగాడి నగుటచేత దొంగలే కొట్టిచంపుతారో, లేక పిశాచములే మీదపడి కొట్టి చంపునో అని భయమువేయుచున్నది. కాబట్టి నీవు తప్పక రా బాబూ.

హాయ—ఆహాహా! ఏమి పురమందిరమండీ. ఏమండి జనుల శ్రద్ధ. (అని యిద్దరు నిష్క్రమింతురు)

## శృంగారచేష్ట.

[రాజు బ్రాహ్మణుడు ప్రవేశించుచున్నారు]

రాజు—శాస్త్రిగారూ! మీనివాసస్థలమేదండీ?

బ్రాహ్మ—చిత్తము నాకాపుర మీగ్రామమే.

రాజు—మీరిప్పుడేపనిమీద దయచేసినారు?

బ్రాహ్మ—దేవరవారిదర్శనార్థము వచ్చినాను.

రాజు—ఏమిపనిమీద వచ్చినారు?

బ్రాహ్మ—(తనదౌడ జూపుచున్నాడు.)

రాజు—ఏమిది దౌడ జూపుచున్నారు. పాప మీదవుడ మీకు వాచిన దేమి? ఆపట్టు వేసినదేమిటి సున్నము బెల్లమా? అడిగిన మాట కుత్తరము చెప్పక, దౌడజూపుట నాకాశ్చర్యముగానున్నది. మీయభిప్రాయమేమిటో నాకు చెప్పండి.

బ్రాహ్మ—ఆదౌడమీద నాకు గట్టిదెబ్బ తగిలినది.

రాజు—పాపము! నాతో ఫిరియాదు చేయుటకు వచ్చినారా కిట్టనివారెవరో మిమ్ము కొట్టియుందురు. వారిపేరు వెంటనే చెప్పండి వారిని తగిన శిక్ష జేయింతును.

బ్రాహ్మ—నన్ను కొట్టినవారు కిట్టనివారు కారు, నాకాప్తులే.

రాజు—అట్లయిన నెవ్వరు కొట్టిరో చెప్పండి శిక్షించెదను.

బ్రాహ్మ—పేరు చెప్పెదను గాని మీరు శిక్షింపవద్దు. (అది శృంగారచేష్టగాని దెబ్బగాదు.

రాజు—ఎవరిశృంగారచేష్ట?

బ్రాహ్మ—అది నాప్రియభార్యయొక్క శృంగారచేష్ట

రాజు—(ఆశ్చర్యముతో) ఇదేమి శృంగారచేష్టయయ్యా శృంగార చేష్టయనగా మాటలాడుకొందురు. పలుకాడుకొందురు. పరిహాసము చేసికొందురు. కాని దౌడ వాచునట్లు చెంపకాయలు కొట్టుకొందురా?

బ్రాహ్మ—నాభార్య స్వయముగా నన్నుకొట్టలేదు. ఒకరిచేత కొట్టించినది.

రాజు—ఇదేమిచిత్రమయ్యా! భార్య యొకరిచేత కొట్టించుట మీరు వచ్చి నాతో జెప్పుకొనుట మిక్కిలి సరసముగా నున్నదే. నీచరిత్రమేమిటో విస్పష్టముగా జెప్పు.

బ్రాహ్మ—చెప్పెదను చిత్తగించుడు. నాకు ముగ్గురు భార్యలున్నారు. పెద్దభార్యపేరు ఆకలి. రెండవభార్యపేరు దాహము. మూడవ భార్యపేరు ఆశ. ఈముగ్గురు భార్యలు మహాపతివ్రతలు. నేను జీవించియుండగా నన్ను విడిచి మరియొకని తావునకు బోరు. ముగ్గురిలో చిన్నభార్య యగుఆశకు నాకు ఒకటే ప్రాణము. ఆమెమీద నాకెంత ప్రేమ కుదిరినదనగా ఆమె గీచినగీటు దాటను. ఆమె యేపని జేయుమన్న నాపని జేయుదును. ఆమె నాముద్దులభార్య ఈదెబ్బ ఆమె యొక్క శృంగార చేష్టితము.

రాజు—దెబ్బకారణమేమో స్పష్టముగా విప్పిచెప్పండి?

బ్రాహ్మ—చిత్తము మీయమ్మగారు నిన్న లక్షవత్తుల నోము చేసినారు. అప్పుడు బ్రాహ్మణుల కందరికి తలకొక రూపాయి సంభావన ఇచ్చినారు. నేను మొదట సంభావన బుచ్చుకొని ఆశచేత సంభావన ముట్టలేదని దొంగవేషము వేసి అబద్ధము చెప్పి దొడ్డిదారిని మీయింటిలో మరల దూరపోవుచుంటిని. మొదటనేను సంభావన పుచ్చుకొనుండగా జూచిన మీబంట్రోతొకడు నన్నానవాలుపట్టి గుమ్మముదగ్గఱ నన్నటకాయించెను. నాప్రియభార్య ప్రేరణముచేత

నేను వానిని బుకాయించి టకాయించవలెనని చూచినాను. వెంటనే వాడు జణాయించి యొక చెంపకాయ కొట్టినాడు. అప్పుడు వెంటనే మొగము తిరుగ నేనింటికి వెళ్ళిపోయి యీపట్టు వేసికొంటిని. ఇది జరిగిన యావద్వృత్తాంతము. మీద దేవరవారి చిత్తము.

రాజు—అయ్యో! బ్రాహ్మణుడా నీ ప్రియభార్యకు నీమీద నెంతో ప్రేమ యున్నదిగాని ఆమె ప్రేమను నీకు బాధగా బరిణమించు చున్నది. ఇకమీద నామె చెప్పినట్లు లెన్నడు వినకుము.

బ్రాహ్మ—దేవా! నేను శాస్త్రములు చదువుకొన్నాడను. స్వాధ్యాయములు చదువుకొన్నాడను ఎన్ని చదువుకొన్నను పొట్టగడచుటలేదు. దారిద్రవశమున నిట్టి పాడుపనులలో దిగితిని. లక్ష్మీసంపన్నులగు మీరు నన్నొక్కసారి కటాక్ష వీక్షణములచే జూచినంత మాత్రమున ఆశా పిశాచము నన్ను వదలిపోవును.

రాజు—బ్రాహ్మణుడా ! నీకేమియు భయములేదు నీవుచదువుకొన్నవాడ వగుటచే సాలుకు సరిపడు గ్రాసము నీకు పంపించెదను. ఇక ముందెన్నడు నిట్టి కక్కురితి పనులం జేయబోకుము.

బ్రాహ్మ—చిత్తము.

(అని యిద్దరు నిష్క్రమింతురు.)

---

## రామస్వస్తి—రావణస్వస్తి

(ఇద్దరు బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.)

ప్రథముడు—ఎరయ్యామీరు?

ద్వితీయుడు—మేము బ్రాహ్మణులము

ప్రథ—ఎక్కణ్ణించి దయచేస్తున్నారు తమరు?

ద్వితీ—నేనా! ఈలా దండకారణ్యంలోనుంచి వస్తూవున్నాను.

ప్రథ—దండకారణ్యంలో బ్రాహ్మణులు కాపురమున్నారా?

ద్వితీ—అయ్యో! లేకేమి మహార్షు లనేకులున్నారు.

ప్రథ—అయితే మీరెవ రాశ్రమంలోనుంచి వస్తూవున్నారు?

ద్వితీ—నేనా! అగస్త్యభ్రాతగారి ఆశ్రమంలోనుంచి వస్తూవున్నాను.

ప్రథ—(నవ్వి) అగస్త్యభ్రాత ఏమిటయ్యా? ఇదాయినపేరా? లేక అగస్త్యులవారి తమ్ముడగుటచేత అట్లావచ్చినదా?

ద్వితీ—ఆయనపేరేమో ఎవ్వరికి తెలియదు అందరు అగస్త్యభ్రాత అగస్త్యభ్రాతఅంటారు. అన్నగారైన అగస్త్యులవారిని బట్టి కొంచెము నామరూపాలు గలుగుతున్నవిగాని స్వయముగా ఆయన కేవిధమయిన పేరుప్రతిష్ఠలు లేవు అయినా నావంటివాడే.

ప్రథ—సరే! యెటువంటివాడైతే మనకెందుకు? అగస్త్యభ్రాతగారి ఆశ్రమంలో విశేషాలేమిటి? అక్కడ మహార్షు లేంజెప్పుకుంటున్నారు. యుద్ధవార్త లేమయినా తెలుస్తున్నాయా?

ద్వితీ—తెలియకేమి! ఎప్పటికబురు అప్పుడే తెలుస్తూవుంది.

ప్రథ—ఎల్లా తెలుస్తూవుంది? మీమహామునిగారు దివ్యదృష్టివల్ల గనిపెడుతున్నారా యేమిటి?

ద్వితీ—మామహామునికి దివ్యదృష్టి గివ్యదృష్టి యేమిలేదు. ఎప్పటికప్పుడు వానరులు వచ్చి చెప్పుతూవున్నారు అందువల్ల మా కెప్పటివార్త అప్పుడు తెలియుచున్నది,

ప్రథ—అయితే రావణయుద్ధ మేలాగున్నదో తెలిసిందా?

ద్వితీ—చాలమట్టుకు తెలిసింది. ఇంద్రజిత్తు కుంభకర్ణుడు మాల్యవంతుడు మొదలయిన పెద్దతలకాయ తెగిరిపోయినాయి సర్వనో

మహుడు వృశ్చికరోముడు మొదలైన దేవాంతక నరాంతకులు గూడా వెళ్ళిపోయినారు.

ప్రథ—రావణాసురు డేమైనాడు ?

ద్వితీ—రావణాసురుడు గూడా వెళ్ళిపోయినాడని కింవదంతి పుట్టినది.

ప్రథ—పోయినాడూ ముండాకొడుకు ? నేటికాలానికి పీడకి వినాశమొచ్చింది ? చావవలసిందే దిక్కుమాలిన ముండాకొడుకు. పుత్రమిత్ర కళత్రములతో నాశనమైనాడూ ? పది తలకాయలు ముంజి కాయలలాగ నేల రాలిపోయినాయిగదా ? లోకపీడ వదలిపోయింది నేటితో యింద్రుడికష్టం తీరింది దేవతల బెంగతీరింది బ్రాహ్మణులబాధ పోయింది యాగములు బాగా సాగవచ్చును. సూర్యచంద్రులు హాయిగా తిరుగుతారు. రాములవారికి స్వస్తి స్వస్తి. మహానుభావు డారాముల వారు గెలవక యీ పాడుముండాకొడుకు గెలుస్తాము ? ఆయనయోగ్యత యెక్కడ ఆయనెక్కడ ? ఆపితృవాక్య పరిపాలనము, ఆ సోదరప్రేమ, ఆ వైరాగ్యము, ఆ వినయము ఎవరికొస్తుంది ? అడవిలోకి వెళ్ళు మన్నప్పటికి సవతితల్లిని ఒక్కమాట మాటాళ్ళేదుగదా ? పాపము ! ఆ సీతామహాదేవి భూదేవతగదా ! అటువంటి పతివ్రత నెత్తుకపోయిన దుర్మార్గుడు మన్నుతాడా ? ఛీ వీడిమొగంమండా తలుచుకుంటె పాపం వీణ్ణి రాములవారు విల్లెక్కబెట్టి బాణాలొదిలే యీ నిర్భాగ్యుడా నిల్చేవాడు ? ఇంద్రాదిదేవతలు నిలువలేరు ! పరశురాముడివంటివాడు భంగపడిపోయినాడు స్వస్తి; రాములవారికి స్వస్తి పదివేల సంవత్సరాలు ఆయనే భూమండలం యేలవలె ఈ రాక్షసజాతి మాడిపోవలె. వేరులేకుండ మాడిపోవలె.

ద్వితీ—ఇందులో ఉన్నసందేహమున్నదయ్యా రాములవారు రావణాసురుణ్ణి తలలు ఊడగొడ్తూంటే అవి తిరిగి మొలుస్తున్నాయట

అందుచేత పూర్తిగా చచ్చిపోయినాడాలేదా మళ్ళాబతుకుతాడా అని సందేహంగా వుంది.

ప్రథ—(భయముతో) ఆలాగా! బ్రతుకుతాడా యేమిటి? వాడు బతికినాడంటే మనం చచ్చావన్నమాటే. ఏదో ఒళ్ళెరక్క యిష్టమువచ్చినట్టు కూశాన్నేను ఎవరు విన్లేదుగద కొంపతవ్వి అయినా ఒక్కసంగతుందండీ, రావణాసురుడు అనుకున్నంత దుర్మార్గుడుకాడు లోకులుకాకులు ఇదిగో పులిఅంటె అదిగో తోకంటారు. దున్నపోతు యీనిందంటె దూడనుగట్టివేయమంటారు కాకపోయినా రావణాసురుడు సామాన్యుడా బ్రహ్మదేవునకు మునిమనుమడు పులస్త్యబ్రహ్మకు మనుమడు విశ్రవసుబ్రహ్మకు కొమారుడు నాలుగువేదములు తు, చ, తప్పకుండా గట్టిగావచ్చును. సామవేదంలో పెట్టింది పేరు, భక్తి జూడవస్తే అసాధారణ మయింది. రోజూ నవకోటిశివాలయాలు పూజ్జేసేవాడు. తపస్సుచేసినప్పుడు తొమ్మిదితలకాయలు తామరపువ్వుల్లాగు కోసి హోమంచేసి వేశినాడు పరాక్రమ మెటువంటిది కైలాస పర్వతం చేతులతోయెత్తి గడగడలాడించాడు. దేవేంద్రుణ్ణి ముప్పాతిప్పాలు పెట్టి మూడుచెరువుల నీళ్లుతాగించాడు ఆకారముజూడవస్తే పదితలలు. ఇరువై చేతులు ఎవరున్నారయ్యా ఆలాంటివాడు మళ్ళీని. పాపము మంచిబ్రాహ్మడు రావణాసురుడు. ఆమండోదరి మంగళసూత్రం గట్టిగావుండవలెపాపం బతకవలె రావణాసురుడు లక్షయేండ్లు బతకవలె కాక పోయినా యీరాములవారేమిటయ్యా పనికిమాలిన ఆడది కైక అడవికి వెళ్ళమంటేవెళ్ళడమే చచ్చుఘటమయ్యా, త్రాణలేదు. అందుకే అతనికరణ్యం తగివుంది ఆశూర్పణఖ ముక్కు చెవులు, గోయించడమేమిటి? పనిలేని మంగలి పిల్లితల గొరిగాడన్నట్లు. పైగా ఆసీతాదేవి తెలివేమిటి? తనకోసం లక్ష్మణస్వామి కాపుంటే అతణ్ణి

నోటికిరాని పాటలుకూసి సాగనంపింది. అటువంటి తెలివితక్కు౼వ వారి కిటువంటికష్టాలు రాకమానుతవా? చేతులార తెచ్చుకున్నవి గనక అనుభవించనీ స్వస్తి; రావణాసురుడికి స్వస్తి.

ద్వితీ—ఏమయ్యా? రామస్వస్తి; రావణస్వస్తి ఒకచోటనే వచ్చినది.

ప్రథ—ఏమయ్యా! ఒస్తే తంటాఏమిటి? ఎవడుగెలిస్తే వాడే మనవాడు గెల్చినకోడేమంది. పేలిన టపాకాయేమంది. చెల్లిననాణెమే మంది ఎవడెల్లాపోతేమునకేమి? మనకు స్వస్తిగావలె నుండు.

ద్వితీ—ఛీ! నీవంటివాడితో మాట్లాడగూడదు. ధర్మాత్ము డయిన రాముడే గెలువవలె దురాత్ముడయిన రావణాసురుడు నశింప వలెనని యెల్లప్పు డొక్కమాట మీాదనే యుండవలెనుగాని యిన్ని మాటలు పనికిరావు. నడు! అవతలికి.

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు)

---

## దెబ్బ దేవేంద్రలోకము.

నాపేరు సింగన్నపంతులు. నాకిప్పటికి డెబ్బైయేళ్ళున్నాయి. ఏభైయేళ్ళనుంచి నేను బడిపంతులుపని చేస్తున్నాను నాదగ్గర చదువు కొన్నాళ్ళెందరో బాగుపడి యుద్యోగాలు చేస్తున్నారు. మొదటినుంచి కూడా నాసిద్ధాంతమేమిటంటే దెబ్బ దేవేంద్రలోకమని. బడితెబాజా చేస్తేనేగాని చదువులు రావని సంధ్యలురావని పిల్లవాళ్ళు బాగుపడరని బుద్ధిమంతులుకారని నాయభిప్రాయము. ఈయభిప్రాయముతోటే నే నొక యర్ధశతాబ్ద ముపాధ్యాయుడనై యున్నాను. నేను కోదండాలు వేయించాను. ఈతజువ్వలతోను కఱ్ఱలతోను గొడుగుకామలతోను చేతి కేమిదొరికితే దానితోను బాది, యేమీాదొరకకపోతే దేవుడిచ్చిన చేతి

తో మొటికాయలు కొన్ని గుద్ది చరుపులువేసితొడపాశములుపెట్టి చెంపకాయలుగొట్టి బుగ్గలు సాగదీసి గిద్దెడునూనె యింకేటట్టు మొట్టికాయలుమొట్టి యెండలో నుంచోబెట్టి అన్నానికి వెళ్ళనియ్యకుండా ఆపి గోడకుర్చీలు వేయించి వీపులమీద బరుపులెత్తి యింకా అప్పటప్పటికి నాబుద్ధికుశలతకొద్ది తోచినశిక్షలుచేసి బాలురను బాగుచేసినాను. నాజీవితకాలమంతా పిల్లవాళ్ళబుద్ధికోసమే ధారపోసినాను. నాపేరుచెపితే పిల్లలకు హడలు సింగన్నపంతులుపేరు వింటే నిద్రపోతూన్నపిల్ల లులికిపడి లేచేవారు. పంతులుగారూ నేనల్లరచేయుడము లేదండని నిద్రలో పలవరించేవారు. పిల్లవాళ్ళు పెద్దవాళ్ళై నాదగ్గర చదువులుమానేసి వ్యవహారాలు చూచుకుంటూన్నప్పుడుకూడా నేను కనబడితే గడగడలాడిపోయేవారు. శరీరము ముచ్చెమటలుపోసిపోయేవి. రెండుమూడేళ్ళ పిల్లలు మారముచేస్తూంటే తల్లిదండ్రులు సింగన్నపంతులూ అని పిలిచారంటే మారముమానేసి మూగవాళ్ళలా కూర్చునేవారు. ఇంతెందుకు నాపేరంటే సింహస్వప్నము ఆలాగుండబట్టే పిల్లలు బాగుపడ్డారు. గోడదగ్గిర కూర్చుని పిల్లవాడు చదువుతూ తప్పుచదివాడంటే తలకాయ గోడకువేసి కొట్టేవాణ్ని. గోడబెల్లులూడి క్రిందపడేవి. ఆలాటిరోజులు పోయినాయి. ఆదినములు వేరు. ఆచదువులు వేరు. అందుకనే అప్పుడు బాగా చదువువచ్చేది. ఇప్పుడు ఓ అంటే ఢం రావడంలేదు. ఎందుచేతంటారు. దెబ్బలు కొట్టకూడదనడంచేత. ఏవోరూల్సు వచ్చాయట వీళ్ళరూల్సు మండిపోను. పిల్లవాళ్ళను బండలనుచేయుటకే రూల్సువుట్టాయి. నావంటివాళ్ళు యీరోజులలోగూడ కొందరు బయలుదేరినారు గనుక నాకు చాలాసంతోషముగా నున్నది. చెన్నపట్టణములో గొప్పయొక కాలేజియున్నదట ! అక్కడ తెల్లవారే యుపాధ్యాయులట. ఆయన మహాతపోధకుడుకూడానట. అటువంటాయన పెద్దపెద్దక్లాసులలో చదివే విద్యార్థులను వీపుమీదబట్టవేయించి వీపుబద్దలయ్యేటట్టు పిఱ్ఱతో

ఖ్యాగిరేటట్టు బహుచమకుగా బజాయించినాడట. ఆమాటవినగానే భేష్‌వహాయని నేను చంకలు కొట్టుకొన్నాను. ఈ శ్రోత్రియాల్నువచ్చి విద్యార్థులు పాడైపోయిన యీరోజులో ఒకానొక దొరగారు అచ్చంగా నామోస్తరుగానే శిక్షలుచేశాడంటే నాకు పరమానందముగానుంది. పూర్వము మనవాళ్ళున్నాయని చెప్పినవన్నీ యిప్పుడు కొందరు సంస్కర్తలు లేవన్నారు. అవిదొరలు వున్నాయన్న తరువాత మన వాళ్ళొప్పుకొంటున్నారు దెబ్బ దేవేంద్రలోకమన్న బడితెబాజా సిద్ధాంతముకూడా దొరలువప్పుకొని న్యాయముగాచేసినారు. గనుక మనవాళ్ళు కూడా వెనకటివిచ్చినమ్మకాలు మానేసి మాసిద్ధాంతములోకే వస్తారని నమ్ముతున్నాను. కాబట్టి యుపాధ్యాయులంతాకూడా ముందాలాగే చేయవలసినది.

---

## వృద్ధవివాహము

### 1 రంగము

(సింహాద్రవధాన్లు, వెంకప్పవధాన్లు ప్రవేశింతురు)

సింహా—వెంకప్పవధాన్లూ ఇంకా యెంతదూరం వుంటుంది శాంవయ్యగారిల్లు ?

వెంక—ఏవిటయ్యా సింహాద్రవధాన్లూ! ఈకాస్తదూరంమే నడవలేకుండావున్నారు.

సింహా—ఆ! నడవలేకుండా వున్నాననుకున్నావా యేమిటి! ఎంతదూరంవుందో అని వూరికే భోగట్టాకడిగినాను.

వెంక—అయితే ఆవొగర్చడమెందుకూ ?

సింహా—అయ్యో గ్రహాచారమా? అల్లాంటావేమిటి! నేనెంతడారుఢ్యమైన వాణ్ణో తెలుసునా ?

వెంక—చిన్నప్పుడా ?

సింహా—ఆహా ! ఇప్పుడు మాత్రమో ! నాతో నువ్విప్పుడు మినుమనున్నుండలు తిను చూస్తానూ ! అసలు నాలా వోపిగ్గా కూర్చుని పనిచేసేవాడేడీ ! తాటాకుతో చాపల్లుతాను, చదరల్లుతాను, బుట్టల్లుతాను, కత్తివర్లల్లుతాను, కూజాబుట్ట లల్లుతాను, సులోచనాల జోడువరల్లుతాను, పుస్తకాలసంచు లల్లుతాను. ఇల్లా వోహ శేవిటీ ! నీచిత్తం వచ్చినన్ని పనులు చేస్తాను. అన్నట్టింకా చేదలు విసినికఱ్ఱలు మడతవిసిని కఱ్ఱలు, యిల్లాంటివి లెక్కేలేదు.

వెంక—అబ్బో ! అయితే మీా రింద్రాళ్ళకన్న కూడా బాగా నయమే అన్నమాట. అయితే యివన్నీ యెప్పుడు నేర్చుకున్నావయ్యా. ఓపికతగ్గి తిరగడం మానేశాకా యేవిటి ?

వెంక—అదుగో ! అల్లాంటేసే కోసం వొస్తుంది. ఓపిక తగ్గడ మేవిటి ఆసందర్భం.

వెంక—సరే ఆమాటకేం గాని, ఇదిగో పెళ్ళివా రింటిదగ్గిరి కొచ్చాం, అక్కడ ప్రస్తావనలో చెప్పవలసిన మాటలన్నీ జ్ఞాపకమున్నాయా ? ముందే చెప్పు ఆనక రసాభాసు చేశావంటే నీపెళ్ళి కుదర్చడం కోసం నువ్వు నాకిచ్చిన నూరు రూపాయలు యెగెయ్యడం సరేకదా యీావ్యవహారం కేసి తిరిగి చూడనైనా చూడనన్నమాట అంచేత ముందీమాటకు జవాబు చెప్పు.

సింహా—ఏమాటికి ! వయస్సేభై సంవత్సరాలని చెప్పడమా !

వెంక—అంతేనా ?

సింహా—ఇంకేవిటో ! ఇప్పుడు పెళ్ళాడ్డంపిల్లలకోసవా అందు కోసవా అని చెప్పడమా !

వెంక—అందుకోసవేటయ్యా ! స్పష్టంగా చెప్పు.

సింహా—ఇంకేవుంది ! సంరక్షణా అగీ అనడమా !

వెంక—అ దేమిటయ్యా! నీఅడికులా. మీా యింట్లోవాళ్లు నీలాంటి మొగవాళ్ళకి తొంబైమంది కిల్లాంటి సంరక్షణలూ, ఇల్లాంటి అదిలూ చేస్తారన్నమాట లోకమంతా యెరుగుదురు. అందుచేత సంరక్షణకోసమంటే చాలదు. ముఖ్యమైనమాట మరచిపోయావు.

సింహా—ఏవిటి చెప్మాఅదీ! జ్ఞాపకం రాకుండా ఉందీ!

వెంక—అయ్యో! మందమతా! ఎగ్గుం చేస్తానని చెప్పమన్నాను కాట్రయ్యా!

సింహా—ఆ! ఔనౌను నిజమే జ్ఞాపకం వొచ్చింది అవునుకాని నాకు డబ్బాలేదు. నోట్లోముక్కాలేదు. ఎల్లాగెగ్గం చెయ్యడం?

వెంక—డబ్బులేదుగనుకనే ఎగ్గంచెయ్యడం. ఎగ్గవని కూంచిస్తే జోలిడబ్బాస్తుంది. ముక్కా మ్మాట్రా అవొచ్చిన సంధ్యావందనం ముక్కలే చాలు, సరే; దానిమ్మాటకేవి యిష్టవుంటే యేదో చెయ్యవొచ్చు. లేకపోతే మానెయ్యొచ్చు. ఆమాటకేంగాని, ప్రస్తుతం చేస్తాననిమాత్రవను. ఇదిగో పెళ్లివారిల్లు: చెవట తుడుచుకో నిబ్బరంగా నడిచిరా.

సింహా—ఇంకా పెళ్ళీలే దేవీలేదు. పెళ్లివా రిల్లంటున్నా వేవి టప్పుడే.

వెంక—ఇల్లావిను, నేనన్నట్లా నువ్వువింటూంటేనీకుపెళ్ళికాకపోడమేమిటి చెప్పు. నా మంత్రాంగాలవల్ల వీటిబాబుల్లాంటి పెళ్ళిళ్ళు చేయించేసాను. అల్లాంటిదీపెళ్ళి చేయించడము అనగా యెంత! చచ్చు ముండాపెళ్ళి.

సింహా—ముండాపెళ్ళనకయ్యా బాబూ!

వెంక—కాదు సంగతి చెప్పాను, నడు లోపలికి గుమ్మాలు మెల్లిగా యెక్కు.

(ఇద్దరు నిష్క్రమింతురు)

2 వ రంగము.

(అప్పుడు కామయ్య భార్య మంగమ్మ, కుమార్తె సత్యమ్మ ప్రవేశింతురు.)

మంగ—ఏమేసత్తీ! ఇప్పుడొచ్చిన తాతని పెళ్ళాడతావా, రాముడుబావని పెళ్ళాడతావే!

సత్య—రాముడు బావనే పెళ్ళాడతా!

మంగ—ముండా! రాముడుగాడైతే నగలేవీ పెట్టళ్ళే! తాతైతే చాలానగ లెడతాడు.

సత్య—ఓశీ! ఐతే తాతనే పెళ్ళాడతా!

మంగ—అబ్బే! తాతముసిలాడే! రాముడుబావైతే యెం చక్క చిన్నవాడు, ఎంతో చక్కగావుంటాడు.

సత్య—ఊ! ఐతే రాముడుబావే కావాలి,

కామ—తాతని పెళ్ళాడతే చాలనగ లెడతాడే

సత్య—ఊఁ! ఐతే మరీ ఇద్దర్నీ పెళ్ళాడితా.

కామ—ఓసీ ముండకానా! నీకడుపులో ఎల్లాంటుమాలున్నాయే!

మంగ—(ముద్దిడుకొని) నాచిట్టికన్నెది నాబంగారుతల్లేది నావరహాలమూటేది వెర్రితల్లీ? పో ఆడుకో (పిల్ల గెంతుచూపోవును)

మంగ—అవునుగాని మరి మీమేనల్లుడు రాముడుకాస్తిలేదని కట్నందాన్నివ్వనంటున్నారుగదా! యింకెవ్వరిస్తానంటారేమిటి? నిశ్చయం చెప్పండి.

కామ—అదే ఆలోచిస్తూంటే యింతట్లోకే సంబంధం వొచ్చింది.

మంగ—ఈయనెవరేమిటి?

కామ—సింహాద్రివధాన్లుగారని మనవాళ్ళే గొప్పాస్తిపరుడు, మనకుఱ్ఱదానిస్తే రు 500 లు నగలెట్టి రు 300 లు రొక్కం యిస్తానంటున్నాడు. నగలైదువందలు, రొక్కం అయిమువందలు, యిచ్చి ఉభయఖర్చులు పెట్టుకోమంటున్నాను, చిన్నపిల్లయని సంశయిస్తున్నాడు కాని లేకపోతే ఆకాడికిచ్చేనేవాడే, ఇంకా యిల్లావుంది బేరం;

మంగ—ఏపిటో! అల్లా యిచ్చినాసరేకాని యీముసిలాడికివ్వడం నాకేమీ యిష్టంలేస్నుమండీ! అరవయ్యోవడెళ్ళి డబ్బయ్యోవడొస్తూంటే యింకాపెళ్ళి. పిల్లనివ్వడమూ, యేమిటి.

కామ—ఆ! డబ్బయ్యేఉంటాయో, యెనభయ్యేవుంటాయో ఆయిన్ని నేనడగలేదనుకున్నావా యేమిటి? యాభయ్యో సంవత్సరవింకా వెళ్ళలేదని చెప్పాడు తలల్లాకాస్త నెరిస్తేనరా? శరీరవెల్లా గుందో చూడు! పిక్కలాగ.

మంగ—మనిషిపొట్టేమీ దల్లా కనపడుతున్నాడు అంతేకాని యేళ్ళుతక్కువుండవు ఐతే యిది మొదటిపెళ్ళా? రెండోపెళ్ళా?

కామ—అబ్బే! మొదటిపెళ్ళా మీమధ్యేపోయిందట. ఇది రెండోపెళ్ళి.

మంగ—ఆవిడికేవన్నా పిల్లలా?

కామ—లేరనుకుంటాను. మొగపిల్లలుంటే యీపెళ్ళి అవసరం లేకపోవునన్నాడు.

మంగ—పోనిస్దురూ! లేకపోతే పెంచుకోకూడదూ!

కామ—అన్నట్లింకోమాట చెప్పాడు. ఈయనేమో యెగ్గంచేస్తారుట. పెళ్ళాం లేకుండా యెగ్గం చేయకూడదట. అంచేత యెగ్గంచేయడంకోసం యిప్పుడు పెళ్ళిచేసుకోవల సొచ్చిందన్నాడు.

మంగ—ఏవిటో! షష్ఠి పూర్తయిపోయిన ముసిలాడు—మీ

రేం చేసినా సరేకాని పిల్లనిమాత్రం ఆముసిలాడి కివ్వడాని కొల్లకాన్నమండీ !

కామ—ఆఁ! వొల్లకాదేవిటీ! బోలెడా స్తికలిసొస్తుందనిఆ రెండో ఆయన చెప్పాడు కూడాను. వెట్రిప్పు పట్టను

(అంత కాశీపతి. చెల్లప్ప యెడముగా ప్రవేశింతురు)

కాశీ—ఏవిటయ్యా ! చెల్లప్పగారూ ! ఈముసిలిముండాకొడుకు మనమీాదికి పోటీకొచ్చాడేం ?

చల్ల—ఏముసిలాడూ ?

కాశీ—సింహాద్రవధాన్లయ్యా ఇప్పటి కైదారు సంబంధాలు మనకన్నా ముందు వెతికేశాడు. ఆ వెంకప్పవధాన్లతని కెంతో సాయం చేస్తూ సంబంధాలు చూసిపెడుతున్నాడు.

చల్ల—నేనూ చూస్తున్నాను కాదుమరీ ! ఇదివర కేదో అయిపోయిందికాని, ఈకొత్త వంబంధంమాట అవధాన్లుగారికి తెలిసుండదు.

కాశీ—అయితే సరే ! ఏదో ముడెట్టించెయ్యి ఆమట్టుకు యే గుళ్లోనో తదిగిణ్ణాత్తాఅని ముడెట్టేసి తీసుకుచక్కాపోతాను. తీరిపోతుంది. ఇదుగో మరోమాట ఓవందో, యేభయ్యో అటూయిటూచూడొద్దు పిల్ల దొరికుతే చాలు సొమ్ము పారెయ్యడవే. ఏదో తట్ట తగలవెయ్.

చల్ల—అల్లాగే ! అదుగో ! కావయ్యగారిల్లు. దయచెయ్యండి.

కాశీ—ఓ ! పదండి. తలు పేసుందేం ? యీాగుమ్మవేనా ? పిలవండి.

చల్ల—ఏవండోయ్.

(లోపలినుంచి)

"ఎవరువారు?"

చల్ల—తలుపుతియ్యండి. నేను.

"నే ంటే యెవరూ ?"

చల్ల—యెవరూ లేరు. నేనేనండీ!

"నేనేనండీ యేవిటి యెవరంటేను ?"

కాశీ—తలుపుతియ్యండీ! మేమని చెప్తూంటేనే!

"మేమేవిటి మీశ్రాద్ధం పేరు లేదూ ?"

కాశీ—ఆ! తిడుతున్నారేవిటి ? శుభమ్లేసు.

చల్ల—నేను చెల్లప్పనండి! తలుపు తియ్యించండి.

(తలుపు తెరచి కామయ్య ప్రవేశించును)

కామ—ఓహోహో! మీరటండీ! వొద్దిగుమ్మా నొచ్చే రేం? దయచెయ్యండి

చల్ల—చిత్తం. చిత్తం. ఇలా కూర్చుంటాం.

కామ—లోపలికూడా యిల్లా చూపమీా దయచెయ్యండి.

కాశీ—అక్కర్లేదండి! యెక్కడైతేనేవిటి! (అంతా కూర్చుం దురు, వంటనిమిత్తము మంగమ్మ లోనికి పోవును)

కామ—ఇల్లా దయచేస్తిరి. దేవిటి మామీాదివాళ.

కాశీ—మాదయేవిటి, అంతా మీాదయతోటే వుందిహా.

చల్ల—ఏమండీ కామయ్యగారూ! మీా అమ్మాయి వివాహం మాటేమాలోచించారు ?

కామ—ఏవిటోనండీ సింహాద్రివధానులుగా రిప్పుడే చూసు కెళ్ళారు.

కాశీ—ఆఁ! అప్పుడేరావడం! చూసికెళ్ళడం కూడా అయిందీ తద్ధిగిణతొ అని!

చల్ల—అప్పుడే యిక్కడి కహ్కాడా వొచ్చాట్టండీ! లేదను కున్నాను. అయితే యింకా మాటివ్వలేదుకదా!

కామ—ఇంకాలేదు. కాని నెంత నేపివ్వాల్లేండదీ, నేనన్నట్లు

యిదువొందల రూపాయిలనగలు అయిదువొందల రొఖ్ఖం యిచ్చి ప్రభుత్వఖర్చులు పెట్టుకుంటే యిప్పుడిచ్చేస్తాపిల్లని.

కాశీ—మంచి ఘట్టివాల్లాగే వున్నారండోయ్ 70 యేళ్ళ ముండావాడు ఆ స్త్రీలే దేవీ లేమ వాడికి. అల్లాంటివాడికిస్తానంటారేవిటి ? వాడి వీబూదిపెండికట్టూ, బిళ్ళగోచులూ చూసివ్వాలి పిల్లని అంతే వాడికున్నాస్తి.

చల్ల—ఆమాట నిశ్చయవేనండి వీరికున్నాస్తిలో నాలుగో వొంతేనా వుండబాయినా స్తి.

కాశీ—నాకున్నాస్తిలో అంటారేవిటి? నాచేతినున్న మురుగులు పాటిచేసూ ? వాడిబతుకంతాను పోనీ ! ఇల్లాంటి తమ్మిళ్లేజన్మంలో నయినా పెట్టుకున్న పాపాన్ని పోయాడూ ? అదంతాయెందుకు ? బ్రాహ్మణార్థం గుడ్డముక్కలుతప్ప యిల్లాంటి ఝరీ కండువా వాడి జన్మమధ్యంలో చూర్ణైనా చూశాడూ !

చల్ల—నిజమే ! ఇవన్నీ కూడా వీరి స్వంతవేనండి వీరిది జోలి డాస్తి. మీఅమ్మాయి నామసిలాడికిచ్చి మోనపోక వీరికివ్వండి. ఏదో ఓమో స్తరుగా వ్యవహారం పైనలు చేసుకుందాం.

కామ—అల్లాగ్గే; కాని ! యేదో ఓమోస్తరేవిటి ? నేలన్న కాడికి దమ్మిడీ తగ్గడానికి వీల్లేదు.

చల్ల—అల్లాకాక్కుడు. నేమనవిచేసే దేవిటంటే;—చిత్తగించారా ! ఓనంగ ఆలోచించాలి ఆయనకంటె ఈయన యఱ్ఱగా బాగుంటారు. ఆస్తి వీరిదిగొప్పది. వయస్సులోనా ఈయునచిన్న. అంచేత సొమ్ము విషయంలో కొంచెం తగ్గించాలి.

కామ—ఏమిటో ! రూపంలో యిద్దరూ వొకాటే. చూశాతా ఆస్తిమాటంటే మనవిచేస్తా. వెళ్ళిముందర కనపరిచేఆస్తి నిప్పుతూ

నమ్మకూడదు, మనవర్తివ్వావల సొచ్చినప్పుడిందులో నాలుగోవొంత్తైనా కనపర్చరు. ఇంక వయస్సులోనా ? ఇద్దరూ ముసిలాళ్ళే. అంచేత తగ్గించ డానికి వీల్లేదు.

కాశీ—ఆఁ ! ఏమిటయ్యా ! ముసిలాణ్ణంటావు; సింహాద్రివ ధాన్లుకన్న భాగా పది పదిహేనేళ్ళు తక్కువుండాకోమనుకుని నేను. ఆ భాగానికేం డబ్బు నువ్వొన్నట్టిస్తాను. కాని వూరి పిల్లవయస్సెంత ? ఈ యేడు కాపరాని కొస్తుందా ?

కామ—అయ్యో ! చిన్న పసికూ ననుకున్నారాయేమిటయ్యా ! అప్పుడే యీయేడారుసంవత్సరా లెళ్ళొచ్చాయి. మీాదటి కేడు సంవ త్సరాలెళ్ళి యెనిమిదో సంవత్సరం కూడా వెళ్ళిపోతుందన్న మాట. వయస్సులో లోపంలేదు. పవర్తాడిన వెంటనే కాపరానికి చక్కగా వస్తుందన్న మాట.

కాశీ—సరే ! ఆపైని పిల్లల్ని కూడా కంటుందన్న మాట. ఏమిటయ్యా ! పిల్లకిప్పుడయిదేళ్ళున్నాయని తెల్పావు. తద్దిగిణ్ణాత్తాఅని.

కామ—ఆఁ ! యేమిటయ్యా ! యెక్కడో సాంబయ్యలాటి వాడు తప్ప మన బ్రాహ్మల్లో పెళ్ళి చెయ్యకుండా యింతకన్న వయ సొచ్చేదాకా వుంచుతారాపిల్లని.

కాశీ—ఎవరాయనపేరు ?

చల్ల—ఎవరో సాంబయ్యట !

కామ—"ఎవరో" అంటారేం ? మీారెరుగరటయ్యా ! ఆబాజ్జా వాడూను. బ్రాహ్మణపరువంతా తీసేశాడీమధ్య.

చల్ల—ఏంచేశాడు ?

కామ—ఇంతా అడుగుతారేమిటి. కొంపతీసేశాడు. ఈయనగా రన్నట్టు వాడికూతురొహర్తికి బాగా పదివద్దాలు గెళ్ళొచ్చేదాకా డబ్బుకోసం పెళ్ళిచేశాడుకాడు. ఆముట్టుగా దభీలుమని నవర్తాడేసింది. అయితే తల్లీవాళ్ళూ మాచెడ్డవాళ్ళులెండి. వెలేస్తారేమోఅని శేదనిదబా

యించేశారు. కాని ఆకుఱ్రదానివల్లే నానాఅల్లరీ అయిపోతూంది. ఇప్పటి కూడా ఆపిల్లకి పెళ్ళికాలేదు. చిత్రం.

కాశీ—అల్లానా! అయితే చల్లప్పగారూ! జరుగురుగా మన వోచోటి కెళ్ళాలిరండి. కామయ్యగారూ! మళ్ళీకలుసుకుందాం సెల విప్పించండి.

(అంతా నిష్క్రమింతురు.)

౪. రంగము.

(సింహాద్రవధాన్లు. వెంకటప్పవధాన్లు ప్రవేశము.)

సింహా—ఇంకా పెళ్ళితేదేవీ లేదుగాని, నీ యిష్టవొచ్చినచోటు కల్లా తిప్పి చంపుతున్నావు.

వెంక—నాకోసవాయేవిటి తిప్పుతూంట. ఇందాకటి కావయ్య కూతురు పెద్దదేలని ఒకళ్ళు చెప్పబట్టి యిల్లాదగాపడ్డాంగాని, యిప్పుడు మనంచూడవెళ్ళే పిల్లలాంటిదికాదు. గుఱ్ఱంలాంటిపిల్ల యిందాకిటిపిల్లకి నగలూ రొఖం తక్కువిస్తానని ఋమపెట్టి తప్పించుకు రావలసొచ్చింది కాని యీపిల్ల విషయంలో అల్లా అక్కర్లేదు. పిల్లనిచూస్తే నువ్వొదల నన్నమాట.

సింహా—అల్లాగేం! అయితే త్వరగాపద. లేకపోతే యీలోపున యేకాశీపతో చప్పుని చూసుకుపోగలడు.

వెంక—ఫరవాలేదు. పద. అదుగో సాంబయ్యగాదు వీధరుగు మీద కూర్చుని మనకేసి చూస్తున్నారు. రా. కలుసుకుందాం (సాంబ య్యను సమీపింతురు.)

సాంబ—ఒహోహూ! వెంకప్పవధాన్లుగార్లాగున్నారు!

వెంక—చిత్తం. చిత్తం. దయచెయ్యండిబాబూ!

సింహా—చిత్తంబాబూ. చిత్తం.

సాంబ—ఈయనెవరండీ.

వెంక—సింహాద్రవధాన్లుగారని, గొప్పవారు మంచి స్వాధ్యాయవేత్త.

సాం—అలాగాండి. ఇల్లా సావిట్లోకి దయచెయ్యండయ్యా!

సింహా—చిత్తం. చిత్తం. (అంతా సావిట్లో చాపమీద కూర్చుందురు.)

సాంబ—ఇంటిదగ్గిరనుంచేనా రావడం.

వెంక—చిత్తం. చిత్తం. పిల్లాజల్లా అంతా క్షేమమా?

సాంబ—మీదయవల్ల.

సింహా—తమకెంతమందండి సంతానం!

సాం—అయిదుగురు మొగపిల్లలు ఇద్దరాడపిల్లలు, నండి.

వెంక—అయితే, సాంబయ్యన్న గారూ! వివాహం యెంతమంది పిల్లలకి చేశారు?

సాంబ—అబ్బే! ఏదీ! ఇంకాచేద్దా మనుకుంటూం టేనే పెద్ద కుర్రవాడు జర్వవొచ్చి పోయాడుగదా! ఇంక రెండోవాడిప్పుడున్నాడు. వాడికిప్పుడు చెయ్యాలి.

సింహా—పెద్దబ్బాయి పోయాడండిపాపం! తక్కినపిల్లలు చదువు కుంటున్నారు కాబోలు!

సాంబ—లేదుబాబూ మూడోవాడూ, నాలుగో వాడూ వెనక కలరావొచ్చి యిట్టేపోయారు మొన్న పురిట్లోపోయిం దాడపిల్ల. దాని కన్న పెద్దపిల్లవాడుకూడా పురిట్లోనేపోయాడు.

సింహా—అన్నా! పాపం చాలామందిపోయారు.

వెంక—అయితే, యిప్పుడున్నవాళ్లు ఓ మొగపిల్లవాడూ మన పెద్దమ్మాయీ మాత్రవేగాదూ!

సాంబ—అంతే. అంతే.

వెంక—అయితే, అబ్బాయికింకా వివాహం చెయ్యలేదేం.

సాంబ—ఏదీ, ఈయేడు కుర్రదానికీ పిల్లాడికీకూడా ఏకంగా ఏవేనా సంబంధాలు కుదురుతే చేసేద్దావని చూస్తున్నాను. చూశారా, ఈరోజుల్లో మనవనుకున్నట్లు సంబంధాలు జతపడ్డం మాచాలా కష్టవండీ!

సింహా—నిజమేనండి అమ్మాయికి సంబంధంకోసం సంవత్సరము నుంచి చూస్తున్నాను. ఎక్కడా కుదరడంలేదు. సంబంధం చూసిపెట్టుమని మన వెంకప్పనధాన్లుగారితో మనవిచేశాను.

సాంబ—మన కాపుర స్థలవేపూరండి?

వెంక—అయ్యో! అల్లా అడుగుతున్నారేవిటీ! వారెవరో మీకు బాగా తెలియదుకాబోలు. వీరిది మాపూరేనండీ కాపుర స్థలం మనకి సన్నిహితబంధువులే. సాలీనా వీరికి భూములమీద అయిదారు వందల రూపాయిలొస్తాయి. పైగా నాలుగైదు గరిసిలధాన్యం ఆపైన పనసతోటలు, మామిడితోటలు, కొబ్బరితోటలు, అరటితోటలుం యిల్లాంటివిబోలెడు, వీరింటిప్రక్కనున్న ఇళ్ళన్నీ మొదటవీరివే. ప్రస్తుతం అన్నదమ్ముల పంపకాల్లో రెండు పెద్దనాలుగిళ్ళ భవంతులు, నాలుగు ఖాళీపెరళ్ళూ యిల్లాంటి వాపీధులో వారికున్నాయి.

సాంబ—అల్లాగండి.

సింహా—ఏవిటో నాయినా! ఎన్నుంటే నేం అవన్నీ తలుచుకుంటే నాకడుపు చెరువైపోతుంది అన్నింటికి అదిల్లాకుడిభుజంలో వుండేది.

వెంక—ఏవిటో, దైవనిర్ణయానికి మనవేం చేయుగలం అన్నీ తెలిసినవారు తమరు ఇల్లావిచారించకూడదు.

సాంబ—ఏవిటండీ సంగతి!

వెంక—ఈమధ్య వీరిభార్య కాలంచేసింది మంచిబుద్ధిమంతురాలు. అయితేనేం చూశారూ! ఇంతకీ యీఐశ్వర్యం, యీసౌఖ్యం ఇది అంతా అనుభవించడానికి యెవరికి యోగంవుందో మరావిడికి లేకపోయింది.

సాంబ—చిత్తం అంతేనండి. విచారించకం డవధాన్లుగారూ! ఓర్చుకోవాలి. నన్ను చూశారుకాదూ! ఎన్నికష్టాలొచ్చినా తుమ్మ దుక్కలాగెల్లాగున్నానోను!

వెంక—ఏదో, చూశారా, ఇంతకీ ఆవిడ కడుపునో మొగపిల్ల కాయకాసివుంటే ఏదో మోస్తరుగా బాగుండును. మరాయోగం లేక పోయింది. అందుచేతేదో మనవాళ్ళు నలుగురూ పోగయ్యి ద్వితీయ వివాహం చేసికోవలసిందని బలవంతపెడుతున్నారు. ఏదో ఆవున్నాస్తీ గీస్తీ యావత్తూ ఏజ్ఞాతులాళ్ళో వేసుకుపోతే యేవుందిచెప్పండి అందుచేత ఏదో మనవాళ్ళకుటుంబాల్లో కాస్త వయస్సొచ్చినపిల్లలు జోలికిమం దున్నారు. జోలిడాస్తి మంచిసంబంధం, పోనీ దూరంగా పోనియ్యాడవేం అని పిల్లలకోసవాలోచిస్తూంటే చటుక్కున మీఅమ్మాయిమాట జ్ఞప్తికొచ్చింది. అవట్టుగా "దయచెయ్యండిబాబూ పిల్లనిచూతురుగా" అనిచెప్పి యిల్లాతీసుకు చక్కావచ్చాను.

సాంబ—అల్లాగా! అయితే యిదివరకెక్కడనయినా సంబంధాలు చూశారా?

వెంక—లేదండి. లేదండి. ఏదోకామయ్యగారూ, వీరూ, అంతా తమ పిల్లల్ని చేసుకోవలసిందని, ఊవలపలాడారు కాని, పిల్లలికి వయస్సు తక్కువ మనఅమ్మాయైతే అంతకన్న కొంచెంయీడూజోడుగా వుంటుందని చెప్పి యిల్లాతీసుకొచ్చాను.

సాంబ—అటుకూడా చాలామంది పెద్ద కన్యలేవుంటారే. తగిన డబ్బియ్యలేకపోయారు కాబోలు.

సింహా—డబ్బు ఊఁ ఖర్చుపెట్టేస్తూన్నా నిందుకోసం అప్పుడే రెండొందలై పోయాయి.

వెంక—అందులో లోపంచెయ్యడంలేదు. ఖర్చుపెడుతూనే వున్నారు.

సాంబ—ఖర్చుపెట్టాలి లేకపోతేయిల్లాంటప్పుడు పిల్లలు దొర కడంమాకష్టం. రెండుమూడువేలకి తక్కువై తే పిల్లెక్కడేనా దొర కుతుందా! ఎక్కడా యిల్లాగాలించి పెట్టినా ఇల్లా ఆడపిల్లపుట్టడం లేదన్న మాట.

సింహా—మూడువేలే. ముప్పైవందలన్నమాట. అబ్బో అయిదువందలకన్న దమ్మిడీ యెక్కువివ్వను.

సాంబ—ఇవ్వకపోతే మానుకోవయ్యా!

వెంక—అవధాన్లుగారూ ! తొందరపడకండి. మనవిచేస్తా సాంబయ్యన్నగారూ, ఆభాగంవెనకనుంచి మాట్లాడుకుందాంకాని; ముందుగా పిల్లనోపర్యాయం పిలిపించండి. అవధాన్లుగారు చిత్తగిస్తారు. ఆపైని మీచిత్తంవచ్చినట్లూ వ్యవహారం పైనలొతుంది.

సాంబ—చూసుకోవయ్యా! పిల్లకేంలోపం లేదు. మాణిక్యం లాంటిపిల్ల. ఏవేఁ ! ఔనే ఒహోయ్!

(ఇంటిలోనుంచి భార్య) "ఏం?"

సాంబ—కుఱ్ఱదాన్ని యిల్లా ఓమాటుపిలవించూ!

"యిక్కడలేదమ్మా; దిక్కుమాలిన ముండయెక్కడికిపోయిందో కాని పొద్దున్నగాపోయింది. ఒక్కమాటేనా యింట్లోవుండదుగదా.

సాంబ—శంకరంగారింటివేవుంటుందే! ఒక్కకేకెయ్యి.

సింహా—శంకరంగారెవరండి?

సాంబ—మనవాళ్ళపిల్లాడే, వెనక మాఅబ్బాయితో చదువు కోడానికొస్తుండేవాడులెండి. ఆపరిచయాన్ని మాపిల్లలక్కడికి వెడుతూ వస్తుంటారు.

వెంక—ఆయనిప్పుడేం చేస్తుంటారండీ.

సాంబ—ఆయ నింగ్లీషుచాలామట్టుకు చదువుకున్నాడు. పట్నం న్నుంచాయనికేవో పేపర్లూ అవీవస్తుంటాయ్, మాబాగా చదువు తారండాయన. తెలుగుపుస్తకాలు; పద్యాలు, యింగ్లీషుసంగతులు, అన్నీ క్షుణ్ణంగా తెలుసునాయనకి మాఅమ్మాయికవంటే మాయిష్టం పాపం, అన్నీ చెబుతారాయన

సింహా—అతగాడెవరయ్యా! పిల్లక్కడికెళ్ళి కూర్చుందేం?

వెంక—అదుగో! అమ్మాయొస్తోంది, (సాంబయ్య కూతురు ప్రవేశించును.)

సాం—దాఅమ్మా! ఇల్లాకూచ్చో.

(దగ్గిర కూతురిని కూర్చుండ బెట్టుకొనును.)

సింహా—మీఅమ్మా యీపిల్లేనాండి? పెళ్ళికూతురీపిల్లే?

సాంబ—చిత్తం,

వెంక—యేం అల్లాఅడుగుతున్నారు. పిల్లేవుగావుందనా?

సింహా—కాదు సంగతూరికే:—

(వీధిలోనుంచి)

"మాలక్ష్మి! నీపుస్తకం మరిచిపోయావుట. ఓ మాటొచ్చి వెళ్ళిపో"

మహా—మళ్ళీయిప్పుడేవస్తానుండునాన్నా ! (నిష్క్రమించును)

సింహా—అయ్యా! పిల్లవయ్యస్సెంతండి?

సాంబ—అబ్బే! ఏపాటోనాండి! అంతా మొన్న మొన్ననే పద మూడో సంవత్సరం వెళ్ళింది ఏవిటో మావాళ్ళేయేడేనా పెళ్ళిచేసేస్తే నేకాని వొల్లకాదని తొందర పడుతున్నారు.

వెంక—అవునండిమరి తొందరపడవలసిన మాటనిజవే. ఎక్కడో

రాజుల్లోను శూద్రుల్లోను అక్కడాతప్ప మనవాళ్ళలో తప్పకుండా యీ పాటికి సవర్తాడి తీరతారు.

సాంబ—అబ్బే! యింకా రజస్వలకాలేదయ్యా! కిట్టనిముండా కొడుకులూరికే అల్లాంటారంతే.

వెంక—అల్లానాండి చిత్తం అయితే ఎంచేత చెప్పండి. వాళ్ళంత అపవాదెయ్యడం.

సాంబ—ఏవని చెప్పను బాబూ! మూదినవ్వుల సామాన్యం. ఇంతపవాదని మీ రాశ్చర్యపడుతున్నారు. అక్కడితో వూరుకొన్నా రనుకున్నారా యేవిటి.

వెంక—ఆ! యింకా యేవంటారు?

సాంబ—అయ్యో! కిట్టనప్పుడే వాదేవిటి బాబూ! అల్లవాణ్ణి చూసి ఏదోఅందిఅంటే, ఇల్లా ఒహాటేమిటండీ. ఓర్వలేనిముండామాట లెన్నైనా అంటారు. అవి నమ్మకూడదు.

వెంక—నిజవేనండి. లోకులు నిజం కనుక్కొని మాట్లాడరు.

సాంబ—చూశారా! యింకా మా అబ్బాయిని గురించి యేమో దుర్మార్గ సావాసంచేత యిల్లూ వళ్ళూ పాడుచేసుకుంటున్నాడని అంతా అంటూంటే నిజం కనుక్కొని నేను కూడ వాణ్ణి చీవాట్లు పెడుతూ వచ్చాను. అంతేకాని నిష్కారణంగా ఆడపిల్లని పట్టుకొని నలుగురూ యిల్లాంటూంటే నా ప్రాణం మా వుసూరుమంటూంటుందండి.

వెంక—నిజవేనండి. నిజవే.

సింహా—(తనలో) అంతుంది. ఇంకా సవర్తాడలేదంటాడు. కొంపతీసి మానకమ్మగానే కాదుగదా! ఏమో పాపకర్మం అల్లాగైతే నాకెందుకు నెత్తిమీదికి. అయితే పిల్లమాత్రం మాపనందుగా వుంది. మరోమాటు చూద్దాం. (పైకి) అయ్యా! మరోమాటు పిల్లనిల్లా పిలిపించండి.

వెంక—అదుగో! ఆపిల్లే యిల్లావొస్తూంది.

(మహాలక్ష్మి ప్రవేశించును)

సాంబ—(పిల్లను దగ్గర కూర్చుండబెట్టుకుని) ఏఁవే! మళ్ళీ యెక్కడికి పరిగెట్టావు?

మహా—ఈ పుస్తకం శంకరంగారింట్లో మరచిపోయాను. పట్టి కెళ్లమని కబురంపితే తెచ్చుకోడానికి వెళ్ళాను.

సింహా—అమ్మాయీ! నీపేరెవరమ్మా!

వెంక—"అమ్మా!" అనకయ్యా! బాబూ!

సింహా—లేదు, లేదు, అల్లాచక్కావొచ్చింది. నీపేరెవరుపిల్లా!

సింహా—చెప్పమ్మా! చెప్పా తప్పులేదు.

మహా—మాలక్ష్మిని.

వెంక—బస్. సరిగ్గా మాలక్ష్మిలాగే వుంది. అమ్మాయి! అదేం పుస్తకం?

మహా—సుజ్ఞానోదయుం.

సింహా—అబ్బో! ఘట్టిపుస్తకవే!

సాంబ—ఆ! కొత్తదేనండీ! వెనక బళ్లో బహుమ తిచ్చారు దీనికిది.

మహా—అది కాదిది. అది మానవతీచరిత్ర. ఇది శంకరంగారిది చదువుకోడానికిచ్చారు.

సింహా—ఏదమ్మాయి! ఈజ్ఞానంపుస్తకంలోదోపద్యం చదువు.

సాంబ—బాగా సర్దుకూర్చోవే! అయ్యో తెలివితక్కువా!

మహా—

"లోకములోన కొందరబలుల్ నతులన్ దనియింపలేక న
స్తోకమనీష నన్యపురుషుల్ తమకాంతల గూడకుండ, తా

టాకులలోన వ్రాసిరి "పరాంగసగూడిన పాప" యంచు, న
య్యాకులపాటుజూచియిపుడాకుల పాలైనయంగనేటికిన్"

సింహా—ఓహోహో! కంఠం మాబాగుంది.

సాంబ—మనబోటివాళ్ళ కర్థంకావుగానండి యిల్లాంటివేవో అస్తమానూ మాచాలా చదువుతూంటుందండి.

వెంక—సరే! యీసంగతి బాగానేవుంది కాని ఇప్పుడు శలవివ్వండి అవధాన్లుగారికి తమపిల్ల నివ్వడంలో తమ అభిప్రాయ వేవిటోను చూడండి! యెవరేనా మీకోసం లోపలికొస్తారేమో మీ రింట్లో లేరని చెప్పేయమనండి. మన వ్యవహారాలు వాళ్ళెందుకు వినడం.

సాంబ—చిత్తం అవునండి చూడ్డానేకుర్రదానా! కాస్సేపు వీధులో కూర్చుని నాకోసవెవరేనా వొస్తే యింట్లోలేదు పొమ్మను. లోపలికి రానివ్వకుమా! (పిల్ల నిష్క్రమించును)

వెంక—ఇంకిప్పుడు సెలవివ్వండి సంగతి.

సాంబ—చెప్పానుకాదూ! రు 1000 లు నగలు రు 1000 లు రొఖ్ఖం ఉభయకర్చులు పెట్టుకోవడం.

సింహా—అబ్బోరిబాబో! నాయిల్లూవాకలీ—

వెంక—ఇన్నూ, ఉండవయ్యా! చిత్తగించారా అన్నగారూ! సంగతంతా మనవిచేస్తాను. ఇల్లా ఒకపర్యాయం దయచెయ్యండి మనవి చేస్తా. (ఇరువురు దూరముగా వెళ్ళెదరు)

సాంబ—మీరేంచేస్తారో కాని డబ్బులో దమ్మిడీతగ్గను సుమండీ.

వెంక—సరే బాగానేవుంది, అయితే మీకు డబ్బుప్రధానవా? పిల్ల సుఖవూ, సాంప్రదాయమూ ఇవి ప్రధానవూనా?

సాంబ—ఈమాటల కేవయ్యా! డబ్బుమాట ముందుచెప్పు డబ్బేముఖ్యం.

వెంక—డబ్బేముఖ్యం సరేబాగుంది అయితే, మీరు కోరిన దానికన్న ఎక్కువడబ్బు మీట్టచెప్పిస్తే నాకేం బహుమతీ యిస్తారు?

సాంబ—యేంమట్టచెప్తారయ్యోయ్?

వెంక—వెర్రిబ్రాహ్మడా! తొందర, అనుమానము, పడక నే చెప్పేది విని ఆలోచించుకోండి. ఈయనాస్తిసంగతి యావత్తు మీకు చెప్పనే చెప్పానుగదా! ఇంక రేపోనేడో యీముసిలాడి బతుకు డిక్రీ అయిపోయిందంటే, ఇదంతా యెవరిపరవౌతుంది, ఇదంతా మీది కాట్టయ్యా మాట్టాడ్రేం!

సాంబ—వారసులో?

వెంక—వెధవ్వారసులు పెళ్ళయిన వెంటనే మీకుటుంబమంతా వాడింటిమీదే సంరక్షణ అనే విషమీదపడి తినెయ్యడం మొదలెట్టండి ఆపైని అందినకాడికి లోడ్డో లోసుకో యావత్తూ యీలోపునే చిక్కపెట్టెయ్యి. బోలెడాస్తి చరమేవుంది. అదంతా నీస్వాధీనవౌతుంది కదా! ఆపైని స్థిరానికి నీకోమనవడుట్టకుండా వుంటాడా అదికూడ్దా నువ్వాంకించుకుని పిల్లజమీందారుడవై పోవడం మానతావా! అదృష్ట వంతుడవు నిజంగానివ్వు.

సాంబ—అయితే యిప్పుడు రొక్కం యేమీ యిప్పించరూ?

వెంక—ముసిలాడు చూసి చూసి యివ్వలేడయ్యా! అయినా ఉభయఖర్చులు పెట్టించి కావలిస్తే రు 500 లు నగలుకూడా పెట్టిస్తాను.

సాంబ—అయితే ఓ ఉపకారము చెయ్యాలి. ఈతనికూతు రుందిట. ఆపిల్లని మాఅబ్బాయికిప్పించు. వాడోఘోటక బ్రహ్మచారై అఘోరిస్తున్నాడు. ఈపుణ్యం నీకుంటుంది.

వెంక—అబ్బో! పోనీ అల్లాగయితే రెండుపెళ్ళిళ్ళ ఖర్చులూ నువ్వెట్టుకో.

సాంబ—నా చేడబ్బుకూడానా! అదివల్లకాదు.

వెంక—పోనీవయ్యా! అయితే మీకర్మం పదెనిమిదివేల రూ

పాయినా స్తి పోనీ ముట్టచెబదామనుకుంటే మీాకు ప్రాప్తంలేదు. నేనేం చెయ్యను.

సాంబ—వెళ్ళిపోకండి. మనవి. మీాకు నూటపదహార్లిచ్చుకుంటాను. నేనన్న కాడికెల్లాగోల్లాగ ఫైసల్ చేయించండి

వెంక— రు 500 లు తక్కువై తే కుదరదు, ఇదేమిటయ్యా ! బోలిడాస్తి.

సాంబ—రు 100 లే. అలాగై తే ఇద్దరిపిల్లలికీ చెరో రు 300 లు నగలు పెట్టిస్తారూ ?

వెంక—నగలా ! ఊఁ సరే; అయితే నాసొమ్మిప్పు డివ్వాలి సుమండీ.

సాంబ—అటేుణంయిస్తా. నగలికిప్పుడు రొక్కంం నాదగ్గిర ధరావతుంపించండి. ముందీ సంగతులన్నీ ఆ మనతో చెప్పండి పాపం! ఆయన వడుకుచున్నట్టుంది.

వెంక—వాడిమొగం వాడితో చెప్పడవేమిటి మనమన్న మాట కడ్డుండదు. తాంబోలాలుపుచ్చుకుని గ్రంధం కానివ్వడమే తరువాయి.

(మహాలక్ష్మి ప్రవేశించి)

నాన్నా! యెవరో వచ్చారు నీకోసం కాశీపతిగారటాయనపేరు.

వెంక—అన్నా ! ముండాకొడుకిక్కడికూడా వొచ్చాడూ ! సరే, అమ్మాయి, ఏమనిచెప్పావు ?

మహా—ఇంట్లోలేడు పొమ్మన్నాను. ఆయనతోటింకో ఆయన కూడ వొచ్చారు. ఆయన మధ్యాన్నమైపోతుంది పద భోంచేసొద్దామని తీసుకు చక్కాపోయారు.

వెంక—బాగా జరిగింది. వెళ్ళమ్మా ! వీధిలోకూర్చుని యెవ్వర్నీ రానీకు.

(మహాలక్ష్మిపోవును.)

వెంక—సింహాద్రవధాన్లుగారూ ఏవండోయి? ఓమాటిల్లారండి.

సింహా—(లేచివచ్చి) ఏంసెలవుబాబూ!

వెంక—వ్యవహారం యేదో మోస్తరుగా పైసల్లైంది. మీ అమ్మాయిని వీరబ్బాయికివ్వడం,

సింహా—సరే నామాటో?

వెంక—చెబుతున్నానుకాదుమరి, వీరమ్మాయిని మీకివ్వడం పెళ్ళిఖర్చులురెండూ మనమేపెట్టుకొని పిల్లలిద్దరికీ చెరో రు 300 లు నగలు పెట్టడం ఇదీనిర్ణయం.

సింహా—రెండు పెళ్ళిళ్ళకీ నేనే ఖర్చుపెట్టడం?

వెంక—అయ్యోకర్మమా! యిల్లారండిచెప్తాను. చూడు నువ్వేచచ్చినా యిల్లాంటి సంబంధం దొరకదు, పెళ్ళికూతు రెల్లాగుందో చూశావా? అవతల కాశీపతిగాడు, ఇదిమించిందంటే కాశీపతియీసంబంధం యెగరేసుకుపోతాడు, అంచేతమరి మాట్లాడకు వాడికంట్లో దుమ్ముకొట్టాను, తాంబోలాలిప్పుడే పుచ్చుకోవడం నగలుసొమ్ము వాడి మొహాన్ని పారెయ్యి.

సింహా—సరే, పద, రండిమామగారూ! తాంబోలాలు పుచ్చుకుందాం,

సాంబ—దయచెయ్యండల్లుడుగారూ! అల్లాచేదాం,

(అంతా నిష్క్రమింతురు)

## వృద్ధవివాహము.

### 4 రంగము.

(అప్పుడు కాశీపతి, గవరయ్యశాస్త్రుల్లు ప్రవేశించుచున్నారు)

గవ—ఏవిటోయ్, కాశీపతిబావా! ఏదో ఆ చెలపత్రితో తంటాలుపడక నన్ను చంపుతున్నావు.

కాశీ—అబ్బే! నిజంగా ఆచెల్లప్ప పట్టి వెర్రిపోయ్, వాడు నాకు పెళ్ళిచేసేదేమిటి నామోహం బ్రహ్మాండమంత కబురుచెప్పి ఆఖరికి కళ్ళుతెరవని పెళ్ళికూతుళ్ళని చూపించడం మొదలెట్టేవాడు. పోనీ, ఓమాటపొందికా, తెలివీ, తేటా, యేవల్లకాదులేదుగదా! అదంతా యెందుకు! మొన్నీమధ్య ఓచోటుండగా అథాత్తుగా సాంబయ్యాకూతురు సంగతి తెలిసి అక్కడికి తక్షణంవెళ్ళి పెళ్ళికుదుర్చుకొద్దాం పదవయ్యా బాబూ అంటేను, రేపెడదాంలెండంటాడు! అల్లాచేస్తే సంబంధం వోవేళ మించిపోతుంది మొర్రోఅనియేడుస్తే బ్రహ్మాండంమీద బయలుదేరి యీసురోమంటూ రొండుఝాములు దాటిపోయేటప్పటికి ఊరంతాతిప్పి, అప్పుడు సాంబయ్యాయిల్లు చూపించాడు. అప్పుడక్కడికెళ్ళేటప్పడి కివళ్ళో అంతాకుర్రాళ్ళు వీధరుగుమీద కూర్చుని పేకాడుతున్నారు. ఆమట్టిగా సాంబయ్యాగారింట్లో వున్నారా అని అడిగాను అడగడమే తడువుగా ఆడమనిషి వాళ్ళమధ్యనుంచి లేచివొచ్చి ఇంట్లోలేరుపో అని కొట్టొచ్చి గుమ్మానికడ్డుగా నిలబడింది. ఆవైఖరిచూస్తే ఆయనగారింట్లోవుండే లేడనిపించుకుంటూన్నట్లు నాకనుమానంవేసిందికాని, ఓమూల యీచెల్లప్పగాడు భోంచేసి మళ్ళివొద్దాంరావయ్యా? అనిపీక్కుతినడం మొదలెట్టాడు. ఏంచెయ్యను, ఇంటికిపోయాను కాని తరువాత తెలిసింది. ఆకొట్టొచ్చిన ఆడమనిషి పెళ్ళికూతురట! ఆసంగతిముందే తెలుస్తె ఆమట్టిగా నాలుగు పెద్దకాసులు చేతిలోపెట్టి యెల్లాగోల్లాగ యీపాటికి గిరుక్కునాసంబంధం యిటు తిప్పేసి తద్ధిగిణతో అని పెళ్ళాడేసేద్దును.

గవ—వోస్. తద్ధిగిణతో అని పెళ్ళాడేసేద్దువేం నీ మొహాగ్గాత్తా అని భోగందనుకున్నావా యేమిటల్లాచేయడానికి?

కాశీ—నువ్వు చూళ్ళేదుకాని ఆపిల్లని చూస్తే భోగందానికక్కువగానే వుందన్నమాట.

గవ—అయితే తీసుకురా లేకపోయినా వేమిటప్పుడు ? ఇవే వెర్రి ముండాకొడుకుమాటలు నీవసల్లా తద్దిగ్గిణిత్తా అంటూ కూర్చోవడమే. హాయిగా ఆసింహాద్రవధాన్లునిచూడు ? నిజంగా సింహంలా కార్యం చేసుకున్నాడు. నువ్వు రెండువేలిచ్చినా మూడువేలిచ్చినా నీకెవళ్ళూ పిల్లనింకివ్వరు.

కాశీ—ఆఖరికిదా నువ్వొచ్చి నాకుచేసిన ఉపకారం. గాడిది గుడ్డులాగేవుంది.

గవ—బావా ! నిజంగా నీకుపకారం చెయ్యమన్నావా ?

కాశీ—అడుగుతావేమిటింకా అల్లాగ. ఇంతడబ్బు ఖర్చుపెట్టుకుంటూ నిన్నెందుకోసమిల్లా ఇంతదూరం తీసుకొచ్చాను.

గవ—అయితే సరే నేచెప్పినట్టల్లా చెయ్యి. తక్షణం నీడబ్బావడ్డీ అంతా చంకపెట్టుకొ యీవాళ మెయిల్‌లోనే మనవూరుపోదాం తరువాత పెళ్ళిమాట తలపెట్టకు ఇదే నీకు నిజమైన ఉపకారం.

కాశీ—పహ్వా, యేమాటచెప్పావు. గాడిదిగుడ్డుమాట.

గవ—లేకపోతే నీకు పెళ్ళేవిటిబావా !

కాశీ—సింహాద్రవధాన్లుకో ?

4 రంగము

కాశీ—సరే, నీకేం తెలుసునా చిక్కులన్నీ ; అల్లాక్కాదరదుమరి,

గవ—చెప్పకూడదూ సంగతులన్నీను ఎందుకా దాచడం.

కాశీ—బావా ! నీకు తెలియనిదేముంది నానోటితో పేలించకు పడుచుముండాకొడుకుని యెంతకాలముల్లా వుండమంటావు ?

గవ—ఆ అల్లాస్పష్టంగా చెప్పు యీమాటు జవాబుచెప్తాను. బావా ! అయితే నువ్వు పెళ్ళాడ్డానికై తేయిప్పుడెంతఖర్చుపెట్టగలవోయ్

కాశీ—రెండుమూడువేలకేమీ అభ్యంతరం లేదు. కావలిస్తే యీమొత్తం యిప్పుడు నీచేతికిచ్చేస్తా. యిప్పుడు కుదుర్చు పిల్లని.

గవ—సరే, యిల్లావిను. రెండుమూడువేల కభ్యంతరం లేదు కదా! అవిచాలువిను. ఓవెయ్యిరూపాయలు నీవికావని ఖర్చుపెట్టి ఓ శుభమైనముండనుంచుకో ఇదిమీకుటుంబములో కొత్తగాదు. మరో ఖర్చుపెట్టి వంటకెవ్వరినైనా పెట్టుకో.

కాసీ—సరే మళ్లీ యిదాచెప్పావు గాడిదిగుడ్డుమాట పెళ్ళి కుదురుస్తావేమో అనుకున్నానునేనూ. అయితే ఆసింహాద్రవధాన్లుగాడికి చెప్పలేకపోయావూ యీావుపాయం.

గవ—ఆఖర్మం నీకెందుకు. మనపొట్టేశ్వరయ్యనిచూడు. మొదట ఏదో పెళ్ళికి ప్రయత్నముచేసినా నీకన్న బుద్ధిమంతుడుగనుక ఆఖరికి ప్రయత్నం మానుకుని ఓశుభ్రమైన ముండనుంచుకున్నాడు. వాడివల్ల గౌరవం వాడికేంపోయింది? నీకేంవెక్కువుంది?

కాశీ—అత్తగారు ముండపోరు పళ్ళేక మళ్ళీపెళ్ళి మానుకున్నాడు కాని మరేంకాదు.

గవ—పోనీ యెల్లాగోల్లాగ మానుకున్నాడుకదా! అదే ప్రధానం.

కాశీ—సరే మాబాగుంది నీసాయం పెళ్ళి మానుకొమ్మంటావేమిటి తద్దిణ్ణాత్తా అని సింహాద్రవధాన్లుపాటీచేశాను కానాయేమిటి నేను.

గవ—సింహాద్రవధాన్లు సంగతి నీకెందుకోయ్ వాడుచెడితే నువ్వుచెడాలా.

కాశీ—వాడుచెడ్డవేం! సుబ్బరంగా చక్కని పిల్లనిపెళ్ళాడితేను!

గవ—ఓహోహో! ఆచక్కని పిల్లని పెళ్ళాడ్డం ఆసౌఖ్యంపడ్డం సంగతీ, సందర్భం! అంతా ౩,౪ యేళ్ళల్లోస్పష్టంగా చూద్దుగానుండు ఇంక అయ్యగారల్లాగా అమ్మగారిల్లాగాను.

కాశీ—పోనీవయ్యా కొంతమట్టుకల్లాగైనా బాధ లేదంటాను. పెళ్ళయితే చాలిప్పుడు.

గవ—అక్కడితో సింహాద్రవధాన్లుతో సమానవౌతావు కాబోలు.

కాశీ—అదిగో! నేసల్లాగన్నానా. వాడికీ నాకూసాటిచేస్తావేమిటి బిళ్ళగోచీ, వీధూదిపెండికట్లువాడును వాడికన్న నాకేంలోపమని పెళ్ళికాదోయ్ తద్ధిగ్గిణాత్తా అని డబ్బుతక్కువా? ముసిలాళ్ళా? ప్రయత్నలోపవా? నాకేంలోపవోయ్?

గవ—తద్ధిగ్గిణాత్తా అంటోస్తావు మాటిమాటికీని అంచేత వెఱ్ఱిముండా కొడుక్కాబోలని యెవ్వరూ పిల్లనివ్వరు.

కాశీ—పోనిస్తూ ఎవడేనా నవ్వుతాడు ఏదోవెధవముక్క అలవాటైపోయింది తద్ధిగ్గిణాత్తాఅని.

గవ—అదుగో! మళ్ళి తద్ధిగ్గిణాత్తా, యేఁ?

కాశీ—అబ్బ! పోనిస్తూ దానిమాటకేమి అన్తమాను వేళాకోళవాడక యీమాటనిజముచెప్పు. వారికన్న నాకేంలోపవుంది.

గవ—చెప్పానుకాదూ? ఆలోపవేదోను.

కాఫీ—ఏమిటది; ఇదుగోచూడు నాతో వేళాకోలవొద్దునుమా!

గవ—ఛా! ఛా! నీతో వేళాకోళమాడతానా బావా! నిజం చెప్తానువిను. నువ్వు గడ్డమూ, బొజ్జా, దినంవిడిచిదినం యెంతగొరిగించుకుంటూన్నా తెల్లగా వెంట్రుకలుమొలవడం మానలేదు. పడుచువాడనిపించుకోడంకోసం నువ్వెంత గెంతుతూవచ్చినా యెంతవాగుతూ అల్లరిచేసినా వెఱ్ఱిముండాకొడుకంటున్నారుగాని కుఱ్ఱముండాకొడుకనియెవ్వరూ అనుకోవడంలేదు, ఈకారణాలచేత నువ్వు ముసిలాడవని చెప్పియెవ్వళ్లూ చూచ్చూచిసి పిల్లనివ్వలేకుండవున్నారు, ఇదీఅసలుమాట.

కాశీ ఆ! నేముసిలాడినా! ఏగాడిదికొడుకన్నాడు. వాడికిగతరగా, నేముసిలాడినా!

గవ—కాదు బావా కాదు. నువ్వు అడ్వాన్సు తిట్టు తిట్టాక కూడా ముసిలాడవని యెల్లాంటాను.

కాళీ—యీమాటలన్నీ యెందుకు గ్కాని నాపెళ్ళివిషయములో యిల్లాంటి వితండవాదాలు పెట్టక నువునాకు నిజంగా సాయం చేస్తావా? చెయ్యవా ?

గవ—తప్పకుండా చేస్తాను.

కాళీ—చెయ్యితేను, ఈవూళ్ళో యెక్కడ పిల్లలు కుదర్లేదు గదా ? ఇప్పుడే వూరెడదాం?

గవ—మనవూరెడదాం.

కాళీ—ఎందుకు మనవూరు ?

గవ—నిశ్చింతగా కూర్చోడానికి.

కాళీ—ఫో, గాడిదిగుడ్డువేషం. అన్తమాను ఒహటే మాట తదిగిణతొ అని.
దగణాతొ

గవ—రక్షించేవు. ఇదుగో ! యిప్పుడే పోతున్నాను.

---

## ఎల్లవారు గొల్లవారు

(ఒక గొల్లవాడు బ్రాహ్మణుడు ప్రవేశించుచున్నారు)

గొల్ల—అయ్యా మీపేరేవరు ? మీకులమేది ?

బ్రాహ్మ—మేము బ్రాహ్మణులము, వైదికులము. నాపేరు సోమావధాని.

గొల్ల—అయితే మీరు మావాళ్లే.

బ్రాహ్మ—నేను నీవాడనేమిట్రా పిచ్చివాడా. ఎవరైనా వింటే నవ్వుతారు. ఇల్లాంటి మాటలాడకు.

గొల్ల—నవ్వడమెందుకు మావాళ్ళంటే మీకప్రతిష్టగా నున్న

దా యేమిటి నీవంటి బోడిబాపనయ్య వెన్యేళ్ళు తపస్సుచేస్తే మాత్రం మావోడవుతాడా. ఎంత పున్నెంచేస్తే మావోడవుతావు.

బ్రాహ్మ—నేను పున్నెము చేయనక్కఱలేదు. నీవాడని కానక్కఱలేదు. నన్నిల్లా బ్రతకనియ్యి. అప్రతిష్టమాటలాడకు.

గొల్ల—చాలు చాలూరుకోవయ్యా. అప్రతిష్టా. కృష్ణమూర్తి గొల్లవాడే కదా!

బ్రాహ్మ—కృష్ణమూర్తి గొల్లవాడే అనుకో అందుచేత మీవాడే అనుకో మేము మీవాళ్ళ మేమిటి.

గొల్ల—ఏమిటో చెపుతావిను. నీవేగాదు. మీబ్యామర్లంతా గొల్లవాళ్లే.

బ్రాహ్మ—ఓరీ నీకడుపుడక నేనే కాకుండా బ్రాహ్మణులంతా గొల్లవాళ్ళే అంటావూ ఏమైలా ఒక చుక్క వేసొచ్చావా యేమిటి.

గొల్ల—చుక్కమాదాకా మిగులుతుందటయ్యా మీబ్యాహ్మలికే చాలడంలేదు. బానలు గూనలు పీల్చేస్తూన్నారు. మాకు చుక్కే మిగలడం లేదు.

బ్రాహ్మ—నరే. ఆమాటలకేమి. నీవంటే నీవనడమే కాదు. కుడియెడమ లేదు. ఇప్పుడు బ్రాహ్మణులంతా గొల్లలెల్లాగైనారో చెప్పుదూ.

గొల్ల—ఒక్క బ్యామ్మలేనా రాజులు కోంయిట్లు కాపులు అందరూ గొల్లలే.

బ్రాహ్మ—ఓరీ నీయిల్లు పటారుగాను. లోకమంతా గొల్లలెల్లాగో చెవుదూ వింటాను.

గొల్ల—చెపుతినవయ్యా, ఇట్టుమూర్తోరున్నారా ఇట్టుమూర్తోరి బొడ్లో తాంమురపువ్వుంగా బెమ్మదేవుడా తాంయురపువ్వులో పుట్టాడా లేదా ? బెమ్మదేవుడు గొల్లోడవునా కాదా? ఆ బెమ్మదేవుడు నోట్లోనిం చూడిపడ్డారా లేదా మీరు? మీరంతా గొల్లలు కారూ!

బ్రాహ్మ—ఓరీ నీవాదము కూలిపోను యిదేమి వాదమురా, విష్ణుమూర్తి గొల్లవాడెల్లాగైనాడురా ముందుగాను?

గొల్ల—ఇట్టుమూర్తోక్కడేం దేవేంద్రుడు, సాంబమూర్తోరు అంతాగొల్లలే,

బ్రాహ్మ—కామాలరోగికి ప్రపంచమంతా పచ్చనైనట్లు నీకు పద్నాలుగు లోకాలు గొల్లలైనట్లు కనబడుచున్నాయి. దేవేంద్రుడు శంకరుడు విష్ణుమూర్తి యెల్లాగొల్లలైనారో చెప్పరా?

గొల్ల—ఇట్టిమూర్తంటే కిట్టమూర్తి కిట్టమూర్తంటే యిట్టుమూర్తి ఆడేయీడు యీడేఆడు. యీడుగొల్లయితే ఆడుగొల్లే ఆడుగొల్లయితే యీడుగొల్లే ఆడుకాకపోతే యీడుకాడు. యీడుకాకపోతే ఆడుకాడు. ఆడేయీడు యీడేఆడైనప్పు డాడీడుకాకపోతాడా యీడాడుకాకపోతాడా. అందుచేత ఇట్టుమూర్తోరుగొల్లే గన్క వొప్పుకోన్నావా లేదా?

బ్రాహ్మ—ఒప్పుకోపోతే యిప్పుడు కావిడిబద్దుచ్చుకొనినడుము విరగగొట్టేలాగున కనబడుతున్నావునీవు. అందుచేత నొప్పుకొన్నట్లే. కాబట్టి శంకరుడు దేవేంద్రుడు యెట్లుగొల్లలయినారో జెప్పుము. నీమాటలు వినసొంపుగా నున్నవి.

గొల్ల—సాంబమూర్తంటే గయిరిదేవి మొగుడేకాదు. గయిరిదేవి ఇట్టుమూర్తోరి సెల్లిలే. బావగొల్లయితే మరిదిగొల్లకాడు. బావనోన్నంటావు యేం తెల్దేంమయ్యానీకు.

బ్రాహ్మ—సరే, దేవేంద్రుడుమాటేమిటి.

గొల్ల—దేవేంద్రుడు గొల్లోడే. ఎల్లాగంటావా దేవేంద్రుడిట్టుమూర్తోరి కన్నగారు. తమ్ముడు గొల్లోడైతే అన్న గొల్లోడుకాడూ.

బ్రాహ్మ—నీవాదముపట్టిచూస్తే ముప్పదిమూడుకోట్ల దేవతలు గొల్లలే.

గొల్ల—కాకమోతే మరేవిటి అనుకున్నావు. అంతామావోళ్ళే లోకమంతా ఇట్టుమయం ఇట్టుమూర్తి గొల్లమయం.

బ్రాహ్మ—(నవ్వుచు) గొల్లలంతా గోమయం అయితే మీరిపుడు మాకంటె యెక్కువంటావా తక్కువంటావా.

గొల్ల—మీరు మాకంటెతక్కువని యింకాచెప్పాలేరే. గొల్లలు బ్యామ్మర్లు, రాజులు, కోముట్లు, చూద్రులు.

బ్రాహ్మ—అయితే నీకీవిద్య యెవరుచెప్పినారోయి

గొల్ల—ఒకరుచెప్పేదేయింటి, రామాంథంలోనుభాగోతంలోను అదేంటమ్మా పెద్దపుత్తకం జూదాలాడి అడియిల్లోకి పారిపోయినారు.

బ్రాహ్మ—భారతమట్రా.

గొల్ల—అద్దదే నారోలు తిరగడంలేదు. దాల్లోను చక్కానోళ్లు చెప్పేరు.

బ్రాహ్మ—సరే, నీవాదము విన్నాను. చాలాబాగుంది. నడు మనుష్యుడు తానెటువంటివాడైతే లోకమంతా అట్టిదని భావనచేస్తూంటాడు నీమాటలవలన గూడ కొంత లోకజ్ఞానము తెలిసింది. పద. పద.

---

## ౫౫

రంగము—కోటిపల్లితీర్థము.

(రామనాథంగారు, శివనాథంగారు ప్రవేశించుచున్నారు)

రామ—ఏమోయీ శివనాథం పడవ దిగినతరువాత, అదేపో పడం పోయినావుగాని నాకంటికగపడ్డావుకావేమి, ఈతీర్థంలో నీవెక్కడతప్పిపోయినావో యని నేనెంతో పరితాపము పడుచున్నాను.

శివ—తప్పిపోయేటందుకు నేనేమి చిన్నవాడనా చిటికవాడనా? పడవ దిగగానే మాబంధువు డొకడు కనబడ్డాడు ఆయన తన బసలోనికి తీసికొనిపోయినాడు. పొద్దున్ననుండీ అక్కడే బసచేసియున్నాను.

రాదు—బంధువుడు పిలిస్తే నాతో చెప్పి వెళ్ళనక్కరలేదట య్యా నీవు వస్తావేమోయని రెండుజాములదాకా భోజనానికి కనిపెట్టు కొని కూర్చున్నాను.

శివ—నాకోసం కనిపెట్టుకొని యుండడ మెందుకోయి. నేనేమి దేవతార్చనపరుడ ననుకొన్నావా ? ఎక్కడో పిచ్చిపుల్లయ్యలాగున్నావు.

(అప్పుడొక క్రొత్తమనుష్యుడు ప్రవేశించును)

మను—(శివనాథమునుజూచి) ఎవడవయ్యా నీవు ?

శివ—నీ వెవడవు. అంతతూలుగా మాటాడుచున్నావు.

మను—తూలుగా మాటాడుతానా మాటాడి చూపెడతానా నాజోలి కెందుకురావాలి నీవు.

శివ—నేను మారామనాథంగారూ మాటాడు కొనుచుండగా నీజోలి కేమివచ్చాను. నిన్ను పలకరించలేదు నీతో మాటాడలేదు ఏమీలేదు నాకు నీజోలీసొంటీ యేమిటయ్యా.

మను—దారేపోయేవాడికి కోపంతెప్పించి అబద్ధాలుకూడా ఆడుతావూ.

శివ—నిను చూస్తె పిచ్చిలాగున్నది.

మను—ఛీ నోరుముయ్యి నీకుపిచ్చి నీయబ్బకుపిచ్చి నీతాతకు పిచ్చి నీముత్తాతకుపిచ్చి

శివ—నిన్ను విశాఖపట్టణం పంపిస్తే బాగుండేలాగున్నది అక్కడ పిచ్చాసుపత్రి యున్నది.

మను—నిన్ను యమలోకం పంపిస్తె బాగాఉంటుంది.

శివ—నీకు దయ్యంపట్టినట్టున్నది.

మను—నీవే దయ్యానవి నీవే పట్టావునాకు.

రామ—ఏమిటండయ్యా ! మీరిగాదా యేమిటో నాకు తెలి

య లేదు మీారీయనమీాద నిప్పుడెందుకు దెబ్బలాడుచున్నారు మిమ్మలి నిప్పుడీయనేమన్నాడు.

మను—ఏమన్నాడా. నీవు వాడు తోడిదొంగలే. చెవులారా విని యెరగనట్టు నంగనాచిలా కబుర్లు చెప్తావేమి.

రామ—నిజంగానేనండి. మిమ్మల్ని నాయనయేమన్నాడో తెలియదు. మేమిద్దరము మాట్లాడుకొనుచున్నాము కాని మీాసంగతి యేమున్నదో తెలియదు.

మను—(ఎడమచేతిలో కుడిచేయి పిడికిలిపెట్టిగుద్దుచు నాసం) గతి కాకపోతే నీ వెవడసంగతి అన్నావు.

రాము—మీారెవరో మే మెరగందే మీా సంగతి యెల్లామాట్లాడుకుంటాము

మను—ఎరుగకేమి. నాసంగతి మీాకు రంగప్పగాడు జోగయ్యగాడు శీతన్నగాడు తప్పకుండగా చెప్పినారు. ఆతుంటరుల చెప్పబట్టే మీాకు నాగుట్టూ మట్టూ తెలిసినది.

శివ—నాకిదంతా చిత్రకథలాగున అరణ్యారోధనలాగున నున్నది. ఈమాటలు మాకర్థంకావడం లేదు.

(అప్పుడు చుట్టును చాలమంది జనులు చేరుదురు)

శివ—అయ్యా! మీారందరు చిత్తగించండి. ఈయన అకారణంగా మామీాద కజ్జాకు కాలుదువ్వుచున్నాడు మేము యీాయననేమి అనలేదు.

మను—అనలేదా. అనలేదా. అబద్ధాలాడుతారా.

శివ—ఏమన్నామో చెప్పు.

మను—అలాఅయితే చెపుతా విను. చెప్పి నలుగురిచేతా నోట్లో గడ్డి పెట్టిస్తాను, నాదగ్గర నీపప్పుడకదు. ఇవి ఇనపగుగ్గిళ్ళుకాని మినపగుగ్గిళ్ళు కావు.

రామ—కేకలు వేయక మిమ్మన్న మాటేమిటో చెప్పండి

మను—చెప్పుతానా చెప్పి చూపిస్తానా. వినండయ్యా పెద్దమనుష్యులందరునూ. నేను యీదారిని వెళ్ళుచుంటే వారిలో వారు మాట్లాడుకొనుచున్నట్టుగా నటించి "పిచ్చి పుల్లాయి"లాగున్నావు అనుకున్నారు.

రామ—ఆమాటంటే మీకేమి మధ్య.

మను—(కోపముతో) నాకు కాకపోతే యింకెవరికనుకున్నావు. ఇంకా బేహద్బిగా మాటాడుతావు.

శివ—పిచ్చిపుల్లాయి అంటే మీకేమి కోపమండీ.

మను—అదిగో వద్దంటే మళ్ళీ ఆకూతే కూస్తావు.

రామ—ఈమాట బలేపసందుగా నుందండి. పిచ్చి పుల్లాయి మీరా యేమిటి.

మను—ఆ తప్పకుండా నేనే అక్షరాలా నేనే నేను కాకపోతే నీవా యేమిటి?

(అందరు తప్పట్లు కొట్టి నవ్వుచున్నారు)

శివ—(ఆగండి అని) అయ్యా! పిచ్చిపుల్లాయి మీరెల్లా అయినారండి.

మను—మా యింట్లో వారందఱు చిన్నప్పుడు ముద్దుగా ఆలా పిలిచేవారు. పెద్దవాళ్ళంతా ఆలాగే పిలుస్తారు. ఇటీవల కొందఱు కొంటెముండాకొడుకులు అల్లా పిలుస్తూంటే వాళ్ళని రాళ్ళతో కొట్టి తిట్టి యెల్లాగో కాలక్షేపముచేయుచున్నాను. వాళ్ళెవళ్ళు యెరక్కుండాయీ తీర్థంలోకి వచ్చి మాయూరివాళ్ళకు కనబడకుండా యున్నాను ఎల్లాగున్నా మీరు ఆరంగప్పగాడూ వాళ్ళూ చెప్పిన మాటలు విని నన్ను వేళాకోళము ఆరంభించినారు.

రామ—అయ్యా! క్షమించండి మిమ్మల్ని మేము అనలేదు. మీరు పిచ్చిపుల్లాయి అనేమాట మాకు తెలియలేదు.

మను—తెలియకేమి తెలిసే అన్నారు. మీరు నన్నే అన్నారని ఒట్టు పెట్టుకోగలను ప్రమాణం చేస్తాను. గుళ్ళో దీపం ఆరిపేసి చెపుతాను గోదావరిలో స్నానంచేసి చెపుతాను. పచ్చనిచెట్టుక్రిందుండి చెపుతాను. పదిమంది కట్టినయింటిక్రింద ప్రమాణము చేస్తాను. రామాయణము నెత్తిమీద పెట్టుకొని చెప్పగలను. అమ్మతోడు బాబుతోడు నీతోడు నాతోడు. మీరు నన్నే అన్నారు ఆపిచ్చిపుల్లాయి నేనే. నేనే. నేనే. మీరు కాదంటే పోతుందా.

అందరు—పుల్లయ్యగారూ మిమ్మల్ని కాదండి.

మను—కాదంటే నే నొప్పుకుంటానా. దొంగముండాకొడుకుల్లాలా. నన్నే నన్నే ఆపుల్లాయిని నేనే. నేనే.

అందరు—పుల్లాయికి జే. పుల్లాయికి లేవిడీ.

మను—చావండి ముండాకొడుకుల్లాలా చావండి. (అని రాళ్లు రువ్విపరుగెత్తుచున్నాడు. జనులందరు రాళ్ళురువ్వి పరుగెత్తుచున్నారు)

శివ—కోటిపల్లితీర్థములో పిచ్చిపుల్లాయి యని యెవ్వరైనా అనుకుంటే అది తననే అని దెబ్బలాటకు వచ్చే వెర్రిపప్పలు లోకంలో నుంటారని నేనెన్నడు ననుకొనలేదు. రామనాథం పోదాము పదరా బాబు.

(అని యిద్దరు పోవుచున్నారు)

---

## క్రమము

(అప్పుడు పేరి సోమయాజియను బ్రాహ్మణుడు ప్రవేశించు చున్నాడు)

పేరి—(తనలో) అబ్బబ్బా కష్టాత్ కష్టతరం క్షుధా అన్నట్లు సకలకష్టములకంటె ఆకలికష్టము మిక్కిలి ఎక్కువది దానికి తోడుగా

నేను చాలాదూరము ప్రయాణంచేసి వచ్చితిని. అందుచేత శ్రమ కెట్టింపయినది. ఈమండువేసవిచేత నాప్రాణములు పోవుచున్నవి. ఈచెవి గాడుపు ఆచెవికికొట్టుచున్నది నాలుక యెండిపోవుచున్నది స్నానము చేసినట్లు చెమటపట్టినది చెవులు గడియలుపడుచున్నవి. ఒక యడుగైన ఇక నేను పెట్టజాలను ఏమైననుసరే ఈచెట్టుక్రింద అంగవస్త్రము వేసికొని పరుంటాను. (అని చెట్టుకు చేరబడి కూర్చుండి) ఎవరండో వెళ్ళేవారు నేను బ్రాహ్మణ్ణి ఆకలిచేత ప్రాణము పోవుచున్నది నాకు పట్టెడు అన్నం పెట్టించగలరా (అప్పుడు రామనాథం ప్రవేశించుచున్నాడు.)

రామ—అయ్యా ! మీవంటివారికి పట్టెడుఅన్నము పెట్టినందు వల్ల తప్పులేదుగాని మాకుపురుడు యీగ్రామంలో కామశాస్త్రిగారొక్కరే అన్నప్రదానం చేయగలవారు. వారింటికి మిమ్మును తీసుకు వెళతానురండి. ఇక్కడికి ఎంతోదూరంలేదు పని బారలు దయచేయండి.

పేరి—మంచిదినాయనా మీపెద్దలకు వేయినమస్కారములు నన్ను తీసుకువెళ్ళు. ఇంతమజ్జిగ అన్నం పెట్టిస్తావా నీకు బహుపుణ్యాం వుంటుంది.

రామ—చిత్తమురండి (అని నడిపించుచు) అయ్యా తమరే గ్రామమునుండి ఏమిపనిమీద వస్తున్నారు ?

పేరి—మాపిల్ల దానికి సంబంధము మాట్లాడడానికి భీమడోలు వెళ్ళి వస్తున్నాను.

రామ—భీమడోలులో మీపిల్లని ఎవరికిస్తారు ?

పేరి—నాయనా నాకు దడచేత మాటరాలేదు. (తనలో) నేను రాయప్ప అవధానులకు పిల్లనిచ్చి వెయ్యిరూపాయలు పుచ్చుకున్నానని వీడితో చెప్పడమెందుకు. కాబట్టి ఈవంక మంచిదే.

రామ—అవును పాపము దయచేయండి. ఇదిగో కామశాస్త్రుల్లు గారియిల్లు ఈయరుగుమీద దయచేయండి ఆయన విస్తళ్ళు కుట్టుచు ఇక్కడనే కూర్చున్నారు (అప్పుడు కామశాస్త్రిగారు ప్రవేశించుచున్నారు.)

రామ—అయ్యా ! ఈ బ్రాహ్మణుడు వడకొట్టి పడిపోయినాడు. తమరింత అన్నోదకములిచ్చి రక్షించవలెను.

కామ—ఏవూరండిమీది.

పేరి—నాకాపురం అత్తిలి. భీమడోలునుండి వస్తున్నాను. ఇహ నేను మాటాడలేను అన్నం అన్నం.

కామ—వేదము చదువుకున్నవారికే కాని అన్నము పెట్టనని నా ప్రతిజ్ఞ. మీకు వేదమువచ్చునా ?

రామ—ఇదియేమి ప్రతిజ్ఞండి వేదము రానివారికి ఆకలికాదా యేమిటి ? ఏజాతివారికైనా అన్నప్రదానము చేయవలసినదే.

కామ—నాయిష్టం నాది, వేదమువచ్చినవారికే నేను అన్నం పెడతాను లేనివారికి పెట్టను ఏమయ్యా ! నీకు వేదము వచ్చునారాదా?

పేరి—(తనలో) వేదము రాదంటేనా వీడు అన్నం పెట్టడు. పెట్టకపోతే ప్రాణం ఇప్పుడేపోతుంది. కాబట్టి ఇప్పుడబద్ధమాడకతీరదు. (పయికి) అయ్యా నాకు వేదం సంపూర్ణముగా వచ్చును.

కా—సరే ఒక పనస చెప్పండి.

పేరి—ఇప్పుడు ప్రాణంపోతోంది భోజనమయిన తరువాత చెపుతాను.

కా—సరే స్నానమునకు లేవండి. వంటఅయింది.

(అందరు నిష్క్రమింతురు)

రెండవ రంగము

కామ—భోజనమయినదికదా ఏదైనా ఒక పనసకు పదము, క్రమము, జట ఘన చెప్పండి.

పేరి—ముందుగా క్రమము చెపుతానువినండి. మీకుమారుడు మీదుగా మీరు స్వర్గమునకువెళ్ళుట క్రమము. మీరుండగా మీ కుమారుడు వెళ్ళుట అక్రమము. మీఅమ్మగారు మీచేతి మీదుగా పోవుట క్రమము. మీఅమ్మగారుండగా మీరువెళ్లుట అక్రమము.

కామ—ఛీ. దిక్కుమాలినముండాకొడుకా మాయిల్లల్లాచెడితిని మమ్మందరిని చావమంటావా (అని కొట్టబోవును.)

పేరి—చచ్చానయ్యో బ్రాహ్మణ్ణి చంపేశారయ్యో (అని అర చుచు దర్భాసనము మీదవేసుకొని వీధిలోనికి కేకలువేయుచు పరుగెత్తు ను. అప్పుడు పదిమంది చేరుదురు)

అందరు—కామశాస్త్రిగారు ఏమిటీగోల ?

కామ—(కలహాకారణమును చెప్పెను)

అందరు—(కలహాకారణమును విని) కామశాస్త్రిగారు మీప్రతిజ్ఞ బాగులేదు బ్రాహ్మణుడా నీనోరు మంచిదికాదు. మీ ఇద్దరివలన తప్పున్నది మీదారిని మీరుపొండి.

(అందరు నిష్క్రమింతురు)

---

నోపముల పుట్ట

ఒకపట్టణమున గొప్ప గానసభ జరిగెను. ఆసభకు పట్టణములో నున్న పెద్దమనుష్యులందరు విచ్చేసిరి. గానము ముగిసెను. చందాపట్టిక బయలుదేరెను. దాని వానసవేయగనే కొందరు పెద్దమనుష్యులు

అంతర్ధానమొందిరి. ఒకపెద్దమనుష్యునకు ఆలాగు పోవుటకు వీలులేక పోయెను. సంగీతముమీాది ఆసక్తిచేత నతడు ముందుకువెళ్ళి కూర్చుం డెను. ఆసమయమున చంద్రాపట్టిక వచ్చునన్నమాట మఱచిపోయెను. ఆయానందసముద్రములో మునిగిపోయి మైమఱచి యున్నపుడె దాని కడుపుకాల పిల్లపిడుగువలె చంద్రాపట్టిక వచ్చెను. ఆకాగితము చేతిలో పడునప్పటికి పాము మీాదబడినట్లు అత డదరిపడి తెల్లపోయిచూచెను. అంతలో రూళ్ళుపెన్సిలు గూడ చేతికిచ్చిరి. పాఱిపోవుటకు గాని తప్పించు కొనుటకు గాని వీలులేకపోయినది ఒక్కొకప్పు డిటువంటియసందర్భములు తటస్థించుచుండును అవి తప్పించుకొనుటకు గొప్పయుపాయము కావ లయును. ఈపెద్దమనుష్యునకు గావలసిన యుపాయములన్నియు నతని దగ్గరనున్నవి. అందుచేత నతడు తెగించి మూాడురూపాయలు చందా వేసెను. ఈచందాసొమ్ము వసూలుచేయుట కొక పెత్తనదారు డేర్ప డెను. ఆపెత్తనదారుడు చందాకాగితమొక సేవకునిచేతికిచ్చి చందాలు వసూలుచేసి తీసుకొనిరమ్మని యాజ్ఞాపించెను. సేవకుడు ఇండ్లుదిరుగ నారంభించెను. తక్కినయిండ్లమాట మన కక్కరలేదు.

ఇదిగో. జవాబులువినండి. ఒకనాడుదయమున సేవకుడు వెళ్ళున ప్పటికి ఆపంతులుగారు నిద్రలేవలేదు. పదిగంటలకు వెళ్లునప్పటికి స్నానముచేసి మడిగట్టుకొన్నారు. మధ్యాహ్నం కచ్చేరీకి వెళ్ళినారు. సాయంకాలము షికారువెళ్ళినారు. రాత్రివేళ సేవకుడు వెళ్లగా యర్థ రాత్రివేళ అంకమ్మశిపాలు అన్నట్లు నీకిపుడా సమయముదొరికిందని చీవాట్లు పెట్టిరి. కచేరీసెలవు వచ్చినదినమున యుదయమున వెళ్ళగా పంతులుగారు స్నేహితుని జూచుట కెచ్చటికో వెళ్ళిరి. మధ్యాహ్నం 12 గంటలకు భోజనముచేసి పండుకొనిరి. మూాడుగంటలు మొదలు నాలుగు గంటలవరకు ఫలహారము చేయుచుండిరి. మఱియొకమారు కనబడి, పెద్దమనుష్యులతో మాట్లాడుచున్నాము, మఱియొకప్పుడు

జరూరుకాగితములు చూచుకొనుచున్నాము. యింకొకప్పుడు రమ్మనిరి. వేరొకప్పుడు నాదేహములో నుస్తీగానున్నది పొమ్మనిరి. మతియొకపుడు మాయింట్లో చంటిపిల్లవాడికిజబ్బుగానున్నది తోచడంలేదు మళ్ళి రమ్మనిరి. వేరొకమారు మాఆడవాళ్ళు బద్ధకంగానున్నారు. రేపురమ్మనిరి. పదిసార్లు సాయంకాలం రమ్మనిరి. మఱినాలుగుసార్లు మధ్యాహ్నమనిరి. రావలసినలెఖ్ఖ రాలేదని కొన్నిసార్లనిరి. గుమాస్తా నడిగి పుచ్చుకోమని కొన్నిమాట్లు చెప్పిరి.

గుమాస్తానడుగగా పంతులుగారినే యడుగుమనెను. ఇద్దరును కలసియున్నపుడడుగగా తాళముచెవి పోయినదనిరి. మరియొకసారి మైలవచ్చినది. పెట్టెలుముట్టుకొనుటకు వీలులేదు ఆనకరమ్మనిరి. ఔను హాలుకు వచ్చినపుడు ఆనేవకుడడుగగా నీకోసము జేబులోవేసికొని వస్తాననుకొన్నావాడేమిటి? నాకిదేజ్ఞాపకము నూరుపనులమీద ఫో పొమ్మనిరి. బజారులో కనబడునప్పుడడుగగా మహాకోపముతో డాం ఫూల్ నీకుమర్యాదలు తెలియవు ఎక్కడబడితే అక్క అడుగుతారా? పెద్దపిన్నలు లేకుండా బేహాయాయని చేతికఱ్ఱతో కొట్టబోయిరి. కొన్నిసారులు ఫస్టుతారీఖున రమ్మనిరి. తరువాత పదిహేనవతారీఖనిరి. తరువాత ముప్పదియవతారీఖయింది, అమావాస్యయింది. పౌర్ణమాస్యయింది. పాడ్యమినాడయింది పంచమినాడయింది నౌఖరును మానిపించి పెత్తనదారుడు స్వయముగా వెళ్ళెను. ఆయనకుగూడ ఆమర్యాదే జరిగింది. తిరుగలేక కాళ్ళునొప్పిపట్టినవి. అడుగలేక నోరునొప్పిపెట్టినది. వ్యవహారము పాతబడినది అడుగువారు యిచ్చువారుగూడ ఆమాట మఱచిరి. వానితో మనపెద్దమనిషికి తేలిపోయెను. గానసభ చేయించినందుకు పెత్తనదారుడు చందావేసినవారి సొమ్ముగూడ తానే యిచ్చికొని యికయెప్పుడు సభ చేయించనని ఒట్టుపెట్టుకొనెను.

మహాదురూపాయలు చందావేసిన పెద్దమనుష్యుని యింటిమాట మనకు కావలెను. సేవకుడు వారింటికెన్ని సార్లు వెళ్ళెనో చెప్పుటకు దగిన లెక్కలులేవు. పాపము సేవకునికాళ్ళు తోలుకాళ్ళయినవి ఇనుప యెముకలు నుక్కునరములు వజ్రపుపాదములు భగవంతుడిచ్చియుండిన పక్షము నతడోపికగా యీయనయింటిచుట్టును దిరిగియుండును. ఇటువంటిసమయములలో నటువంటిపాదములియ్యవలెనన్న తెలివితేటలు భగవంతునికిలేవు. భగవంతుడు సర్వజ్ఞుడందురు. సర్వజ్ఞుడిటువంటి చిన్నసంగతులు తెలిసికొనలేకపోవుట కేమికారణమో తెలియదు. భగవంతునికి గూడ తెలియనిసంగతులెన్నో కొందఱుపెద్దమనుష్యులు దగ్గర గలవని దీనినిబట్టి నిశ్చయింపవచ్చును. సేవకుడు చందాపట్టిక పట్టుకొని వెళ్ళినపుడు పెద్దమనుష్యునివల్లనుండి ఆయన యింటిలోనున్న వారివల్లనుండి వచ్చినజవాబులు కొన్ని మేమిం దుదాహరించుచు న్నాము. ఇది లోకోపకారకపుకార్యము. అందరు పబ్లికుగుడ్డుకొఱకు పాటుపడుచున్న దినములివి. మేముకూడా కొంతగుడ్డుచేయవలెనని సంకల్పించి, ఆజవాబులు బ్రకటించినాము. దీనివల్లవచ్చు గుడ్డు యేమిటని మీరడుగుదురేమో దీనిలో గొప్పప్రయోజన మున్నది. ఈజవాబులన్నియు మీరు గట్టిగా చదువుకొని వేసినచందా లెగబెట్టుటకు మీరుకూడ ఆపాటలే పాడవచ్చును.

---

యోగానందస్వామి.

(వెంకటరత్నము, భీమశంకరము ప్రవేశించుచున్నారు)

భీమ—ఓరే వెంకటరత్నం మనగ్రామము లోనికి ఒక గొప్ప స్వాములవారు వచ్చినారు. ఆయనకు నేనొకభిక్ష జేయదలచుకొన్నాను.

నీవుకూడా భిక్ష చేస్తావా? రేపు మాయింట్లో భిక్ష ఎల్లుండి నీవుచేస్తే బాగుంటుంది.

వెంక — ఈరోజులలో ఆస్తి విశేషముగా లేక మనమే సన్యాసుల వలె నున్నాము. భిక్షలు మనము సరిగా చేసికొంటే చాలును. భిక్ష చేసినంత ఫలము.

భీమ — మొదటినుండీ నీకున్న తెగులేయిది. ఏమాటచెప్పినా దాని కడ్డదిడ్డము అకటా వికట మేకాని సరిగా మాటచెప్పవు. ఈస్వాములవారు తక్కిన సన్యాసులవంటి వాడనుకొన్నావా యేమిటి ఆయనకు భిక్షచేస్తే మనగృహము పావనమౌతుంది.

వెంక — ఏమిటోయి యీాయన దగ్గరనున్న గొప్ప మహిమ కొంచెము చెప్పు.

భీమ — నాలుగు వేదాలు ఈయనకు కంఠతావచ్చును. ఉపనిషత్తులు బ్రహ్మసూత్రాలు భగవద్గీతలు ఆయన బోధిస్తే అరటిపండు వొలిచి చేతికిచ్చినట్టు అర్థము విడిపోతుంది. వేందాంత శాస్త్రములలో ఆయన నిధి.

వెంక — ఈస్వాములవారెప్పుడొచ్చినారు.

భీమ — ఈవేళ ప్రొద్దున్నే వచ్చినారు.

వెంక — ఈవేళప్రొద్దున్నే ఆయన వచ్చినప్పుడు ఆయన ప్రజ్ఞలు నీకప్పుడే యేలాగు తెలిసినవి? ఉపనిషత్తులు నీకేమైన బోధించినారా యేమిటి?

భీమ — బోధించాలా యేమిటి, ఆయన ముఖవర్చస్సుచూస్తే నే ఆయనకు సకల శాస్త్రాలు వచ్చినట్టు తెలుస్తోంది. ఆ హా! హా! ఆబ్రహ్మతేజస్సు నీయంటి నిర్భాగ్యునకు తెలియదుగాని ముఖము సూర్యబింబములాగున్నది.

వెంక—వర్చస్సునుబట్టే పాండిత్యము తెలుస్తుంది! అబ్బా నీవు చాలాగొప్పవాడవే! ఇదెవరు కనిపెట్టలేకపోయినారు మొగము సూర్య బింబములాగున్నవా ళ్ళేంతమందో ఓ అంటేనా, రాకుండా యున్నారు.

భీమ—నోరుమూసుకుండూ ఈపాటికి ఒళ్లు పై 'తెలియకుండా మహానుభావులను ఆక్షేపించడ మొకటున్నది. వేధపయింగ్లీషుముక్కలు నాలుగు చదువుకొన్నావని చెప్పి నీకు తెగనీలుగు బలిసినది. నీకు పెద్దా పిన్నా లక్ష్యములేదు ఇలాటిమాట లన్నందుకు పాదిత్యం చుట్టుకొని పురుగులుపడిపోతావు ఆఖరికి.

వెంక—ఓరే కోపపడకు. ఆయనమహిమ నీకేలాగున తెలిసిన దంటే నన్ను తిడతా వెందుకురా?

భీమ—తిడతానా, పళ్లురాలగొడతానా ఆయన రాత్రిళ్ళు ప్రాణ యామముపట్టి గజమెత్తులేస్తారు. ఈయన క్రిందటి శివరాత్రినాడు శ్రీశైలములోను కోటిపిల్లిలోను నత్తల రామేశ్వరములోను మూడు పూళ్ళలోను ఒక్కనాడే కనపడ్డారట. ఒక్కపర్యాయమే రెండుబిందెల నీళ్ళు తాగేసివేయగలరు. గుడ్డపీలిక నోట్లోపెట్టి కడుపంతా శుభ్రముగా కడగివేసి ఆగుడ్డ రెండవప్రక్కనుండి ఆయన తీయగలరు.

వెంక—ఆయన యీవేళ ప్రొద్దున్నే వచ్చినారుగదా రాత్రి గజమెత్తు లేవడము నీవెప్పుడు చూచినావు. నోటిలోముళ్ళుపెట్టుకొనే విప్రవినోదులకును గుడ్డపెట్టుకొనే యీయనకు భేదమేమిటి?

భీమ—ఛీ! నీమొగమీాడ్చ నీపాపానికి మేరలేదురా? నీకిల్లా బుద్ధిరాదు. రేపు మాయింట్లో స్వాములవారికి భిక్షచేసి నిన్నక్కడకు తీసుకువెళ్ళి ఆయన యెదుట కూలవేసి ఆయనచేత నీ కుపనిషత్తులు బోధింపజేసి ఆయనపట్టే ప్రాణాయామం నీకు చూపించి, ఆయనమహిమ చూపించి అప్పుడు నలుగురిచేతా నీకు తలవాచేటట్టు చివాట్లు వేయిస్తాను నీయింగ్లీషుచదువు తగలెయ్యా. పొట్టకోసము నాలుగింగిలి

ముక్కలు నోటికి తగిలించుకొని తెగకీలిగి చస్తావు ఉండు నీరోగము కుదురుస్తాను. రేపుమాత్రం మాయింటికి పిండాకూటికిరా మరిచిపోక.

వెంక—(నవ్వుచు) ఎందుకురా నీకింతకోపము. నిష్కారణముగా పట్టుకుతిట్టుచున్నావు రేపుమీయింటికి భోజనమునకు నేనువచ్చి ఆయన మహిమలు చూచినతరువాత ఆయనకాళ్ళుకడిగి నీళ్ళు త్రాగుతాను.

(అని యిద్దరు నిష్క్రమింతురు)

2 రం గ ము

(ప్రవేశము—భీమశంకరముగారియిల్లు. భీమశంకరము, వెంకట రత్నము, మరికొందరు బ్రాహ్మణులు ప్రవేశించుచున్నారు.)

భీమ—వెంకటరత్నం! మనభోజనానైవవిగద మనము స్వాములవారి సన్నిధిని కూర్చుందము. ఆయనచేత నీకు ముండకోపని మత్తైనా తైత్తరీయమైనా చెప్పిస్తాను!

వెంక—వినడానికి నాకేమి అభ్యంతరములేదు. (అని యిద్దరు స్వాములవారివద్దకు వెళ్ళుదురు)

(అంతట పడకకుర్చీమీద పండుకొని యోగానందస్వామివారు ప్రవేశించుచున్నారు.)

భీమ—స్వామీనమస్కారము

యోగా—నారాయణ

భీమ—(కూర్చుండి) వెంకటరత్నమూ! విస్సయ్యశాస్త్రుల్లు గారూ! బుల్లెన్నావధానులుగారూ అంతాదయచెయ్యండి.

(అందరు నమస్కరింప స్వాములవారు నారాయణా యనుచున్నారు)

భీమ—స్వామీతమవంటి మహానుభావుల దర్శన మిదివరకెన్నడూ మేము చేయలేదు. అనేకమంది స్వాములవార్లు వస్తూపోతుంటారు కాని వారు నోట్లోవుప్పూ పత్రిలేనివారు, తమవల్లమేము ధన్యులము కావలెననియున్నది.

యోగా—మీరు మంచివాళ్ళురా నాయనా. భిక్ష బాగా యున్నది. (అని త్రేవుమని త్రేన్చును)

భీమ—మాదొక చిన్నమనవి యున్నది. తమరనుగ్రహించి వినవలె.

యోగా—చెప్పరా నాయనా వినకేమి

భీమ—ఉపనిషత్తులు కొంచెము పుచ్చుకోవలసినదని నాకోరిక.

యోగా—ఓరి వెఱ్ఱివాడా యిప్పుడు చెప్పినావేమి. ఇందాకా భిక్షవేళ చెప్పినట్లయితే పనిలోపని పుచ్చుకొందునుకదా.

భీ—అప్పుడు తమకు వీలుండదు. ఆకలిగానుండునని నేను మనవిచెయ్యలేదు.

యోగా—అప్పుడే వీలుండును ఇప్పుడెంతో ఆయాసముగా నున్నది. ఉపనిషత్తులు ప్రస్తుతం పుచ్చుకోలేను రాత్రి ఫలహారమువేళ తీసుకురా, అప్పుడు తప్పకుండా పుచ్చుకుంటాను.

భీమ—(తెల్లబోయి చూచుచున్నాడు)

వెంక—(తనలో) ఈ నిర్భాగ్యపుస్వాములవారికి ఉపనిషత్తులంటే అర్థమే తెలిసినట్టు కనబడదు. (ప్రకాశముగా) స్వామీ! ఉపనిషత్తులనగా తమ యభిప్రాయమేమిటి.

యోగా—ఓసి ఉపనిషత్తులంటే నాకు తెలియదనుకున్నావు. ఇంతదేశము తిరిగిన ముండావాడిని స్వాములవారంటే యేమో శుద్ధ వెర్రివప్ప అనుకున్నావు కాబోలును ఉపనిషత్తులనగా మీదేశపు పిండి వంటలలో ఒకటి.

భీమ—(తలవంచుకొని తనలో) అప్రదిష్టవచ్చినదిగదా ఇంత నిర్భాగ్యము ముండాకొడుకన్నమాట తెలిసినదికాదు.

వెంక—(నవ్వు పట్టజాలక చివాలున లేచి వీధిలోనికి వెళ్ళి పకపక నవ్వుచున్నాడు)

భీమ—వానివెనుక వెళ్ళుచున్నారు (బ్రాహ్మణు లొక్కరొక్కరే వీధిలోనికి వెళ్ళుచున్నారు.)

వెంక—నాయనా భీమశంకరం రారాబాబూ (అనివకవకనవ్వి) ఏమి గొప్పస్వాములవారిని సంపాదించినావురా. ఇంతవాగొప్పవాడూ మన దేశం రాలేదురా బాబూ. దీనికోసమే గాదురా బాబూ నన్ను చెడామడా తిట్టినావు.

భీమ—బుద్ధిలోపము వచ్చినది. ఏమనుకుంటే కార్యమేమిటి. అయినదేమిటో అయినది. ఆముండాఘాడిని యీడిపింపక నీవింటికి నడు. ఈరాత్రి సాగనంపుతాను. చెప్పకుంటే సిగ్గు ఏపెళ్ళామురిాద కోపము వచ్చి జందెములు తెంపిన ముండాకొడుకో వీడు. అనుభవము అయితేనే గాని బుద్ధిరాదు, నీకుగాదుగాని నాకిప్పుడు బాగా బుద్ధివచ్చినది.

(అని అందరు నిష్క్రమింతురు)

---

శతఘంటావధానము

రంగము 1

(అంతట సోమశాస్త్రిగారు రామకవిగారు ప్రవేశించుచున్నారు)

సోమ—రామకవిగారూ ! మిరాా శతావధానము చేయగలరని చెప్పి మన మాధవరావుగారిని వలలో బడవేసినాను. వారును మిాా కవనము వినవలెనని కుతూహలపడుచున్నారు గావున మనము వారి దర్శనమునకీదినము పోవలయును.

రామ—సరేకాని నేను నాటకముల వ్రాయగలనని కూడ జెప్పినారా ?

సోమ—ఆ చెప్పినాను. మిారు మన సుందరం పంతులుగారికి దినమున కొక్కనాటకము వ్రాసి యిచ్చుచున్నారని కూడ చెప్పి మిారు

వ్రాసిన రుద్రాణీపరిణయమును గూడ జూపినాను. అది చూచి వారు చాల సంతసించినారు.

రామ.—ఏమిటి ఎంతపని జేసినారయ్యా శహబాస్, మీరు మంచిస్నేహితులు. మీమేలు మరవగూడదు. అయితే వా రీదినమున సభ చేయించుదురు కాబోలు. అప్పుడు మన సుబ్రహ్మణ్య కవిగారు వస్తారా?

సోమ.—వారు రారు. మనము మొన్న వారికి "దినదినప్రబంధ కర్తృత్వమున మమ్మోడించి గెలుపొందు" డని వ్రాసిన రిజిస్టరీయుత్తరమును జూచి సిగ్గుపడిపోయినారు. మీముందర వారు నిలిచి కవిత్వము చెప్పగలరటయ్యా.

రామ.—(తనలో) నేనేమో చదువుకొన్నవాడ ననుకొని యీ సుబ్రహ్మణ్యకవి సిగ్గుపడి యుండనోపు. మంచిపని జరిగినది. నాకింత సంభావన దొరకుట కిక సభ్యంతరముండదు. కాని యీశాస్త్రిముండా కొడుకున కేమైన హిరణ్యశ్రార్ధము పారవేయవలెను. వీనికి కొంచెము ఆశపుట్టించి హెచ్చరిక చేయవలయును. (ప్రకాశముగా) శాస్త్రిగారూ మీమేలు మరవగూడదండీ, చూడండి. మనము ధనికముం దొక యేర్పాటు చేసికోవలెను. అది యేమి టందురేమో నే నెక్కడ శతావధానముచేసినను మీకు నాకు చెరిసగము. అందుకు మీ రంగీకరించవలెను.

సోమ.—మీదయ యుండిన చాలును, నేను శాస్త్రాలు చదివినానని మీరు చెప్పుచుండుటయే పదివేలు. అంతకంటె మీరు నాకేమియు నీయ నక్కరలేదు. కాని మనము పట్నాలు మాత్రము తిరగకూడదు. అక్కడ కొంచెము చదువుకొన్నవా రుండకపోరు. అప్పుడు మన బండారము బయటపడును.

రామ—చాలు, మీకేమితెలియును. పట్టణాల్లో మాత్రము మహా చదువుకొన్నవాళ్ళుంటారయ్యా. ఊరికే డాబుచేసి బుకాయించే వాళ్ళేగాని పట్టుమని పదిమాటలు నేర్చినవారు ఈదినాల్లో యెక్కడా లేరు. ఏదోవిధంగా నాలుగుపద్యాలల్లి చకచక మాట్లాడితిమా మన కేదో వచ్చుననుకొని, ఉద్యోగస్థులు ప్లీడర్లు యింతడబ్బు పారవేస్తారు గదా. పైగా యీ మహారాజు లిచ్చారని ఆ మహారాజు లిచ్చారని నాలుగు బిరుదులు చెప్పినామంటే మనలను ప్రశ్నవేసేవారేలేరు. చూడండీ. మీకు బొబ్బర్లంకజమీందారుగార్లు పరీక్షించి "మహా మహిమోపాధ్యాయ శిరోభూషణచక్రవర్తి" యని బిరుదునిచ్చినట్లు నేను చెపుతాను అందుకు మీ రంగీకరించాలి.

సోమ—చిత్తము. ఏదోబాబూ, నాలుగుడబ్బులు దొరికే మాత్రం చూడు ఒకవేళ మనగుట్టు బయటపడినచో చిక్కువచ్చునేమో సుమా.

రామ—చిక్కేమయ్యా. నేను శతావధానిననియు, కవిశేఖరుడ ననియు, దినదినప్రబంధకర్తననియు జెప్పుచుండ, నెవరీ బిరుదుల నిచ్చినారని అడిగేవారేలేరు. ఒకవేళ యెవరైన నడిగినచో ఏదో డాబు డాబి బుకాయిస్తే నోరెత్తేవా డెవడయ్యా.

సోమ—చూడండి. మనపంతులుగారితో మీ బిరుదులసంగతి చెప్పుట మరచినానండీ.

రామ—అయ్యో! ఎందుకు మరచిపోయినారు. అవి చెప్పక పోతే మనపరువు దక్కుతుందా మన బ్రతుకు వాటితోనే యున్నది. ఎంతపని చేసినారండీ శాస్త్రిల్లుగారూ.

సోమ—పోనీ యిప్పుడుపోయి చెప్పిరానా?

రామ—చాలు యిదొక తెలివితక్కువా. మీరు శుద్ధవెదకము

చేసినారు. పోనీలెండి ప్రొద్దుపోయినది. మాధవరావుగారు మన నిమిత్తము కనిపెట్టుకొంటారు. పోదాము పదండి.

(అని యిద్దఱు నిష్క్రమింతురు)

2 రంగము

మాధవరావుగారి యిల్లు

(అప్పుడు రామకవి సోమశాస్త్రి ప్రవేశింతురు)

మాధ—ఓహో శాస్త్రిలుగారు దయచేయండి.

సోమ—చిత్తము వీరే మన రామకవిగారు మీరెప్పుడు జూడలేదుకాబోలు.

మాధ—(రామకవినిజూచి) దయచెయ్యండి. మీ దర్శన మెన్నడు చేయలేదు.

రామ—నేనును తమదర్శనము చేయవలెనని చాలదినముల నుండి ప్రయత్నము చేయుచున్నాను. నేటికి నా మనోరథము నెఱవేరినది. శతావధాన మీ దినముననే చేయించుట కేర్పాటుచేసినారా ?

మాధ—మొదట చేసినాను గాని నేను కొన్నిపనులమీఁద బెజవాడ వెళ్ళవలసియున్నది. కావున తిరిగివచ్చినతరువాత యేర్పాటు చేసినాను.

రామ—మరల తమరెప్పుడు దయచేయుదురు.

మాధ—అది నేను చెప్పజాలను అయినను మీరు రాకరాక వచ్చినారుగదా. ప్రస్తుతము నాకుదోచిన బహుమాన మిచ్చెదను. పుచ్చుకుని నన్ను సంతోషపెట్టండి. (అని ఎనిమిదిరూపాయలిచ్చును.)

రామ—(పుచ్చుకొని) చిత్తము మీదయయుండిన చాలును; కాని తమరు మాకొక్క యుపకారము చేయవలయును. మేము అవధానము చేయనిదే బహుమానము పుచ్చుకొన్నామని చెప్పుట భావ్యము

కాదు. కావున కొన్నిపద్యములరచించియుంచెదను. అవిమీరుచేయించిన అవధానములలోనివని యేపత్రికకైనను బంపవలయును.

మాధ— అది నేనెట్లుచేయుదును. అవధానము చేయనిదే పత్రికకు పంపినచో బాగుండునా ఈయూరిలోని వారందరును నన్నగతాళి చేయరూ.

రామ— మనవిశ్వనాధముగారు శరభరాజుగారు మొదలయిన వారు మీవలెనే బహుమానము మాత్రమిచ్చి, అవధానము చేయించుటకు తీరికలేదని చెప్పినారు వారును పద్యములను పత్రికకు బంపుటకు సమ్మతించి మీతోగూడ మనవిచేయుమన్నారు.

మాధ— వారు సంతకము చేసినచో నాకభ్యంతర మేమియు లేదు కావున మీరు విశ్వనాధముగారిని, సంతకముచేసి పంపుమనిచెప్పండి అప్పుడు నేనుగూడచేసి పంపుతాను.

రామ— చిత్తము మీమేలు మరచుటకు వీలులేదు. మీకీర్తి మన సోమశాస్త్రులుగారు చెప్పినారు. పద్యాలు విశ్వనాధముగారి కిచ్చి యీదినముననే మేము విశాఖపట్టణము పోవుచున్నాము. కావున దయ యుంచి పత్రికకు మాత్రము పంపవలయునని మాకోరికె.

మాధ— చిత్తము అట్లనే చేయుదును. మీరు విశ్వనాధము గారి చేతికిచ్చి వెళ్ళవచ్చును.

రామ— చిత్తము. వారి చేతికిచ్చివెళ్లుదుము. మాకు సెల విప్పించండి.

(అని యిద్దరు పోవుదురు)

రంగము ౩ బజారువీధి.

(సోమశాస్త్రి రామకవి ప్రవేశము.)

రామ— శాస్త్రిగారూ. రెండు పుంజీలు పడ్డాయి. మనమిక యీయూరనుండరాదు. మొన్న దేవపాలెంలోచేసిన పద్యాలువిశ్వనా

ధంగారికి యిచ్చి వెడదాము. పేపర్లో వారు చాలాగొప్పగా జరిగినదని వ్రాస్తారు. చూచారా నామహిమ.

సోమ——అందుకేగాదు బాబూ మీవెంటనున్నాను. ఏదో నాలుగు కబుర్లుచెప్పి కాలము గడపలేనివాళ్లీ దినాల్లో పనికిరారుబాబూ.

రామ——ఈదినాల్లో చదువుకున్నా వాళ్ళని చూచేవారెవరయ్యా ఇంతకు మన అదృష్టము బాగుంటే పట్టినదల్లా బంగారు మవుతుంది. ఇప్పటికెక్కడా అవధానం చేయనవసరము లేకపోయినది. మన శతావధాన బిరుదు శాశ్వతముగా నుండుగాక! పదండిపోదాము.

---

## అడ్డబొట్టు——నిలువబొట్టు

(జంగము బసవలింగము, సాతాని తిరువెంగళము మరికొందరు ఒక తాటియాకు పాకలో ప్రవేశించుచున్నారు)

బస——రేవుపడవ దాటుటకు వచ్చేవాళ్ళందరికి, ఎండదెబ్బ వానదెబ్బ తగులకుండా యీపాక చాలయుపయోగముగా నుంటూయుంది.

తిరు——ఉపయోగమన్న యుపయోగమా, వందలకొలది మనుష్యులు సుఖిస్తున్నారు.

బస——ఆశ్రీలింగమూర్తి కృపవుంటే యిటువంటి సత్కార్యములు చేయవలెనని బుద్ధిపుడుతుంది.

తిరు——ఆ శ్రీరంగనాయక కరుణాకటాక్షం ప్రసరిస్తే కాని యిటువంటిబుద్ధులు తోచవు.

బస——(దగ్గర నొకమనిషినిజూచి) అయ్యగారు చిత్తగించినారా, అడ్డబొట్టుయొక్క మహాత్మ్యం, ఆమహావిశ్వమంతా యిందులోనేయున్నది

ఆదూలమడ్డముగా వేయుబట్టి యీపాకంతా దానిమీద ఆధారము చేసికొనియుంది. అది సరిగా అడ్డబొట్టులాగుంది. ఈదూలంలాగే అడ్డ బొట్టుకూడ సుఖమంతకు నాధారమని దీనిబట్టే తెలిసికొనవచ్చును.

తిరు—(మరియొకని బిలిచి) నామన వాలకించండి నిలువు బొట్టు మహాత్మ్యమువంటిది మరియొకటిలేదు. దానికదే సాటి. అందుకనే నిలువుబొట్టు మూడులోకాలికి ఆధారమయినది ఆగుజ్జులు చూడండి. నిలువుగా పంగనామములులాగున్నవి. వాటినే ఆధారము చేసికొని కొంప నిలిచినది నిలువుబొట్టంటే కోటిపరవాల కిమ్మతు ఈగుజ్జులు లేకపోతే కొంపలేకపోవును, ఆలాగే నిలువుబొట్టు లేకపోతే లోకమే లేదు.

బస—అడ్డబొట్టు ముందర నిలువు బొట్టెందుకూ పనికిరాదు చూడండా వెనుబద్ద అడ్డబొట్టులాగుననున్న ఆవెనుకబద్ద. లేకపోతే యిల్లు నేల కూలిపోవలసినదేకదా. అడ్డబొట్టుకు నిలువుబొట్టుకు యేను గునకు దోమకున్నంత; తేడాయున్నది. అడ్డబొట్టు రాజాబొట్టు.

తిరు—నిలువుబొట్టుతో అడ్డబొట్టు పోల్చడానికే వీలులేదు. ఈగుజ్జులు లేకపోతే ఆనడిబద్దయెక్కడుంటుంది. నీనెత్తిమీదా యేమిటి?

బస—నానెత్తిమీద గాదు. నీవెన్నుమీదుంటుంది.

తిరు—నిలువుబొట్టును నిందిస్తే మహానరకం పాలైపోతావు. ఏడేడు పద్నాలుగు జన్మాలికి నీకు పుట్టగతులుండవు.

బస—అడ్డబొట్టును దూషిస్తే నీనోరు పుచ్చిపోతుంది. యమ లోకములోనిన్ను యినుపముక్కుల కాకులెగిరెగిరి పొడుస్తాయి. అడ్డ బొట్టును తిడతావు. నీకేమిచేటు కాలమువచ్చింది, విభూతి పిండికట్లు మొగమున నడ్డముగా బెట్టుకొనియుంటే మొహమున కెంత కళకాంతి.

తిరు—నీకళ మండిపోయినట్లేయుంది. శ్రేతకళ ఆతిరుణామణి తిరుచూర్ణము మొగమున దిద్దుకొనిద్వాదశోర్ధ్వ పుండ్రములుశరీరమున

ధరించియుంటే లక్ష్మీవిలాసం కలకలలాడుచు మొగమునిూద తాండవ మాడుతుంటుంది.

బస—నీతాండవము దగ్ధపట్టమైనట్టేయుంది. మొగానికి వెల్లె సినట్టుగా సుద్దపామకోగానే నరా.

తిరు—ఒంటినిండా బూడిద పట్టించుకొని బూడిదగుమ్మడికాయ లాగుంటే నరా వెధవసింగారం ఆకొల్చేదేవుడిని పట్టివస్తాయి, బొట్టు బుద్ధులూను.

బస—ఓరే, ఓరే, దుర్మార్గముండాకొడుకా చస్తావు చస్తావు. మహేశ్వరుని తిట్టకు మహేశ్వరునితిట్టకు నీజిహ్వ పడిపోతుంది.

తిరు—ఏం తిడితే యేంజేస్తాడు నీమహేశ్వరుడు ఉండేది వల్లకాట్లోను, యెముకలు పెత్తెలు వంటినిండా నగలు, యేనుగుతోలు పులితోలే గాని కట్టుకుందుకు గుడ్డలులేవు బొల్లెద్దు నెక్కుతాడు విషమే గాని తినబోతే అన్నములేదు. నెత్తిమీద నీళ్ళకుండ, మీదేవుడికి నీకు సిగ్గులేదు పోపో అవతలకు గుదికఱ్ఱలాగ రాయిపట్టుకొని లింగం జంగం అంటూ తిరుగుతావు.

బస—ఓరి నీతలపండు వేయిచెక్కలుగాను. నీకాయుర్దాయము నరిపోయిందిరా. నీగొల్లదేవుడు గోదారిపాలుగాను ఆవులు మేపుకొని గొల్లబొట్టెలతో నరసాలాడుకొని పెళ్ళామువేత కాలుతాపులుతిని ఉండడానికి కొంపలేక యిల్లరికమొల్చి సముద్రములో కాపురముండి పాముమీదపడుకొని బొల్లిగెద్దనెక్కి తిరిగేదేవుడు నీదేవుడు ఆడిదగ్గర మాత్రమూ వల్లాకాడా. నీదేవుడిని కొలిస్తే దొంగతనము లంజతనమే గాని యికనేమీ అబ్బదు. సిగ్గుపడకావక యింక మాటలాడుతావేమీ.

తిరు—నీకు యమకింకరులచేత పోట్లు.

బస—నీకు రౌరవాది నరకాలు.

ఒక మనుష్యుడు—మీరిద్దరు వాదించుకుంటూ మధ్య దేవుడిని తిడతారేమి ?

తిరు—జంగంముండాకొడుక్కి దేవుడేమిటి ?

బస—గొల్లబోయడు దేవుడేమిటి నా అడ్డబొట్టు మహాత్మ్యము చూపిస్తాపట్టూ ఈపాకలోనున్న జంగాలంతా గాండ్రోయి. అడ్డంగా వున్న దూలం పీకివెయ్యండోయి. యిల్లు నిలుస్తుందేమో చూదాం.

తిరు—ఇక్కడుండే సాతానులందరు రండోయి. నిలువుబొట్టు మహాత్మ్యము చూపిద్దాము. నిలువుగానున్న కొమరులు వాసములు పీకి వేస్తే యిల్లు నిలుస్తుందేమో చూద్దాం పీకండి.

(అప్పుడు జంగములు దూలములాగగా సాతానులు వాసములు పీకుచున్నారు. పాక కూలుచున్నది.)

తక్కిన బాటసారులు—ఓరి మీ నిలువుబొట్టూ అడ్డబొట్టూ దొంగలుతోలా, నిక్షేపమల్లా ఉంచనిలికి నీడ నిచ్చేపాక కూలద్రోసినారు. రండి యీపాటికి, అదిగో రేవుపడవ ఎక్కుదాము రండి.

(అందరు నిష్క్రమించుచున్నారు)

---

స్తోత్ర పాఠము

(ఆశ్రితుడు ప్రభువు ప్రవేశించుచున్నారు.)

ప్రభువు—శంభుశాస్త్రిగారూ అయితే మీరు మాతాతగారి నాటనుండి మీరు మాకాశ్రితులై యున్నారు. ఈనాటివారు కారు. అయితే మీవయస్సెంత.

శంభు—అబ్బో నేనీనాటివాడనాండి. బందరుప్పెనకు మున్నది మైదేండ్లవాడిని. వికారి సంవత్సరపు గాలివానగూడ బాగా యెరుగుదును. డొక్కలకరువని చెప్పుతుంటా రెరుగుదురా? నందన సంవత్సరపు

కరువు అప్పటికి నాలుగేళ్ళ కుఱ్ఱవాడిని. అప్పుడు మా నాయనమ్మ మే మన్నములేక మలమలమాడి చచ్చిపోతూంటే తమ పురోహితుడుగా రింటికి తీసుకొని వెళ్ళి అన్నము పెట్టించేది. తరువాత నేను పాతిక సంవత్స రములు వయస్సులో నుండగా మీతాతగారు పరమపదించారు.

ప్రభు——మా తాతగా రెల్లాంటివారండీ.

శంభు——ఏలాటివారని తమతో నేను మనవి చేయగలను. మనిషి ఆజానబాహువు. స్ఫురద్రూపి ఆయనయెదుటికి ఆడవాళ్ళు వచ్చేరంటే మోహంలోపడిపోయిరన్నామాటే చేరడేసి నేత్రాలు. ఆయనజుట్టు ముడి యుండేదండి పెద్ద గుమ్మడికాయంత యుండేది ఆయనను నేను ముసలి తనములో జూచినప్పటికి ఆయన జబ్బలు మన దర్బారుచావిడి స్తంభాల వలె యుండేవి. ఆయన వక్షస్థలమో మోటబండంత వెడల్పుండేది. శరీరచ్ఛాయ పచ్చగా దబ్బపండుగదా చచ్చిపోయేవరకు గూడ.

ప్రభు——మా బాబయ్యగారికంటె పొడుగగా నుండేవారా పొట్టిగానుండేవారాండి.

శంభు——మీ బాబయ్యగారికంటె బాగాపొడుగుగా నుండేవారు మీతాతగారు. ఆయన చెయ్యెత్తుమనిషి. మీ బాబయ్యగా రాయనకంటె ఒకజానెడు పొట్టిగా నుండేవారు.

ప్రభు——అయితే మా బాబయ్యగారు చాలా బలమంతులట గాదూ.

శంభు——బలవంతులేమిటి. అహాహా! గుఱ్ఱముమీదకూర్చుండి సవారుచేస్తే సవారు తిరిగి వచ్చేటప్పటికి గుఱ్ఱము నడుము విరిగిపోయే దండి. ఒకరోజున పదమూడు గుఱ్ఱాల నడుములు విరిగినది నే నెఱుగుదును.

ప్రభు——ఏంటీ పదమూడు గుఱ్ఱాలే యిరిగిపోయినవిగా. ఆడి తస్సాగొయ్యా యేం బలమండీ.

శంభు—ఈడినారంటే గోదావరి అడ్డంపడి వరదరోజులలో యిద్దరినుంచి అద్దరికి యీదేవారు అయిన భోజనమాప్రాటకు మూడు తవ్వాలబియ్యపుఅన్నము తవ్వెడుపప్పు అచ్చాపునెయ్యితవ్వెడు. శేరు గేదెపెరుగు దానికితగిన కూరగాయ తక్కిన రవర్గాలువుండేవి.

ప్రభు—ఇదంతా యెల్లాజీర్ణమయ్యేది.

శంభు—ఆయన తాంబూలమువేసికొని యొక్కసారినిద్రపోయి లేచేటప్పటికి యెక్కడిదక్కడ భస్మీపటలమైపోయేది రెండుచిన్నాల కస్తూరి చేరెడు లవంగాలు గుప్పెడు యాలక్కాయలు దోసెడు పోక చెక్కలు తులం జాజికాయలు తులం జాపత్రి రెండుమోదల తమల పాకులు ఒక్కపరియాయము వేసికొనేవారు నిద్రపోయి లేచినతరువాత మూడువందల అరిసెలు ఫలహారముక్రింద తినేవారు.

ప్రభు—ఆసత్తువులు ఆరోజులుయెల్లిపోయినాయండి. మేమంతా కూకుంటే లెగలేనోళ్ళముపుట్టాము.

శంభు—అలాగున తమరు సెలవియ్యగూడదు. తమది సుకుమారావతారము. ఏడుమల్లిపువ్వులెత్తు మనుష్యులు. తమకు వెన్నెలకు వడ తగులుతుంది తమకు తివాసులమీద తమరు నడచినప్పటికిగూడ తమ కాళ్లు కందిపోతవి. తమరు సాక్షాత్తు మన్మథావతారము.

ప్రభు—ఏమిసుకుమారమో యెప్పుడు రోగమేనండినాకు.

శంభు—అదిరోగముకాదు. సుకుమారుల కెప్పుడు యీప్రకారంగానే యుంటుంది.

ప్రభు—తమకింత ఒయస్సుందికందాండి బాగా జీర్ణమవుద్ది.

శంభు—తమ అనుగ్రహాముపల్ల యిప్పటికి బాగాజీర్ణమవుతుంది మొన్న తమరు పంపించిన మామిడిపండ్లు పది పుచ్చుకొన్నాను అంతా జీర్ణమైనది.

ప్రభు—పండెంత పెద్దదో సూశారా.

శంభు—పెద్దేంమిటండి అహాహా గుమ్మడికాయంత పండండి ఒక్కొక్కటికి.

ప్రభు—టెంక చిన్నదికామోను నేమండి.

శంబు—అబ్బే టెంక ఉందోలేదో చెప్పడానికివీలులేదు గుమ్మడి గింజంత టెంకయున్నది. ఈజాతి టెంకలేనిజాతనుకుని నేను పండుతినివేసి నాను మధ్య గుమ్మడిగింజలాగయేదో తగిలితే టెంకేమో అనుకున్నాను.

ప్రభు—అయితే రసం సాలావ్వుండమోను.

శంభు—రసమన్నా రసమాండి చెంబుడేసిరసము. ఒక్కొక్క దానిలో మూడు తవ్వాలుంటుంది.

ప్రభు—రసమెల్లాగుందండి.

శంభు—పానక మేనండి. చెరుకురసానికి దానికి యేమీతేడాలేదు తమతోటలోబుట్టిన కాయ తమహృదయమెల్లాంటిదో అదిఅల్లాంటిదే.

ప్రభు—ఎవరోగాని టెంకవుల్పన్నారండీ!

శంబు—అయితే వాళ్ళనోళ్ళుపులుపుగాని కాయపులుపుగాదు.

ప్రభు—అయితే యీచెట్టుకాయ బలం లేదంటారండి.

శంభు—నిజమేనండి ఎంతతిన్నాకాని మనిషిపీనుగులాగె యుంటాడు కాని సత్తువరాదండి.

ప్రభు—అయితే కాయ కొంచెము సువాసనుంటుందండి.

శంభు—మల్లెపువ్వులదండలు చేతితో పట్టుకొన్నట్టే. గుమ గుమ గుమ లాడుతూ వుంటుందండి. కాస్తాకూస్తాసువాసనా.

ప్రభు—ఇంత రసనుందని కాయ బరువులేదనుమండీ.

శంభు—సందేహామూ దూదిపింజండికాయ.

ప్రభు—ఇంకోచెట్టు కాయలున్నాయి. మంచియి ఒకపాతిక్కాయ లిత్తానురండి.

(అని యిద్దరు నిష్క్రమింతురు.)

## తండ్రికొడుకుల వివాదము

(అప్పుడు బలరామయ్యయు శంకరప్పయు ప్రవేశించుచున్నారు)

బల—ఇదివరకెన్నిసారులో మిమ్ము గోరినాను. ఒక్కసారి మీరు మాయింటికి దయచేసి మాపిల్లవాడిని మీరు కొంచెము కూకలెయ్యండి.

శంక—మీపిల్లవాడినినేనే విషయములోకూకలెయ్యాలి. వానిని నాదగ్గర కొకసారి పంపించండి నేను కూకలు వేస్తాను.

బల—తమరు పొరబాటు పడుతున్నారు వాడు మాయింటికే తిన్నగా రాడు. మీయింటికొస్తాడా అదిగాక నేను చెప్పినమాట వాడు వినేటట్టయితే మీతో వచ్చి నేను మొఱ్ఱపెట్టుకొనడమెందుకు?

శంక—అయితే విషయమేమిటో చెప్పినారుకారు ఏమనికూకలు వెయ్యాలి.

బల—ఆసంగతి తమతో నడివీథిలో చెప్పదగినదికాదు. మీ రొకసారి నాతో మాయింటికి దయచేసినారంటే యావత్తు సంగతులు మీతో స్థిమితముమీద మనవిచేస్తాను. ఈ గ్రామములో మీరొక్కరే నాకు ముఖ్య స్నేహితులు. అందుచేత నాగృహకృత్యము మీతోనే చెప్పుకొని పిల్లవాడిని బాగుచేసుకోవలెనని యున్నది. అందుచేత తమ కెప్పుడు తీరుబడో చెప్పినట్లయితే నేనింటికివచ్చి తీసుకొని వెడతాను.

శంక—ఎప్పుడోయెందుకు? నాకిప్పుడే తీరుబడిగా నున్నది పదండి మీతో నేనిప్పుడు వస్తాను.

బల—చిత్త మింతకంటె యున్నదా దయచేయండి.

(అని యిద్దరు నడచి యిల్లు చేరుచున్నారు.)

బల—తమరీ చాపమీాద దయచెయ్యండి. నేనిప్పుడే లోపలికి వెళ్ళి పిల్లవాడిని దీసికొనివస్తాను. కాదు కాదు. ఇక్కడే యుండండి. లోపలికి వెడితే వాడికి నాకు తగాదా అవుతుంది.

శంక—సరేపోని యిక్కడనుండే పిలవండి.

బల—చిత్తము. ఒరే ఆనందరావూ, ఇల్లారా శంకరప్పమామ గారు వచ్చారు.

(అప్పుడానందరావు ప్రవేశించుచున్నాడు)

శంక—అబ్బాయీ ఈలాగున కూర్చుండుము.

ఆనంద—చిత్తము (అని కూర్చుండును)

బల—శంకరప్పగారూ కడుపుచింపుకుంటే కాళ్ళమీాద పడుతుం దని నోరుమూసుకొని యిన్నాళ్ళనుంచి యూరుకుంటున్నాను. మావాడి చరియలు బొత్తిగా బాగులేవు. వీడిమూలందర నేను నిలవలేకుండా యున్నాను.

శంక—అబ్బాయీ! ఏమిటి యల్లరి. పరువుగల కుటుంబము లలో తండ్రికొడుకుల కిట్లాటి వివాద యుండవచ్చునా ఒకరికితగవు చెప్పవలసినవాళ్ళుగదా మీారు మీాకే యొకరుతగవు చెప్పవలెనా? పెద్దవాడినీ తండ్రిమూండావాడిని అంత యునురుపెట్టడం మంచిదికాదు.

ఆనం—నేనేమి యునురుపెట్టుచున్నానో చెప్పుమనండి ఆయన నన్నే యునురుపెట్టుచున్నాడు కాని నేనేమియునురు పెట్టుటలేదు. చక్కగా దరియాప్తు చేసిన పక్షమున మీాకే తెలియగలదు.

శంక—బలరామయ్యగారూ ఏమిటి వీనావాడిల్లాగంటాడు

బల—అల్లాగునే మాటాడుతాడు. తండ్రిని హింసపెట్టేవాడింత కంటె యెక్కువ మాటలంటాడా? తనవల్ల లోపమున్నదంటాడా? ఏమి చేస్తున్నాడో చెపితే సిగ్గుచేత తల వంచుకోవలసి వస్తుంది.

ఆనం—పంచుకుంటే యేకంగా యిద్దరము పంచుకుందాము. చెప్పదలచిన దేమిటో చెప్పు.

బల—చెప్పు చెప్పని బెదరిస్తావు. చెప్పక మానుతానట్రా చూడండి. శంకరప్పమామగారూ నాకు చాలా కాలాన్నించి దగ్గు బాధగావుంటే తమవంటి పెద్దలందరుకూడా నల్లమందు వేసుకో మన్నారు. నల్లమందు చేదుగావుంటుంది అని వేసుకోలేక నేను తట పటాయిస్తూంటే ఒక పెద్దమనిషి వచ్చి రోజూ కాస్తంత బ్రాంది పుచ్చుకోమని సలహా చెప్పాడు. అప్పటినుంచి రోజుకు ఏదో కొద్దో గొప్పో పుచ్చుకుంటుంటాను. దుస్సహవాసాలు చేసి నేనెన్ని రూకల్లో దాస్తున్నా వీడు వెతికి నాకొక చుక్కయినా యుంచడు. ఇది వచ్చి ఘోరకలిగా వున్నది. నేననేక పర్యాయములు లబలబ మొత్తుకుంటే నేను పుచ్చుకోవడంలేదు. పుచ్చుకోవడం లేదని చెప్పి అయినకాడికి బుడ్డిలో నున్నదికాస్తా త్రాగివేసి దాన్నిండా నీళ్ళెక్కిస్తాడు. బుడ్డినిండా యున్నదికాబోలు ననుకొని నేనది పుచ్చుకొనేసరికి వట్టినీళ్ళు. ఆపైని నిషాచాలక తెల్లవార్లు కాళ్ళుపీకి నేనుచస్తాను. అస్తమానువెళ్ళి జూదపు పాకలో కూర్చుంటాడు.

శంక—మహాగొప్పతగాదా వుందే ఎక్కడా తండ్రికొడుకుల కిటువంటి తగాదా వినలేదు. ఇందులో తప్పెవరిదో తీర్పుచెప్పుట కెవ రయినా బృహస్పతివంటి బుద్ధిమంతులు రావలెను.

ఆనం—ఇదంతా అబద్ధమండి. నేనెక్కడనో నాలుగు రూపా యలు జూదమాడి తెచ్చుకుంటే అవి యీయనగారు తాగేస్తాడు.

బల—ఇక వీడితో నేను పడలేను మాకుభాగా లేర్పరచండి విడిపోతాము.

ఆనంద—పంచుకుందు కేమున్నది. సారాపాక ఆయనవాటా. జూదపుపాక నావాటా. మాయిద్దరికి యున్నభూమి. లక్ష్మీశానభూమి లే

బల—చూడండి. ఆపాడుమాటలు వీడు అక్కరకొస్తాడా.

ఆనంద—మనమిద్దరము అక్కరకురాము. ఈయన త్రాగుబోతు తనము మూలాన్నే నాకుగూడ అబ్బిందండి. లేకపోతే బాగుపడుదును.

శంక—ఇది నావంటివాడు తీర్చవలసిన తగాదా కాదు బాబూ. మీకు మీపెద్దలకు నమస్కారము మీవంటివాడిని తెచ్చి తగవు తీర్చుకోండి. నేను వెళ్ళెదను.

(అందరు నిష్క్రమింతురు)

---

## గార్ధభజన్మము

రంగము—ఒక నదీతీరము

(అప్పుడు వేదాంత సూరిగారును కొందరు శిష్యులును)
(ప్రవేశించుచున్నారు)

వే—శిష్యులారా! ఈవరకు సమస్తధర్మములు మీకుపదేశించితిని. ఇప్పుడు చెప్పవలసిన పరమార్థ మొకటున్నది. అది ధర్మములలో కెల్లధర్మము, ఈధర్మ మాచరింపకపోయిన పక్షమున తక్కిన ధర్మము లన్నిటిని ఆచరించుట వ్యర్థము. ఇది మాకు అనుశ్రుతముగా వచ్చినది కావున మీరు భక్తిశ్రద్ధలతో నాలకించి ఆలకించుటతో తృప్తిపొంది ఊరకుండక ఆచరింపవలెను.

ఒక శిష్యుడు—దేవరవారు ఆ ధర్మమేదో తప్పక తెలియజేయు వలయును. మీపాదములసాక్షిగా అనుష్టించి కృతార్థుల మయ్యెదము

రెండవ—శిష్యుడు—అటువంటి పరమార్థములు వినుటకేకదా మీ పాదసేవ చేయుచున్నాము. కాబట్టి తక్షణము తెలియజేయవలెను.

వే—నాయనా వినండి ఇతరమతస్థులందరు రాక్షసులు. మన మతస్థులు ఉత్తమోత్తములు. దేవతలు. ఇతరమతస్థుల మొగము మన మెన్నడు చూడకూడదు. అట్లు చూచినవారు గార్ధభజన్మమెత్తుదురు. అనగా గాడిదలై పుట్టుదురు.

ఒక శిష్యుడు—స్వామీ! వారి మొగములు చూడకుండ ప్రపంచములో నేలాగున తిరుగగలము. వ్యవహారము లేప్రకారముగా చేసికొనగలము. ఎదురుగా వచ్చినప్పుడు చూడకుండా యెట్లు తటస్థించును.

వే—ఇటువంటి పిచ్చిపిచ్చి సందేహములు మీ మనస్సులో పెట్టుకోగూడదు. ఇతరమతస్థులతో మీరు వాళ్ళ వ్యవహారములే చేయగూడదు వాళ్ళ కప్పులియ్యగూడదు వాళ్ళదగ్గర మనము అప్పులు పుచ్చుకోగూడదు. ఈతుచ్ఛమైన ప్రపంచకవ్యవహారముల విషయమై వాళ్ళ మొగములు చూచి వాళ్ళతో మాట్లాడి నరకకూపములలో బడిపోవుదురా? ఇతరమతస్థు లెదురుగా వచ్చినప్పుడు విసనకర్ర యెదురుగా పెట్టుకోవలెను లేకపోతే ఉత్తరీయమైన మొగమున కడ్డముగా బెట్టుకోవలయును. అటుల వీలులేనిపక్షమున యెదుటవానితో వెనుకప్రక్కకు తిరిగి మాటాడవలయును. శాస్త్రమూ మరొకటా? ఇటువంటి పరమార్థములు తెలుసుకొనకపోయిన తరువాత ఎన్ని భాషలు చదివిననేమి ఎన్ని ధర్మములు నేర్చుకొన్ననేమి?

శిష్యులు—చిత్తము. చిత్తము. ఇప్పుడు మాకు బుద్ధివచ్చినది. ఇదివరకు యితరమతస్థులతో మేము చేసిన వ్యవహారము లన్నింటికి మేము ప్రాయశ్చిత్తము చేసుకొని యికముందు వాళ్ళజోలికి పోయి వాళ్ళతోటి మాటలాడము వాళ్ళను చూడము మీయుపదేశమువలన మిక్కిలి ధన్యులమైతిమి.

వే—నేను చేసిన యుపదేశములతో మీకు యెంతవరకు గురి కుదిరినదో పరీక్షజేయుటకై నేను మీయూరువచ్చి మీగృహమందు

వారము దినములుండెదను. మీానమ్మకము సంగతి అప్పుడు బాగ తెలియగలదు.

శిష్యులు—చిత్తము చిత్తం తమ రాక మహాప్రసాదము.

(అప్పుడు దేవదాసుడను యితరమతస్థుడు ప్రవేశించుచున్నాడు)

దేవ—(తనలో) ఈచెట్టుచాటునుండి వీని యుపదేశ మంత విన్నాను. ఇంత పాడుయుపదేశము లేదుగదా! ఈగురువుగారికి శిష్యులకు తగినట్లు బుద్ధి చెప్పవలయును. (అని దగ్గర మేయుచున్న యొ గాడిదవద్దకుబోయి దానిమెడ కౌగలించుకొని) అయ్యయ్యో! అయ్యయ్యో! మీాకెంతకష్టము వచ్చినదండీ స్వామిా! మూామూాలముగ మీా కెంతకష్టము వచ్చినదండీ స్వామి! మీాదుఃఖము జూచిన నేలాగు భరించగలనండీ అయ్యయ్యో! అయ్యయ్యో! ఇది మీావంటివారి కావలసినది గాదండి స్వామిా

(అని గట్టిగా నేడ్చుచున్నాడు

వే—ఇదేమిటోయి. వీడెవడో పిచ్చిముండాకొడుకులాగున్నాడ గాడిదను కౌగలించుకు నేడ్చుచున్నాడేమిటి?

శిష్యులు—నిజముగా వీడికి పిచ్చేనండి. లేకపోతే వీడిట్లె ప చేయడు. చూాతామురండి.

(అని వెళ్ళుచున్నారు

వే—(దగ్గరకుబోయి) ఏమిటయ్యా పిచ్చివాడా? గాడిదన కౌగలించుకు నేడ్చుచున్నావు. నీకుపిచ్చా. వెఱ్ఱియూ.

దేవ—(ఏడ్చుచు) అయ్యో! స్వామిా! వీనికెంత కష్టమువచ్చి నది. ఈకష్టము నేనెటుల భరించగలను. అయ్యో! నాతండ్రీ అయ్యో నాస్వామి యిటువంటి కష్టము మీాకు తెచ్చిపెట్టిన దుర్మార్గులు వంశక్ష యమైపోవుదురు.

వే—నీగోల కాలా చెప్పవయ్యా నీదుఃఖమేమిటోను.

శిష్యులు—స్వామీ, ఈయనకు పిచ్చెండి.

దే—నాకుకాదురా నాయనా! నీకుపిచ్చి సంగతిచెప్తాను వినండి ఒక క్షణముక్రిందట మీగురువుగారు ఇతరమతస్థుల మొగము చూచినవారు గార్ధభజన్మమైపోవుదురని చెప్పినారుగదా! కాబట్టి యీ గాడిద మావంటి యితరమతస్థుల మొగముచూచి యీలాగున పుట్టిన మీబంధువులలో నెవరో నొకరై యుండవచ్చును. బహుశః వేదాంత సూరిగారి తండ్రియో తాతయో మావంటివారి మొగము చూచి యీగాడిదయైపుట్టి చాకలిమూటలు మోయుచున్నారని నమ్ముచున్నాను మాపాపపుమొగములు చూడబట్టి మీాకింత కష్టము వచ్చినది గదా యని యీలాగున యేడ్చుచున్నాను.

వే—ఛీ!—దౌర్భాగ్యుడా! మాతండ్రి తాతలను నిందించు చున్నావురా?

దేవ—నిందించుట లేదయ్యా మహాప్రభో! మామూలముగా వీనికింత మహాపద సంభవించినది గదా యని దుఃఖపడుచున్నాను.

శిష్యులు (తనలో) ఓరీ! మన గురువుగారికి ఈయన యెవరో గాని మంచిదెబ్బ కొట్టినాడురా! ఇటువంటి వారికి యీలాగుననే బుద్ధి చెప్పవలసినది.

వే—ఈదుర్మార్గునివద్ద మన ముణ్ణ పక్షమున పాపకూపములో పడిపోవుదుము రండిపోదము. (అని అందరు నిష్క్రమించుచున్నారు.)

---

రంగ భా మో పా ఖ్యా న ము

రంగము—ఒక పాఠశాల

(భోగనాధస్వామి యను నొక యుపాధ్యాయుడు తనతరగతిలో కుర్చీ మీాద కూర్చుండి నిద్రించుచుండగా దశరధరామయ్యయను మఱియొక ఉపాధ్యాయుడు ప్రవేశించును)

దశ—(తనలో) ఈక్లాసుపిల్లలూరకున్నారేమి చెప్పుమా

మేస్టరుగారు రాలేదా యేమి? (అని చూచి) అమగో! మహాభోగనాధ స్వామిగారు వచ్చారు. కాని నిద్రపోతున్నారు. పాపము లేపుతాను. (అని దగ్గరకు వెళ్ళి) భోగనాధం! శే లే క్లాసులో నిద్రపోతున్నావే మిటి?

భోగ—నాగమణి! నాగమణి! చీరె బాగున్నదా? (అని పలవరించును.)

పిల్లలు—(నవ్వుచున్నారు.)

దశ—ఛీ! వెధవల్లారా నోరు మూయ్యండి ఆలా గింజుకుచస్తా రేమిటి? స్టాండప్ ఆన్ది బెన్చ్.

పిల్ల—(మెల్లగా నవ్వుచున్నారు.)

దశ—(మీద చెయి వేసి) భోగనాధం! భోగనాధం! లే లే. యిప్పుడు నిద్రపోతున్నావేమిటి?

భోగ—(సగము తెలివివచ్చి) రాత్రికన్నె - అని నాలిక కరుచుకొని (కనులు తెరచి చూచి) ఎవరువారు? ఎవరువారు?

దశ—మరెవరు లేరు నేనె రాత్రి కన్నె ఏమిటి? విపరీతము గా మాటాడుతున్నావేమిటి?

భోగ—మరేమిలేదు. ఇప్పుడు నిద్రపోతున్నావేమని అడిగి నావు కాదూ?

దశ—ఔను అడగినాను. అడిగితె?

భోగ—అడిగితె దానికి జవాబు చెప్పినాను.

దశ—రాత్రికన్నెంటె ఓమిటూ జవాబు?

భోగ—రాత్రిమాగేదెదూడ మెడకుకట్టె కన్నె పోయింది. కట్టివేయకుండా వదలివేసితినా పాలు తాగిపోవునని కన్నెగోసం పూరం జడి బయులుదేరి తెల్లవార్లూ తిరిగినాను. ఎక్కడా కన్నె దొరకలేదు.

దశ——(మెల్లగా చెవిలో) మీ యింటి ప్రక్క భోగం వాళ్ళింటిలో వొక కన్నె వున్నది. అదైనా దొరకలే?

భోగ——చాలు లేవయ్యా నీ వేళాకోళాలు.

దశ——కొబ్బరిచెట్టు ఎందుకెక్కావయ్యా అంటే దూడగడ్డికోసర మన్నాడట! ఆలాగుంది నీజవాబు.

పిల్ల——(పుస్తకములు చాటుబెట్టుకొని ముసిముసి నవ్వులు నవ్వుచున్నారు)

భోగ——ఓరీ వెధవల్లారా! ఒక్కొక్కడినే తవ్వి పాతేస్తాను చూడండి నవ్వులల్లా పువ్వులచేస్తాను. నాతడాఖా ఎరగకుండా వున్నారు మీరు.

దశ——పాఠం చెప్పకుండా నిద్రపోవడమే చాలు! అక్కడ కొప్పడకు ఈసంగతి విని హెడ్‌మాష్టరు వచ్చినా నీపరువు నాపరువు తీసి వేస్తాడు.

భోగ——హెడ్‌మాష్టరుగారొస్తే ఏదో వొకటి సరిది చెప్పలేక పోతానా ఏమిటి? ఈమాత్రం చెప్పలేకపోతే తెనాలి రామలింగము లాగు రోజుకు తొంభై తొమ్మిది తప్పులుచేస్తూ రెండుమూడేళ్ళనుంచి ఏలాగు నెట్టుకొని వస్తున్నా ననుకొన్నావు?

దశ——సరేగాని నిజంగా యెందుకు నిద్ర లేదో కొంచెము చెప్పుదూ? దూడకన్నెకు వెళ్ళేవంటే, నేల వుమ్మేయరు. నీమాటపిచ్చివాడైనా నమ్మడు. దూడకన్నేమిటి. నీమొఖం నిజం చెప్పు?

భోగ——ఏం దూడకన్నె పోగూడదా? దానికోసం నే వెళ్ళకూడదా?

దశ——ఏదో కన్నెకోసరం వెళ్ళినమాట నిజమే అంతవరకు నే నొప్పుకుంటాను కాని. పొద్దున్నే వూళ్లో యేదో కొంచెం శుభమైన సంగతి విన్నాను. అది నిజమేనా? అది నిజం కాబట్టే? రాత్రి కన్నె అని

నీనోట వచ్చింది నిద్రబద్ధకంచేత నిజమే భగవంతుడు పలికించిన 'డు. లేకపోతే ఆమాటని నాలికెందుకు కరుచుకొంటావు. కొంచెం నింపతలికి రా? చెప్తాను.

భోగ—ఒరే! అందరు పుస్తకాలు తీసి చదువుకోండి! ఇప్పు డొచ్చి పాఠ మప్పగించుకొంటాను. వొప్పగించకపోతే తప్పవొక్కంటికి డజన్ దెబ్బలుచొప్పున కొడతాను (అని దశరథరామయ్యతో వసారా లోనికి వెళ్ళును)

దశ—భోగనాథం! పిల్లి కళ్ళుమూసికొని పాలుతాగి తనచర్య లెవరూ చూడలేదనుకుంటుందట! ఆలాగే నీవుకూడా రాత్రిచేసిన పని యెవరికి తెలియడం లేదనుకుంటున్నావు గాబోలు! నీవు దేనికో కన్నె రికంచేసినావని ఊళ్లో చెప్పుకుంటున్నారు. నిజమేనా యేమిటి?

భోగ—ఏదో బాబూ నన్నాట్టె చంపక వదిలేస్తూ. లేనిపోని ప్రశ్న లేసి చంపకు. జరిగిందేమో జరిగింది. దీనమ్మకడుపుకాల యెల్లా పొక్కిందిరా తెల్లవారేటప్పటికి?

దశ—పాపం బద్ధలుకాకమానదు అయినా నీకు గుట్టూమట్టూ లేదుగదా! నీవు బహిరంగముగా వెళ్ళేవాడవైతివి. కాని, భోగనాథం నీకొక్కమాట చెప్పాలని వుందిరా నాకు.

భోగ—ఏమిటో చెప్పు పెండలాడేను.

దశ—ఒరే నీవు స్కూలు మాష్టరువు కదా మాష్టరుయొక్క ప్రవర్తననుబట్టి పిల్లలప్రవర్తన యుంటుందికదా! నిన్ను చూచి పిల్లలు చెడిపోతారుగదా! నీవీలాగున చేయవచ్చునా?

భోగ—ఓరి పిచ్చివాడా! నావుద్దేశమేమిటో నీకు తెలియలేదు గాబోలు! చెప్తాను విను నేను రిఫారం చేయదలచుకొన్నాను.

దశ—(నవ్వుచు) నీరిఫారము మండా. ఇదేమి రిఫారమురా?

భోగ——నారిఫారము మండుతుంది? నారిఫారము మండుతుందో సాగుతుందో చూడు! వివాహములకు దేవాలయములలో వుత్సవము లకు భోగంవాళ్ళను పిలువకూడదని కొందరు తెలివితక్కువవాళ్ళు బోధించి లోకమంతా పాడుచేస్తున్నారు. పైగా గన్నెరికములు చేయ కూడదని భోగమోళ్ళ సావాసం చేయకూడదని పిచ్చికుక్కల్లాగు మొరుగుతున్నారు. అవి తప్పొడుకూతలని తెలియచేస్తూ కొన్ని లెక్చరు లిచ్చి కొన్ని గ్రంథాలు రాయ తలచుకొన్నాను. ముందుగా కన్నెరిక ములు మంచివని చెప్పతలచుకొన్నాను. ఇప్పటి రిఫార్మర్లవలె చెప్పే దొకటి, చేసేదొకటి. కాకుండా చెప్పతలచుకొన్న సంగతేమో ప్రాక్టి కల్‌గా చేసి చూపించవలెనని ఈపని సంకల్పించినాను. చెప్పెడిది, చేసెడిది వొకటే అని అనుష్టించి చూపించుచున్నాను. దిక్కుమాలిన దేముడు పుస్తకాలు రాయడానికి తెలివితేట లిచ్చినాడుగాని, లేకపోతే పుస్తకాలు వ్రాసి లిటరేచర్ పుట్టించి లోకము ముంచెత్తివేతును.

దశ——ఆరే నీకడుపుగాల! ఉద్దండపిడుగువురా నీవు! ఇందుకే నిన్ను స్నేహితులంతా రంగధాముడంటారు. నీచరిత్ర రంగధామో పాఖ్యానమని యెవరిచేతనైనా వ్రాయించవలెనని వుంది నాకు. విశ్వా మిత్రసృష్టిలో తాడికి నేలతాడి, తేగలకు పిల్లితేగలు, నక్కకు గుంట నక్క పోటీగావున్నట్లు సత్పురుషుల చరిత్రతోపాటు భామలో నీపాడు చరిత్రకూడా వుండవలె వుంటే చదివి కొందరు బాగుపడతారు.

భోగ——మీయిష్టమొచ్చిన చరిత్రలు వ్రాసుకోండి కూసుకోండి! ఏడవండి! నే చేసేవని నేచెయ్యకమానను. గంటకావచ్చినది, క్లాసు లోకి వెళ్ళుదాము రా! (అని వెళ్లుచున్నారు)

## వి ష్ణు భ క్తి

(శంకరప్ప నారాయణప్ప ప్రవేశించుచున్నారు)

శంక—ఏమోయి ! నారాయణప్ప ! నీవీమధ్యను పరమభాక్తుడ వైనట్లు కనబడుచున్నావు. అందులో విష్ణుభక్తుడవైనట్లు కనబడు చున్నావు. ప్రొద్దున్నే లేచి, యీ చలికాలంలో స్నానముజేసి పట్టుపంచ గట్టుకొని, కేశవస్వామిగుళ్ళోకి బహుశ్రద్ధగా వెళ్లుచున్నావు. పూర్వ మెప్పుడైనా విభూతిపిండికట్లు బెట్టేవాడవు అవన్ని మానివేసినావు. ఎవరైనా నీకు అష్టాక్షరీమంత్ర ముపదేశించినారా యేమిటి ? ఇంతమార్పు నీలో కలగడం నాకు మిక్కిలి ఆశ్చర్యముగానున్నది. దీనికేమికారణమో కొంచెము చెప్పగలవా ?

నారా—నాలో యీలాటిమార్పు వచ్చేటందుకు చాల గొప్ప కారణమే యున్నది. కారణములేనిదే యేకార్యములు జరుగవుగదా ! మునుపు పెట్టే విభూతిపిండికట్లు మానెయ్యడానికి యిప్పుడు పంగనామం పట్టుపంచలు సింగారించుకొని ప్రొద్దున్న దేవుడుగుళ్లోకి వెళ్ళడానికి గొప్పకారణ మున్నది.

శంక—ఆకారణమేమిటో నాకొంచెము తెలియజేస్తావా ? నీ వలెనే నేనుకూడ పరమభాగవతోత్తముడనై మంచిమార్గములో పడ్తాను.

నారా—చెప్తానుగాని యిది దేవరహస్యము. పదిమందికి తెలియ గూడదు. ఇది నీలోను నాలోను మాత్రమే యుండవలయును. పైకి పొక్కిందంటె మననోట్లో కరక్కాయ పడుతుంది.

శంక—మీరహాస్యము నేను బయలుపెట్టను నేనుగూడ తరుణోపాయము ఆలోచించుకుంటాను. నీవు ఒక్కడవే వైకుంఠానికి వెళ్ళకూడదు. నీజుట్టో, నీదంధ్యమో, నీకాళ్ళో పట్టుకుంటాను. నన్నుగూడ దీసికెళ్ళు.

నారా—కాళ్ళు పట్టుకుంటే పట్టుకున్నావు గాని నీపుణ్యమయిరి జుట్టు జంధ్యంమాత్రం బట్టుకోకు జంధ్యం తెగిపోతుంది జుట్టుపట్టుకుంటే వున్న పిలక వూడుతుంది.

శంక—అలాగేచేస్తానుగాని ఆ దేవరహాస్యమేమిటో చెప్పు.

నారా—ఇదిగో చెప్పుచున్నాను విను శివుడు ప్రత్యక్షదైవము కాడు. ఎన్నాళ్ళుసేవించినా పట్టిదే. విష్ణుమూర్తి ప్రత్యక్షదైవము. సేవించినవారికి వెంటనే ఫలంకనబడుస్తాడు.

శంక—నీకు విష్ణుమూర్తి ఎప్పుడైనా ప్రత్యక్షమైనాడా ఏమిటి?

నారా—అహా! ఈమధ్యరోజూ అవుతూనేవున్నాడు.

శంక—ఏరూపముతో ప్రత్యక్షమవుతున్నాడు? సగుణుడా! నిర్గుణుడా?

నారా—ఈరూపమేమిటి ఆరూపమేమిటి. అన్నిరూపములతో ప్రత్యక్షమౌతాడు నిర్గుణ్డైవాన్ని నేను సేవించనే సేవించను. సగుణుడు కాబట్టే నేను సేవిస్తున్నాను.

శంక—సగుణమైతే యేగుణములుగలవో చెప్పు!

నారా—ఏగుణములని చెప్పను. ఒకప్పుడు తెల్లగావుంటాడు. ఒకప్పుడు పచ్చగావుంటాడు ఒకప్పుడు తియ్యగావుంటాడు? ఒకప్పుడు కమ్మగావుంటాడు ఒకప్పుడు పుల్లగావుంటాడు ఒకప్పుడు కారంగా వుంటాడు ఒకప్పుడు కరకరలాడుతూ వుంటాడు. ఒకప్పుడు మెత్తగా వుంటాడు. ఒకప్పుడుపలుచగా వుంటాడు. ఒకప్పుడు గట్టిగావుంటాడు.

శంక—నీ మాటలు బలేతమాషగా వున్నాయి దేవుడు తియ్యగా వుండడమేమిటి? కారంగావుండడమేమిటి? ఇటువంటిదెక్కడ వినలేదు. దేవుడు సగుణుడని చెప్పేవారిమాటలు విన్నాము. నిర్గుణుడని చెప్పే వారిమాటలు విన్నాము కాని, యిటువంటి తమాషాలుమట్టుకు వినలేదు దేవుడు కరకరలాడుతూ వుంటాడనికూడా అన్నావు అదేదో నాకు స్పష్టంగా జెప్పునా కేమి బోధపడటం లేదు.

నారా—తెలియకపోతే అడిగితే చెప్పనా? నాకు ముఖ్యస్నేహితుడవగుటచేతను విష్ణుమూర్తికి శిఫారస్సుచేసి నిన్నుగూడా బాగుచేయవలెనని నాకెంతో అభిలాషగావుంది. అందుచేత తప్పకుండా చెప్తాను, శ్రద్ధతో విను విష్ణుమూర్తివారి ఆలయములోకి వెళ్ళితే దేవుడు లేడనే నాస్తికులకందరికి బుద్ధివస్తుంది శివాలయంలోకి వెళ్ళితే శివుడు ప్రత్యక్షఫల మివ్వలేడు. విష్ణువు వెంటనే ఫలమిచ్చివేస్తాడు. వెంటనే నోరు తీపిజేస్తాడు. ఒకప్పుడు పులిహోరరూపమై ప్రత్యక్షము అవుతాడు. ఒకప్పుడు చక్రపొంగలి రూపముయెత్తుతాడు. ఒకప్పుడు దధ్యోదనంరూపమెత్తుతాడు. ఒకప్పుడు చిట్టిగారెల అవతారమెత్తుతాడు. ఒకప్పుడు పరమాన్నరూప మెత్తుతాడు. ఇన్నిరూపాలతో ఆయనప్రత్యక్షమై నోరుతీపిజేసి కడుపునిండించి రక్షిస్తాడు. కాబట్టి విష్ణుమూర్తివారే సర్వేశ్వరుడని నాకునమ్మకముకలిగింది. ప్రత్యక్షఫలములివ్వనిదేవుడు దేవుడా? శివాలయంలోకి చాలాసార్లు వెళ్ళిచూచాను. ఎన్నిమారులు వెళ్ళినా మారేడుపత్రి కొబ్బరికాయముక్కలు తప్ప మరేమిలేదు. ఈపాటి భాగ్యానికి వెళ్ళడమెందుకని శివాలయంలో అడుగుపెట్టడం మానివేసినాను అప్పటినుంచి నాకు శివభక్తి తగ్గిపోయింది. ఒకసారి మాచుట్టాలెవరో కేశవస్వామికి భోగం చేయించినారు. ఆవేళ నన్నువాళ్ళు బలవంతపెట్టి గుళ్ళోకి దీసికెళ్ళారు. విష్ణుమూర్తి మహత్వమేమిటో అరోజున నాకుపూర్తిగా తెలిసింది. అది మొదలుకొని నేను రోజు గుడికి

పిస్తూవున్నాను. ఇన్ని మాటలెందుకు కోవెల అంటే నాకు మిఠాయి దుకాణమే అని నమ్మ. ఈవిష్ణుమూర్తివారివల్ల నాకింకొక లాభంకూడ. మునుపు ప్రతిరోజు ఆరుడబ్బులో అణాడబ్బులో పెట్టి మిఠాయి దుకాణాలవద్ద యేమైనాకొనుక్కొనితినేవాణ్ణి. గుడిమరిగినతరువాత మిఠాయి దుకాణం కట్టిపెట్టాను. రోజు అణాడబ్బులో ఆరుడబ్బులో మిగులుతు న్నాయి ఏదో ఒకటి కమ్మగా తియ్యగా నోటికి తగులుతూ వున్నది. ఇన్ని లాభాలు చేసేవిష్ణుమూర్తి దేవుడుకాక వెఱ్ఱిశివుడు దేవుడవుతాడా? నాభక్తికి తగిన కారణముందంటావా లేదంటావా ?

శంక—నీకారణం చాలాగొప్పది. ఇటువంటి గొప్ప యుద్దేశము మనస్సులో పెట్టుకొని విష్ణుభక్తులైనవారెవరు ఇదివరకు లేరని నాయభిప్రాయము.

నారా—పిచ్చివాడవు. నావంటి మహానుభావులు, నాతలదన్నినవారు ఇదివరకే అనేకు లుండవచ్చును. ఏపుట్టలో ఏపామున్నదో ఎవరికి తెలుసును?

శంక—అయితే విష్ణుమూర్తివారు చక్రపొంగలి రూపం చిట్టిగారెలరూపం ఎత్తుతున్నారని చెప్పినావుగదా! అవతారాలకు అవతారాలే భక్షించివేస్తున్నావా యేమిటి నీవు ?

నారా—అవతారాలకు అవతారాలు నేనేమి భక్షించగలను? ఆపనిచేయడానికి బిరుదులు పొందిన మహానుభావులు ఇదివరకనేకమంది యున్నారు. విష్ణుమూర్తివారియొక్క మత్స్యావతారము కూర్మావతారము వరహావతారము కూడా లెక్కలేకుండా గుటుకుగుటుకు మింగివేసే మహానుభావు లుండగా వారి ముందరనే నెంతవాణ్ణి. హనుమంతుని యెదుట కుప్పిగంతులు వేయుట పనికివచ్చునా ?

శంక—అయితే నాలుగు డబ్బులుతోటి నీవు విష్ణుమూర్తివై

పోయినానన్నమాట. రెండు డబ్బుల తిరుచూర్ణమును రెండు డబ్బుల నామముసుద్ద ప్రస్నట్టయితే నేను కూడా విష్ణుభక్తుడను అవుతాను.

నారా—ఇదేమార్గము. రేపటినుంచి నీవుకూడా రా.

శంక—విఘ్నేశ్వరునిమీద భక్తియూ, ఉండ్రాళ్ళమీద భక్తియూ యని వెనక ఒక సామెత వున్నది. అలాగే పులిహోర చక్రపొంగలి మీద భక్తిగాని మనకు దేవుడిమీద భక్తి ముఖ్యం.

నారా—గట్టిగా కేకలు వెయ్యకోయి. నీయిల్లు బంగారంగాను. ఇది నలుగురు విన్నారంటే మనలాగే వారు గూడా పట్టువంచలు గట్టుకొని సిద్ధమైతే తిన్నంత చక్రపొంగలి పులిహోర మనకు దొరకవు. మన నోట్లో కరక్కాయపడుతుందిరా వెళ్ళుదాము.

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు)

---

## రంభా మేనకా సంవాదము

మేనక—అక్కా! రంభా! ఏమే తీరుబడిగా నున్నావు.

రంభ—ఈమధ్య నాకు మిక్కిలి తీరుబడిగానే యున్నది.

మేనక—అదే నేను గూడ చూచుచున్నాను మునుపటివలె నీయింటికి యజ్ఞము, చయనము, పౌండరీకము, వాజపేయము, సర్వతోముఖము మొదలయిన క్రతువులు చేసి చెవులకు కుండలములు, వ్రేలాడగట్టుకొని దర్భాసనాలు శాలువలు వీపులమీద దగిలించుకొని బుఱ్ఱముక్కులతోను బొడుముబుఱ్ఱలతోను సోమయాజులవారలు నీయింటికి రావడములేదు. ఎందుచేతనో కారణము తెలిసినదా?

రంభ—ఆహా కారణము తెలిసినది. భూలోకసంచారము జేసి నారదులవారొకనాడక్కడి విశేషములు ప్రభువైన యింద్రునితో చెప్పుచుండగా నేను వినియుంటిని. అదియే నీకు చెప్పెదను.

మేనక—ఆకారణ మేమో నాకుగూడ చెప్పు. నానందేహము గూడ తీరిపోవును.

రంభ—ఇదిగో చెప్పుచున్నాను విను భూలోకములో మును పటియజ్ఞములు చాలమట్టుకు నశించినవి. అక్కడక్కడ తెలివితక్కువ బ్రాహ్మణులెవరో యొకరు మునుపటివలె యజ్ఞములు చేయుచున్నారు వారుకూడ కేవలపరమార్థచింతలో జేయుటలేదు. యజ్ఞము పేరుపెట్టి నాలుగువేలో యైదువేలో రూపాయలు సంపాదించి యందులోనియొక వేయిరూపాయలో రెండువేలో కర్చుపెట్టి యజ్ఞమయినదనిపించి తక్కినసొమ్ము వడ్డీవ్యాపారము చేసికొనుచు హాయిగ నుందురు.

మేనక—పోనీవే. అటువంటివారైనా విశేషముగా బయలుదేరి యజ్ఞములు చేయుటకు లేదేమి? వారు రాకపోవడముచేత నీయిల్లంతా చిన్నబోయినది. కొండగబ్బిలములవలె నీచూరులు పట్టుకువాళ్ళంత వ్రేలాడుచుండెడివారు

రంభ—నాయిల్లు చిన్నబోయినమాట నిజమేకాని యేటువంటివారు రాకపోవుటకు ముఖ్యకారణము చెపుతాను విను. భూలోకములో బ్రాహ్మణులు క్రొత్తపద్ధతిగా యజ్ఞము లారంభించినారు. ఆయజ్ఞములకు నల్లమేకలే కావలెనను నియమములేదు. ఏమేకలయినానరే పనికివచ్చును.

మేనక—నల్లమేకలు కాకపోతే శాస్త్రదూష్యములు కావా?

రంభ—వారిశాస్త్రప్రకారము దూష్యములు కావు.

మేనక—వారికేమైనా క్రొత్తశాస్త్రములున్నవా యేమిటి?

రంభ—లేకేమి? ఇప్పుడిప్పుడు బయలుదేరుచున్న క్రొత్తశాస్త్రముల నన్నిటిని జదివి యీక్రొత్తయజ్ఞము లారంభించినారు.

మేనక—ఆశాస్త్రములేమిటో నాకు కొంచెము చెప్పు వినవల యునని కుతూహలముగున్నది.

రంభ—అదే చెప్పుచున్నాను. తొందరపడకవిను ఈక్రొత్త యజ్ఞములకు యజ్ఞశాల లవసరములేదు. కసాయిదుకాణములే యజ్ఞశాలలు. యజ్ఞములు జరిగిన నాలుగురోజులలో రోజుకొక్క మేక చచ్చునో లేదో, ఈకసాయి దుకాణములనే యజ్ఞశాలలలో రోజు నూర్లకొలది మేకలు చచ్చును. ఈమేకలను కుమ్మరవాండ్రువచ్చి నవరంధ్రములు మూసి చంపనక్కరలేదు. కత్తిదెబ్బతో నొక్కయేటున బుఱ్ఱ తెగిపడిపోవును. ఆమేకలమాంసమే భూలోకములో ననేక బ్రాహ్మణులు నేతితో వేయించి హోమము చేయుచున్నారు.

మేనక—ఆ హోమములచేత నగ్నిహోత్రుడు ప్రీతుడగుచున్నాడా.

రంభ—అక్కడ ప్రీతుడగు నగ్నిహోత్రుండు వేరు. ఆతడు జఠరాగ్నిహోత్రుడు. కలియుగ బ్రాహ్మణులయొక్క గర్భగోళములనే హోమకుండములలో జఠరాగ్ని ప్రజ్వరిల్లుచున్నది ఆయగ్నిలోనె మేకలన్నియు హోమమగుచున్నవి. యజ్ఞములలో మేకలవప మాత్రమే హోమముచేయుదురు. ఇక్కడవపయొక్కటేకాదు గుండెలుమెదడు సమస్తము నీజఠరాగ్నిలో హోమమై పోవుచున్నది. ఈకసాయి దుకాణములేకావు యజ్ఞశాలలు బ్రాందీషాపులుగూడ యజ్ఞశాలలే యని చెప్పవచ్చును. రైలు స్టేషనులో నుండే రిఫ్రెషుమెంటు రూములుగూడ యజ్ఞశాలలె యని చెప్పవచ్చును. సాయంకాలమప్పుడు శరీరమాద్యంఖలు ధర్మసాధన మ్మను సిద్ధాంతమెరిగిన బుద్ధిమంతులందరు శరీరములు కాపాడుకొనుటకు బూర్వులుచేసిన యజ్ఞము లేదో విధముగ తమవంశమున నిలుపుటకు సాయంకాలము కాగానే ఆషాపులకు ఆరిఫ్రషుమెంటు రూములకు వెళ్ళి యథావిధిగా కర్మచేయుచుందురు.

మేనక—ఈయజ్ఞము మిక్కిలి చిత్రముగా నున్నదే. ఈయజ్ఞము సాయంకాలమే చేయవలెనాయేమి?

రంభ—ఉదయకర్మలు గూడ కొన్నియున్నవి. కాని యీకర్మ విశేషముగా సాయంకాలమప్పుడే జరుగుచుండును. ఈ యపూర్వ కర్మిష్టులందరు పగలంతా యేవోకొన్ని వ్యాపారములు చేసికొని సాయం కాలము తీరుబడిగా బండ్లమీద షికారువెళ్ళి యీకర్మ చేయుచుందురు. ఈకర్మ కొక్కనియమముమాత్ర మున్నది. సాధారణముగా సూర్యు డస్తమిస్తేనేకాని యీకర్మ చేయరు.

మేనక—వీరికి సోమపానముచేసే అలవాటున్నదా? యజ్ఞకర్మలో నదియొక ముఖ్యభాగముకదా.

రంభ—అయ్యో మేనకా! చేయకేమి? పానములేనిదె కర్మ లేదు సోమపానము జేయకపోయిన మానె సురాపానము జేయుదురు. పూర్వమహర్షులు యజ్ఞములు చేయునపుడు నానావస్థలుబడి యొక్క సోమపానమె చేసేవారు ఈ కలియుగ బ్రాహ్మణులచేసే యజ్ఞములలోనో క్రొత్తకొత్తపానము లనేకములు. సురాపాన మప్పుడప్పుడు జరుగు చుండును. దానికేమి అది దేశవాళీసరుకు. ఇవి స్వదేశీదినము లని నీ వెరుగుదువుకదా! స్వదేశీ యభిమానముగల దీక్షితులు సురాపానమె చేయుదురు. పూర్వ మీసురలోనుంచి తీసిన సారాయి త్రాగేవారు ఇప్పుడు క్రొత్తగా రమ్ము అను సారా బయలుదేరినది. ఇది సాయంకా లము కాగానే ప్రతివానిని రమ్మురమ్మని తనయొద్దకు పిలుచుచుండును. నందువలన దానికే పేరు వచ్చినట్లు తోచుచున్నది. అదిగాక బ్రాంది పానము, విస్కీపానము, ఓల్డుటముపానము మున్నగున వనేకములు కలవు. దేవతలు, మహర్షులు, వాళ్ళజన్మమెత్తి యిటువంటివి వెరుగరు.

మేనక—ఈయజ్ఞములలో సోమదేవమ్మలుందురా.

రంభ—సోమిదేవమ్మలు వెంటనుండరు. సోమయాజులవా రొక్కరే యీయజ్ఞముచేసి యాపానము చేయుదురు. అప్పుడప్పుడు సోమిదేవమ్మలు కూడా నుండవచ్చును. వారు స్వభార్యలుగాక యుంపుడుకత్తెలై యుందురు.

మేనక—అయితే అక్కా! యీ యజ్ఞములు చేసినవారికి రంభాసంభోగముండునా లేదా?

రంభ—అయ్యో వెర్రిదానా ఏనాడో క్షీర సాగర మథనమందు పుట్టి యౌవనమంతా తీరిపోయిన పాతరంభ వాళ్ళకెందుకే ఈరంభ కావలసినవారు యజ్ఞమారంభించి స్వభార్యతో గలిసి నాలుగు దినములు మాడి హోమకుండములదగ్గిర కూర్చుండి కన్నులనిండా పొగదూరి చచ్చి చెడి చేయంగల విన్నపము లనుభవింపవలెను. ఈ శ్రౌతయజ్ఞములు చేసినవారికి భూలోకములోనె బ్రతికియుండగానె యువపానము లక్కర లేకుండానె ఒక రంభగాకుండా కావలసినంతమంది రంభలు దొరుకుచున్నారు.

మేనక—అక్కా! యజ్ఞములమాట నేనడుగగా నీవు త్రాగుబోతులై మాంసము దిని భ్రష్టులైన బ్రాహ్మణులమాట చెప్పినావు.

రంభ—నీవిప్పటికి గ్రహించినావా? కలియుగ బ్రాహ్మణు లందరు నటువంటివారని మాత్రమనుకోకు ఈయజ్ఞములన్న సిగ్గము లేనివారనేకు లున్నారు నారదుడు మిక్కిలి చమత్కారి గనుక నీ ప్రకారము చమత్కరించినాడు. రా రా పోదము.

(ఇద్దరు నిష్క్రమింతురు)

## గయ్యాళిగంప

### రంగము 1

[అప్పుడు బ్రాహ్మణుడు ప్రవేశించుచున్నాడు.]

బ్రాహ్మ—(తనలో) అబ్బబ్బా! ఇది పెండ్లామునుగాదు, నాపాలిటి పెనుభూతము. ఎప్పుడు పుస్తెముడివేసితినో అప్పుడే నాకు శనిగాడు ప్రవేశించినాడు ఎవడో నామీద కోపముచేతను భార్య అను పేరుపెట్టి బ్రహ్మరాక్షసిని ప్రయోగించేసినాడు. ఇది తిండికి ఏనుగు, పనికి పీనుగు చెప్పినమాట వినదు తనకుతోచిన పనేగాని చేయదు. వీరున్నారు వారున్నారు అను సందేహములేకుండా, యీమాట అనవచ్చును ఆమాట అనకూడదు అని వడుకు బెదురు లేకుండ యెంత మాట నోటికివస్తే అంతమాట పెడేల్మని అనివేస్తుంది. ఏనాటికైన బాగుపడుతుందేమో అని యెన్నివిధాల చూచినా నానాటికి తీసికట్టు నాగంభట్టు అన్నట్లు అంతకంతకు పాడగుతున్నదిగాని బాగుపడడం లేదు ఈదిక్కుమాలిన సంసారం వదలిపెట్టి, 'జేపరమేశ' అని యింటిమీద ఒకదెబ్బవేసి లేచిపోదామనుకుంటే పెద్దవాడను నలుమందిముందా కొడుకును, ఉపచారములు జరుగవని భయము. ఏకేకలేసియో యేతిట్లు తిట్టియో, యేమూడు జాములకో ముచ్చపొద్దుకో, దానిధర్మమా అంటు యింతగంజి కాచి పోస్తుంది. ఈగంజికాశపడి, చూచి చూచి కొంప వొదలిపెట్టి వెళ్ళలేకుండా వున్నాను. ఈమధ్య దీనికి క్రొత్తతెగులుకూడా పుట్టింది, నేనన్నమాటకు యిది వ్యతిరేకంచేయడ మారంభించింది. నేనన్నము తిందామంటే తాను వద్దంటుంది. నేను వద్దంటె తాను కావాలంటుంది. నేను కుక్కంటె తాను గోవ్వంటుంది. నేను గోవంటె తాను కుక్కంటుంది. ఈయుండతో వేగడమేలాగో నాకు తెలియకుండా వున్నది. రేపు దశమి! మాతండ్రిగారి ఆబ్దికము ఏదిచేయుకపోయినా విడువకుండా యేటేటా తండ్రితద్దినము పెడుతున్నాను. ఈయేడు అది కూడా సాగేటట్టులేదు. తద్దినం పెడ్తానంటె యిది వొద్దంటుంది చూచి

చూచి అబ్బతద్దిన మొట్టామానుకోను ? మానుకోక మరొకచోట పెట్టు కుందామన్నా యీముండ అక్కడికివచ్చి వంటపాలడిచేస్తుంది శ్రాద్ధం చెడిపోయినతర్వాత దీన్ని కొడ్తే యేమికార్యము ? తిడితే ఏమికార్యము ? దీన్ని లొంగదీసుకొనే వుపాయము ఆలోచించవలె. ఆహా! తోచిందుపాయము. ఆవుపాయప్రకారమే చేస్తాను. సాగించా ఆవుపాయము అదృష్టవంతుణ్ణి. సాగకపోతే మానుకోవడం వుండనేవుంది.

భార్య—ఏమిటండో ఆలోచిస్తున్నారు.

బ్రాహ్మ—ఏమిలేదు. రేపు దశమి మాతండ్రి తిథిప్రయోజనము. నేనిది మానివేస్తామని ఆలోచిస్తున్నాను. పెద్దలు తిని యేడ్చారా యేమైనా ?

భార్య—అయ్యయ్యో ఇదేంమాటండి. తండ్రితద్దినం మానుకునేవారెవరైన వున్నారా ? ఇంత విరుద్ధ మెక్కడాలేదు. పెట్టకపోతే కులంలో వెలివేస్తారు. గనుక తద్దినం పెట్టితీరవలె.

బ్రాహ్మ—(తనలో) నేనే తద్దినం పెట్టవలెనంటే యీగయ్యాళి ముండ పెట్టవద్దని వాదించును, నేను వద్దంటున్నాను. గనుక తాను పెట్టవలెనని వాదన చేస్తున్నది. నావుపాయము బాగా పాటినది. ఇది నాగోపీలో పడినది ఈటున్నాగా మాట్లాడుతుండవలె. (ప్రకాశముగా) ఈతద్దినము యీమాటు నేను పెట్టేదేలేదు.

భార్య—పెట్టకపోయినట్టయితే కొంప నిప్పెట్టి లేచిపోతాను.

బ్రాహ్మ—సరే! అలాగయితే నీయిష్టమువచ్చినట్టె చేస్తాను. కాని నేను బ్రాహ్మణులను పిలవను, శూద్రవాళ్ళిద్దరిని పిలిచి శ్రాద్ధం పెట్టివేస్తాను.

భార్య—దీక్షితులుగారి కుమాళ్ళయి శూద్రవాళ్ళను భోక్తలుగా తీసుకరావడం. ఛ, ఛ, మీకింత దుర్బుద్ధులు పుట్టినాయేమి? మీకేదన్న పిశాచం పట్టిందాయేమిటి ? పరిశుభ్రమైన బ్రాహ్మణులను నేను పిలుస్తాను. వాళ్ళకే మీరు పెట్టవలె.

బ్రాహ్మ—వాళ్ళకే పెట్టడం నాకిష్టంలేదుగాని నీబలవంతంచేత

పెడ్తాను. కాని నాకు మంత్ర మక్కరలేదు. మంత్రబ్రాహ్మణులను పిలవను. నేను బ్రాహ్మణులతోకూడాకలసి భోజనంచేస్తాను. మంత్రం తంత్రం అయితే ప్రొద్దుపోతుంది. నల్లమందువాణ్ణి అగుటచేత నేను ప్రొద్దుపోయినదాక వుండలేను.

భార్య—మంత్రంలేని శ్రాద్ధం శ్రాద్ధంకానేకాదు అట్లతద్ది భోజనంలాగ కలిసి తినవలెనని వుందాయేమిటి? మంత్రంతోనే పెట్టి తీరవలె. మూడుజాములు అయిందాక వుండవలె. ప్రొద్దుపోతేకాని పితళ్ళురారు.

బ్రాహ్మ—నాచేతులో యిప్పుడేమి డబ్బులేదు తద్దినమంటె యేలాగైనా ఒక్కవరహా కాకమానదు. అందుచేత నేను మినుములు, బెల్లం, పాలు, నూనె తీసుకునిరాలేనుగనుక పిండివంట చేయవద్దు పప్పుఅన్నంబెట్టి బ్రాహ్మణులను లేవదీతాము. అదిగాక బ్రాహ్మణులకు బట్టలు పాతలు యివ్వలేను. చెరిఒకఅర్ధణా చేతిలోబెట్టి బ్రాహ్మణులను సాగదోల్తాను ఇదివరకు వెనుకటితద్దినాలకు చుట్టాలను నలుగురిని భోజనాలకు పిలిచేవాణ్ణి ఈపర్యాయము యెవరినిగాని పిలవద్దు ఇద్దరుబ్రాహ్మలు నీవు నేను తప్ప మరెవరు అక్కరలేదు.

భార్య—డబ్బులేకపోతె నామెడలో పట్టెడ తాకట్టుపెట్టి నాలుగురూపాయలు యిపుడేతెస్తాను. శుభ్రంగా నాలుగుకూరలు నాలుగుపచ్చళ్లు, పప్పు చారు, అరిసెలు, గారెలు, క్షీరాన్నం చేస్తే తద్దినం పెట్టవలెను. చంటిముండాకొడుకుకు వేసినట్లు యింత గుంట పులగం వేస్తారాయేమిటి, మామగారికి నాకంఠంలో ప్రాణమున్ననాళ్ళుఅటువంటి పాడుపని నేను చెయ్యనివ్వను. భోక్తలకు బట్టలివ్వనంటా వేమి? ఇందులో సొమ్ము కూడదీస్తారామీరు? మీనాయన బ్రతికివుంటేయేటా నాలుగు ధోవతులు నాలుగు వుత్తర్యాలు యిస్తారా యివ్వరా? ఆయన చచ్చిపోయినాడు గనుక అడగడానికినోరులేదుగనుక

బట్టలు మాని వేస్తారు ? రెండు స్నైమగుడ్డలకు మొఖం జూచుకుంటేనే యేమంటారు అందుకని తప్పకుండా బట్టలు తెప్పిస్తాను చుట్టాలు నలుగురిని మునుపుపిలిచి యిపుడు పిలువకపోతేబాగుండదు. యీకూడానికొక మాటు గాని రోజూరారుగదా వాళ్ళు చుట్టాలురానిది కార్యానికి శోభలేదు. వాళ్ళు వచ్చితీరాలె.

బ్రాహ్మ—సరే నీయిష్టమువచ్చినట్టు చేయి ఆలాగయితే. (తనలో) దీనికి పూర్తిగా తిక్కయెక్కించినాను. మాతండ్రి అదృష్ట వంతుడు ఈసంవత్సరము శ్రాద్ధముయధావిధిగ జరుగుతుంది. దైవము నానోట యీలాగున పలికించబట్టి మాటనక్కింది.

(ఇద్దరు వెళ్లుచున్నారు)

## ౩ రంగము

బ్రాహ్మణుడు, భార్య ప్రవేశించుచున్నారు.

బ్రాహ్మ—ఒసే ఒసే బ్రాహ్మణులు లేచారు. అసీ మాంతమై పోయింది. ఇక పారణం విసర్జించవలె. నేను గోదావరికి వెళ్ళలేను ఈ పారణం మనగోవుకు పెట్టివేస్తాను.

భార్య—(కోపముతో) గోవును దీసుకొనివెళ్ళి గోదావరిలో పూరదొక్కండి. ఈపారణం నేను గోవుకు గీవుకు పెట్టేదాన్నికాను. అదిగో ఆకుక్కకు పెట్టేస్తాను. అడ్డమువచ్చారంటె గరిటేకాలవేసి వాత లెడ్తాను. లేకపోతే రోకలితో కుమ్మివేస్తాను జాగ్రత !

బ్రాహ్మ—అయ్యో ! అయ్యో ! కుక్కకు పెట్టకూడదే పెట్ట కూడదేపాపమే నిష్కారణం తద్దినం జెడిపోతుందే. వరహాసొమ్ము వ్యర్థమై పోతుందే. నీపుణ్యమే. పూరుకోవే (అని మొత్తుకొనుచున్నాడు.)

భార్య—మొత్తుకోండి. నాలుక పీక్కోండి, చావండి నేను కుక్కకు పెట్టకమానను. (అని పెట్టుచున్నది.)

బ్రాహ్మ—నారాయణ, నారాయణ, యెంతపాపమెంతపాపము మా పితాళ్ళు అధోలోకంపాలై పోతున్నారు. యీ ముండమూలాన అన్ని మాటలు నేను వ్యతిరేకంగా జెప్పి, యీఒక్కమాట బుద్ధిపొరబాటుచేత సరిగా చెప్పాను అదే నాబుద్ధితక్కువ. నే నేనెకుక్కకు పెట్టుమంటే యీముండాకూతురు గోవుకు తప్పకుండా పెట్టితీరును. నాప్రారబ్ధంచాలక ఆమాటలకు బదులు నోటివెంబడి యీమాట వచ్చింది. చేసుకున్న దనుభవింపక తప్పను. ఓదిక్కుమాలినముండ నీయమ్మ కడుపుకాల నాయింటిలోనుంచి లేచిపోవేనీవు.

భార్య—ఇది మీయిల్లుగాదు నాయిల్లు. మీరే లేచిపోండి.

బ్రాహ్మ—ఛీ నోరుమూయిముండా!

భార్య—మీరుండగ నేను ముండనుకాను. మాట దక్కించుకొని ఆగుక్కెడు ప్రాణము వదలివేస్తారా నేను ముండనవుతాను. మీయమ్మముండ, మీయక్కముండ, మీచెల్లెలుముండ, మీవాళ్ళందరు ముండలు.

బ్రాహ్మ—నేనెందులోనైనా దిగి చస్తాను నీతో వస్తాను.

భార్య—నాపీడపోతుంది. ఈలాంటి పాపిష్టిమొగుడు వుండేకన్న పోతేనే మంచిది.

బ్రాహ్మ—ఛీ! నీమొఖం చూడకూడదు. లేచిపోతున్నాను. (అని వెళ్ళుచున్నాడు.)

భార్య—వెళ్ళండి! దీపాలవేళకు యిల్లువెతుక్కుంటూ మీరే వచ్చినట్లు మళ్ళీవస్తారు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

## సంతుష్టి

(కామరాజు సోమరాజు ప్రవేశించుచున్నారు.)

కామ—సోమరాజు నీకింటిదగ్గిర కూర్చుంటే యేలా తోస్తుం దోయి! సాయంకాలమప్పుడు టవున్ హాలుకైనా రావేమి?

సోమ—కామరాజు! నీవు చెడిపోయినావు సరె! మేముకూడా చెడిపోవాలనా? ఎందుకు టవున్ హాలుకు? మాయింటిదగ్గర కూర్చో నేందుకు స్థలం లేదా? నాతో మాట్లాడేందుకు? మనుష్యులు లేరా?

కామ—మనుష్యులులేకనా నిన్ను రమ్మన్నది స్థలంలేకనా? అక్కడికివస్తే పేపర్లు చదువుకోవచ్చును.

సోమ—ఎందుకు? ఎందుకుపేపర్లుచదవడం? ఏముంది పేపరులో? వాడు వంగుని వంకాయ తిన్నాడు. వీడు కూర్చుని గుమ్మిడికాయ తిన్నాడు మజ్జిగుండపాలెందో మనిషికి మూడు కోతులు పుట్టినవి కొక్కిరిగడ్డ కోకిలమ్మకు ఆవుదూడలు పుట్టినవి అని నాలుగు కల్లబొల్లి మాటలుండడమేగాని పత్రికలో నేముంటవి?

కామ—(నవ్వుచు) ఇంతేనా పత్రికలలో నుండేది? పత్రికలసారం బాగాగ్రహించినావు! పత్రికల వుపయోగమంతె నిన్నడుగవలెన్వచ్చి.

సోమ—ఓస్! నేనంత మూర్ఖుడనుగాబోలు నీవు గొప్పనాగరకు డవు బయలు దేరినావు పత్రికలసారం గ్రహించేందుకు ప్రతికలోకసా రలవాళ్లైతే నల్లమందులాగ పట్టుకొంటవి. నల్లమందువానికి వేళకు మందందకపోతే కాళ్లీట్లుపీకునో పత్రికలవానికి ఆవేళకు పత్రికందక

పోతే కాళ్ళులాపీక్కుపోతాయి. అందుచేత ఆదురభ్యాసం నేను చేసుకో లేదు. పత్రికలు చదివి నీవుపడిన బాగేమిటో చెప్పు! నేను చదవక పాడై పోతానా! కృష్ణా అనుకోవడమా? రామా అనుకోవడమా?

కాము—బాగుపడడానికి ఓగుపడడానికి ఇందులో ఏమున్నది? కావలసినంత యుద్ధం జరుగుచున్నది. చీనాలో ఆయుద్ధవార్తలు తెలుసుకోవడమే ప్రధానము. అది తెలియడమే లాభము.

సోము—ఏమి! తెలియకపోతే సూర్యు డుదయించడా? చంద్రుడస్తమించడా? భూమి తిరుగదా? ఆకలికాదా? నిద్రపట్టదా?

కాము—పేపరు చదవకపోయినా సూర్యు డుదయిస్తాడు ఆకలవుతుంది నిద్రపడుతుంది. గాని, మహాయుద్ధం జరుగుతుంటే ఆ సంగతులు తెలుసుకోవాలని నీకు ఆసక్తిలేకపోవడంచూస్తే నాకు మిక్కిలి ఆశ్చర్యముగా యున్నది. నీవు గొప్ప వేదాంతివి. లాభముంటేగాని అందులో చొరబడవు.

సోము—వేదాంతమో గీదాంతమో నాకు తెలియదు. యుద్ధముజరిగితేనాకేమి? గిద్ధముజరిగితే నాకేమి? ఎవళ్ళుపోతేనాకేమి? నేను బాగుంటేచాలు.

కాము—అయితే మీరీసంవత్సరము కాంగ్రెసుసభకు రారా?

సోము—ఎందుకు కాంగ్రెసుసభకు? యాభైయో నలభైయో దండుక్కా? కాంగ్రెస్ అంటె నాకు తెలియకా? మామూలుమీటింగు కన్న పదిమంది ఎక్కువుంటారు తక్కినమీటింగులలో లోపలికి వూరక వెళ్ళనిస్తే యిందులో 10 రూ॥ టిక్కెట్టులు పుచ్చుకుంటారు. వుత్తమీటింగులలో యిద్దరుముగ్గురు మాట్లాడితే యిందులో 40, 50 మంది మాట్లాడుదురు. వుత్తమీటింగు వూళ్ళోవాళ్ళుచేస్తే యీ మీటింగుకు పైవాళ్లువస్తారు. అరవవాడు, కన్నడవువాడు, మరాటి

వాడు, గుజరాతివాడు, బంగాళీవాడు అందరుచేరుతారు. వింతవింత కట్లు చిత్రచిత్రవుబొట్లు, తమాషాతమాషాజుట్లు కనుపడతాయి. కాంగ్రెసుభాగవతమంటే యింతేనా? వెళ్ళకుండా కాంగ్రెసంటే ఏమిటో నేను వూహించుకో గలను.

కామ—నీవు మహాగొప్పవాడవయ్యా! అంతామనోభావము తోనే వెళ్లుతున్నది. చెన్నపట్నం చూడరా మీరు?

సోమ—చెన్నపట్నం నేనెరుగనా? చూచేదేమిటి?

కామ—అయితే మీరు చూచినారాయేమి యిదివరకే.

సోమ—చూచేదేమిటి? చూడకుండానే యెరుగుదును నేను. మనవూరికంటె మరొకపదిళ్ళెక్కువుంటాయి మరొకపదిమకాణాలుంటాయి. లొడలొడలొడమంటూ మంగలంలో రాళ్ళువోసి వేయించినట్లు అరవగొడవ మాట్లాడుతుంటారు. మనవూర్లో గోదావరుంటే ఆవూర్లో సముద్రముంటుంది. ఇక్కడ రాధారీపడవలకుమారుగా అక్కడ నావ లుంటాయి మనవొంటెద్దుబండ్లకు బదులుగా అక్కడ ట్రాంబండియేదో వుంటుందట! పాకీవాళ్ళుబాగుచేసే గొట్టాల్లోనుంచి నీళ్ళొస్తాయి అక్కడకాదాఅంటె మరొకపది గుఱ్ఱంబండ్లు, మోటారుబండ్లు, తొక్కుడుబండ్లుంటవి. ఈమాత్రమూహించుకోలేనానేను.

రామ—వహవ్వా! మెచ్చవచ్చునయ్యా నీసంతుష్టి, నీవైరాగ్యము నీకు ప్రపంచములో ఏదీచూడాలనిలేదు.

సోమ—ఇదిచూస్తే యింకొకటి చూడాలని బుద్ధివుంటుంది, ఏదీచూడకపోతే నయం.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు)

---

## పౌరుష మహాసభ

రాక్షసనామ సంవత్సర జ్యేష్ఠ బహుళ అమావాస్యకొత్తమంగళవారమునాడు రాత్రి 1½ గంటలకు మొదలు 2 గంటలవరకు యిసుకతిప్పమీద జరిగిన పుర మహాజన సభయొక్క తీరుమానములు. ఆ సమయమున పిడిగుద్దుల భేతాళరావుగారు అగ్రాసనాధిపత్యము వహించిరి. అప్పుడు బెత్తాల భీమశంకరం పంతులుగారు యీక్రింది తీర్మానము ఉపపాదించిరి.

## తీరుమానము

మన పట్టణమందున్న పాఠశాల లన్నిటిలోను ఉపాధ్యాయులు కేవలము జీతములకొరకు గాక బాలురను బాగుచేయవలెనను లోకోపకార బుద్ధితో పని చేయునట్టి మహానీయులగుటచే వారు యేపిల్లవానిని గాని బెత్తముతో గాని వెదురు బద్దతో గాని, యీత జువ్వలతో గాని, మ్యావు కిఱ్ఱలతో గాని, చేతికఱ్ఱలతో గాని, వారికవసరమనితోచినప్పుడు నెత్తిమీదగాని, మొగముమీదగాని, వీపుమీదగాని, చేతులమీదగాని, పిఱ్ఱమీదగాని, కాళ్ళమీదగాని, పొట్టమీదగాని, పొద్దున్నగాని, సాయంకాలముగాని, మధ్యాహ్నముగాని, చొక్కాలుకోట్లు విప్పించిగాని వుంచిగాని, పదిగాని, యిరువై గాని ముప్పైగాని, నూరుగాని, అవసరమని తోచినపక్షమున ఇంకాయెక్కువగాని కొట్టవచ్చుననియు, అట్లు కొట్టునప్పుడు నెత్తురు పగిరా వచ్చునప్పటికీ డాక్టర్లు డ్రెస్సర్లు వారికిగాని, వారి తలిదండ్రులకుగాని, వారి బంధువులకుగాని, సర్టిఫికేట్లు యివ్వకూడదనియు దెబ్బలుతిన్న పిల్లల తల్లిదండ్రులుగాని, సంరక్షకులుగాని, తెలివితక్కువచేతగాని, పెంకెతనముచేతగాని, దుర్మార్గుల ప్రోత్సాహముచేత గాని చార్జీలిచ్చుటకు మేజస్ట్రీటు కోర్టులకు

వెళ్ళినప్పుడు బెంచిమేజస్ట్రీటుగాని, తాలూకా మేజస్ట్రీట్లుగాని డిస్ట్రిక్టు మేజస్ట్రీట్లుగాని, చార్జీలు పట్టగూడదనియు, ఉపాధ్యాయులు కొట్టునపుడు ఆ దెబ్బలు తిని చల్లగాపూరనొక యింటిదగ్గరకు వెళ్ళి చెప్పి తల్లిదండ్రులచేత సంరక్షకులచేత అల్లరిగడబిడ రాద్ధాంతము చేయించిన బాలకులను యావత్తు ప్రెసిడెన్సీలోను, యేస్కూలులోను చేర్చుకొనగూడదనియు, అటువంటి బాలకులకు యేడిపార్టుమెంటులోను యుద్యోగము లియ్యకూడదనియు చెన్నపురి గవర్నమెంటువారిదివరకు ప్రచురించిన యుద్యోకేషనలు రూల్సులో హెడ్ మాస్టరులేగాని, క్రింది యుపాధ్యాయులు కొట్టకూడదని వ్రాసినభాగములు గద్దుచేయించి ప్రతియుపాధ్యాయుడు చిన్న నేరమైననుసరే పెద్దనేరమైననుసరే ఇష్టము వచ్చినట్లు కొట్టుట కధికారముండవలసిన దనియు, గవర్నమెంటు వారొక చట్టము నిర్మింపవలసినదని యీసభ వారి యభిప్రాయము.

మహాజనులారా ! ఇప్పుడు నేను చదివిన తీరుమానమును ఉపపాదించవలసినదని మహా జనులందరు నన్ను గౌరవించినందున నేను అటువంటి గౌరవమునకు తగకపోయినప్పటికి యీమహాభారము నిర్వహించుటకు నాకంటె సమర్థులగు మహాజనులు వేనవేలున్నప్పటికి నేటివిషయము మనపట్టణముయొక్క జిల్లాయొక్క ప్రెసిడెన్సీయొక్క బాలుర క్షేమముతో గూడిన పని యాటచేత నేను దానిని తప్పక నిర్వహింప బూనుకొన్నాడను. లోకమునకు ఉపకారము చేయవలెననే ఆతుర్దాతో నేనేమైనా తొందరమాటలన్న పక్షమున అవన్ని మీరు క్షమింపవలెను, మన గ్రామములో యిదివర కెన్నడూలేని క్రొత్తవింతలు పుట్టుచున్నవి చదువుకొనే పిల్లవాళ్ళను కొట్టకూడదని కొందరు దౌర్భాగ్యులు వేలు తూవున్నట్లు మీలో చాలామందికి తెలియవచ్చినది “ బెత్తము

దాచినావో పిల్లవాడిని పాడుచేసినావో” అని అర్థ మిచ్చుసామెత యింగ్లీషుభాషలో నున్నది ఈనిర్భాగ్యపు తల్లిదండ్రులా మెత లెప్పుడు వినలేదా? దెబ్బదేవేంద్రలోకమను సామెత మన తెనుగులో నున్నది అదైన వారు వినలేదు కాబోలు! వాళ్ళ చెవులలో జిల్లేళ్ళుచెట్లుమొలిచినవి కాబోలు! కొట్టకబోతే పిల్లవాడు బాగుపడతాడా? మేము చదువుకొనేటప్పుడు మాపంతులుగారు నన్ను చీమల చింతకు కట్టించి చింతబరికెతో నెత్తురుచుక్కలు కారేటట్లుగా కొట్టేవారు ఆలాగున దెబ్బలుతిని కష్టపడి చదువుకోబట్టే నాలుగు ముక్కలు నాకంటాయి లేకపోతే ముష్టెత్తుక పోవలసిందే. అటువంటి గురువులేనప్పుడు చదువు లేనప్పుడు పట్టిపాడురోజులు వచ్చికూర్చున్నవి ఒకమొట్టికాయ వేసినా కొంత తొడపాశెంబెట్టినా కొడుకును వెనుకవేసుకొని వచ్చి ప్రతిచాకలి ప్రతిమంగళ ప్రతినీళ్ళకావిళ్లాయన పైఅధికారులకు తెలియచేస్తానని చార్జీయిస్తానని బెదరించడమే కదా! ఈతీరుమానం ప్రకారం గవర్నమెంటువారు కరుణించి అటువంటి చట్టమును నిర్మించినట్లయితే యీచచ్చుపీనుగుల నోళ్ళు అణిగిపోతాయి తలుచుకుంటే నాకు వళ్ళు మండిపోతుంది. వీళ్ళమ్మకడుపు గాల! కొట్టకుంటే వొక్కముక్కొస్తుందా యీబండ కుంకలకుచదువంటే పప్పుదప్పళాలు కొట్టడమా, అసలుబడి పంతులంటే కూర్చున్న గుడ్డిముండ లేవదీ తాలూకాబంట్రోతుకన్నా గౌరవముందిగాని మాకులేదు. అటువంటి యవస్థలో యీ బెదిరింపులు కూడానా? ఈచట్టము నిర్మించకపోతే మేమంతా గంగా ప్రవేశము కావలసినదే. చదువులు చట్టుబండవులతాయి. వొకడికీ వొక ముక్క రాదు. మీపిల్లవాళ్ళ బాగు మీరు కోరితే యీతీరుమానము మీరు వొప్పుకోండి.

భేతాళరావు—సభాసదులారా! మనబెత్తాల భీమశంకరంగారు తూము కాలువలో నీళ్ళులాగ దొడదొడదొడ యిప్పుడు చేసిన యుప

న్యాసము మీరందరూ విన్నారుగదా! ఈతీరుమానమును మొట్టికాయల మోహనరావుగారు బ్రధుపరుతురు. కాబట్టి మీరు శ్రద్ధగవినండి! (సభ్యులు చప్పటలు గొట్టుచున్నారు)

మోహనరావు—సభాజనులారా! ఇప్పుడు భీమశంకరంగారు ప్రతిపాదించిన తీరుమానమును నేను బ్రధుపరుచుచున్నాను. పిల్లలను కొట్టక పోతే చదువులు రావన్నమాట మీకందరకు తెలియదా? చిన్నప్పుడు మాపంతులుగారు నన్ను మొట్టికాయలు మొట్టేవారు ఒకొక్కప్పుడు మొట్టుకు సోలడేసినూనె నెత్తిని యిసికేది. కోదండాలు తీశాము గోడకు ర్చీలు వేశాము వీపుమీద మూటలు పెట్టించుకొన్నాము. మాపంతులుగారు విశేషించి కళ్ళలో మిరపకాయపొడుము వేసేవారు మేమెంతో దయావంతులమగుటచేత అటువంటి పనులు చేయడంలేదు. చేయక పోయినప్పటికిని మమ్మలిని అడ్డమైన కూతలు కూస్తోన్నారట! వాళ్ళ వాళ్ళు. పిల్లవాళ్ళాడిందాట పాడిందిపాట చేసినట్టయితే గాడిదలనుకొనుటకైనా పనికిరారు. అందుచేత మేష్టరుకు కొట్టుట కధికార మియ్యవలసినదనిచెప్పే యీతీరుమానమును మీరందరు అంగీకరించవలసినదని నాయభిప్రాయము.

(అని కూర్చుండును)

(అప్పుడు తోడపాళాల దుర్గప్రసాదరావుగారు లేచుచున్నారు)

దుర్గ—అయ్యా! ఈతీరుమానమునకు నేనొక యెమెండుమెంట ప్రపోజుచేస్తాను అనగా ఒక సవరణచేస్తాను.

భేతాళ—ఏమిటాసవరణ త్వరగా చెప్పండి పొద్దుపోతుంది.

దుర్గ—ఇదిగో చెవుతున్నానండీ అమగున గంటములు పాతి లాటాకులమంటవేసి వీపుమీద చింతబరికెలతో బాదుచు కోదండము తీయించినప్పటికి తప్పులేదు అనేమాట లీతీరుమానములో నుండవల

యును. ఇందువిషయమై నేను నాలుగుమాటలు చెప్పుతాను. ఈకాలములో కోదండములు మరిచిపోయినారు. కోదండం తీయించడంకంటె మంచిశిక్ష లిప్పుడు లేవు. వెధవనాగరికత ముదిరి పిల్లలను గారము చేయడము ఆరంభించి కోదండాలు మానివేసి పాడుచేస్తారు, కోదండం వన మరియొకదానికి దేనికీరాదు. అది యీ తీరుమానమంతకు శిఖరము వంటిది. కాబట్టి మీరందరు దీనికంగీకరించవలయును

భేతా—ఇదెవరైనా సెకండుచేసేవారున్నారా?

(చింపకాయల చెల్లయ్యగారులేచి) అయ్యా! ఈ తీరుమానమును నేను సెకండుచేస్తూన్నాను. కారంలేనిదే కూరలకు రుచిరాదు. కోదండం లేనిదే పిల్లలకు చదువురాదు. అడుగున గంటాలుపాతడం తాటాకులమంట వేయడం యెందుకనగా కోదండం తీశేవాడు కాళ్ళు క్రింద పెట్టుకుండాను కోదండమంటూవుంటే ఒక్కపిల్లాడైనా పరీక్షలో ఫేలై పోతాడా గవర్నమెంటువారు తెలివిగలవారయితే తప్పకుండా ఆలాంటిచట్టమే యేర్పరుస్తారు. ఇంతకు మనమహాజరుమీద పదివేల మందియైనా దస్కతుచేయాలి, కొందరు పెంకెతనముచేత దస్కతు చేయనంటారు. వాళ్ళతో యీ మహాజరు నీటిపన్ను తగ్గించడానికిస్తూన్నామని చెప్పండి దానితో చచ్చినట్టు వాళ్ళే చేస్తారు. దస్కతు. ఏలాగో ఒకలాగ సంతకాలుమట్టుకు కావాలి. ఇంతతో నేను విరమించుచున్నాను.

భేతా—సభలో వారందరికీ యీ సవరణ యిష్టమేనా? ఈ సవరణ యిష్టమున్నవారంతా నాలుకలు ముందరకు జాపండి.

మోహా—నాలుకలు జాపడం యేమిటండీ చెయ్యెత్తుతాం.

భేతా—ఒక చెయ్యెత్తమంటే రెండుచేతులెత్తుతారు. నేను చత్వారముముండావాడిని కనబడదు. నాలుకవకటేవుంది కనుక అది చులాగ్గా లెక్కపెట్టవచ్చును.

(అప్పుడందరు నాలుకలు జూపుచున్నారు)

భేతా—అయితే యీ తీరుమానమందరకు యిష్టమన్న మాటే.

సభవారు—అందరకు సమ్మతమే అందరకు సమ్మతమే (అని చప్పట్లు కొట్టుచున్నారు.)

(అప్పుడు చదువుల సాంబయ్యగారు లేచుచున్నారు)

సాంబ—అయ్యా! ఈ తీరుమానవిషయమై మహాజరు తయారు చేయుటకు సంతకములు చేయించుటకు గవర్నమెంటువారికి పంపించుటకు ఈ క్రింది పెద్దమనుష్యులతో నొక యుపసభ యేర్పరచవలసినదని నేనొక తీర్మానమును పెట్టుచున్నాను. అందులో ఈవేళ మాట్లాడినవారందరును ఈతజవ్వల యీశ్వరప్పగారు, రక్కాల రామన్నగారు నేను గిల్లుల కృష్ణయ్యగారు నుండవలయును.

అందరు—సరే సరే తప్పక యుండవలయును. అంగీకారమే.

తిట్లతిరపతయ్యగారు—అయ్యా! ఈసభ జయప్రదముగా జరిపినందుకు అగ్రాసనాధిపతిగారికి, నేననేకవందనము లాచరించుచున్నాను.

అందరు—భళాభళ.

---

## లోకమనుష్యులు

(నరహరి, పురహరి, ప్రవేశించుచున్నారు)

నర—ఏమిటోయి! పురహరి నీలోనీవే నవ్వుకొంటూవస్తున్నావు.

పుర—ఓహో! నరహరా మనుష్యుడు తనలోతానే నవ్వుకోడానికి గొప్పకారణ మేదో వుంటుందంటావా లేదంటావా?

నర—కారణమేదో వుండకపోదు. కారణములేకుండా నవ్వేవాడు పిచ్చివాడు నీవు పిచ్చివాడవు కావుగనుక యేదో బలమైన కారణముంటుందనే అడిగినాను. ఆకారణమేమిటో చెప్పు?

పుర — చెప్పకపోడాని కిందులో యేమీ రహాస్యములేదు. చెప్ప తలచుకొనే వున్నాను.

నర — త్వరగా చెప్పు ఏమిటోవిని సంతోషిస్తాను.

పుర — లోకకోసం తపస్సుచేసే మనుష్యునిచూచాను నేను. అందుకని నాలోనాకే నవ్వొచ్చింది.

నర — (నవ్వి) ఇదేమిచిత్రమయ్యోయి! తోకకోసం తపస్సు చేసే మనుష్య లున్నారా లోకంలో? దిక్కుమాలినతోక మొయ్య లేక చావవలె. ఇంతవింత లోకంలో వుంటుందయ్యా? మీరు నిజం చెప్తున్నారా, లేక వేళాకోళం మాట్లాడుతున్నారా? నాకు రెండూ తెలియడం లేదు.

పుర — నేను వేళాకోళం చెప్పడంలేదు. పరిహాసాలు నాకు పనికిరావు. కడుపులోనున్న దేమిటో స్పష్టంగా చెప్పడమేకాని, అడ్డ దిడ్డం మాటలు నాకురావు.

నర — ఆమహానుభావు డెవడో త్వరగా సెలవియ్యండి! చెవులు పండుగగా వింటాను. ఆయనెవరో త్వరగా కోతులలో కలిసిపోవాలె ననుకున్నాడు గాబోలు.

పుర — కోతుల్లో కలిసిపోవడమేమిటి? పిచ్చివాడవులాగున్నావు మనము కోతులసంతతివారమే కొందరు గొప్ప శాస్త్రవేత్తలు నిర్ణ యించిన సంగతేమీ నీవు వినలేదా? కోతి మనకు ఆదిపురుషుడని వారు తేల్చినారు.

నర — అరె దీనమ్మకడుపుకాలా! చివరకు మనకుకోతా ఆది పురుషుడు. కొండముచ్చులోనుంచి గద్దిరగాడులోనుంచి వచ్చినామూ మనము? గోబ్రాహ్మణేభ్యః అని గోవులోనుంచి మనమువచ్చినామని పెద్దలు చెప్పేవారు. కొందరు విష్ణుమూర్తినోట్లోనుంచి వచ్చినా

మన్నారు. గోవుబోయి, గోవిందుడుబోయి, చివరకుకొండముచ్చెందా మనకు వంశకర్త నాకుసిగ్గువేస్తూంది.

పుర—సిగ్గుపడ వలసిన అవసరంలేదు. ఇప్పుడుకూడామనవారు తోకలు సంపాదించుటకై తెల్లకింకుగా తపసుచేస్తున్నారు.

నర—ఏ దేముడిని గురించి తపస్సు ?

పుర—తెల్ల దేవునిగురించి.

నర—(ఆశ్చర్యముతో) తెల్లదేవుడా? తెల్ల దేవుడెక్కడున్నాడు?

పుర—నల్ల దేవుడెక్కడున్నాడో తెల్ల దేవుడక్కడేవున్నాడు.

నర—నల్ల దేవుడంటే విష్ణుమూర్తి. అతడెక్కడబడితె అక్కడె వున్నాడు. తెల్ల దేవుడంటే యెవరు ? సాంబమూర్తి గారేమిటి ?

పుర—ఏమూర్తిగారో, ఏకమూర్తిగారనుకో! ఆయనగురించి కొందరు తోకనిమిత్తం తపస్సు చేస్తున్నారు.

నర—ఆతపస్సుకు కావలసిన నియమము లేమిటి ?

పుర—బత్తాయినారింజపండ్లు, కమలాఫలాలు, చక్రకేళీఅరటి పండ్లు, అనాసపండ్లు, పంపరపనాసలు, కొబ్బరిబొండములు మొదలైనవి అప్పుడప్పుడా దేముళ్ళకు నైవేద్యము పెట్టవలెను ఆ దేవుళ్ళ తాలూకుమేనే జర్లకుకూడా అప్పుడప్పుడు ఏదైనాయింత హిరణ్యాంపాదనేస్తుండవలెను.

నర—దేవుడు వీరికి ప్రత్యక్షమౌతాడా ?

పుర—పూజారి నాశ్రయించి అతని యనుగ్రహము ముందు సంపాదిస్తే దేవుడు తప్పక ప్రత్యక్షమౌతాడు !

నర—ప్రత్యక్షమై యేమిచేస్తాడు ?

పుర—దేనికోసం తపస్సుచేస్తున్నారో దానినిస్తాడు.

నర—అంటే తోకయిస్తాడని అర్థమా యేమి ?

పుర—తప్పకుండా యిస్తాడు.

నర—ఆయనయిచ్చేది. పొడుగుతోకా పొట్టితోకా ?

పుర—పొట్టితోకలూ వున్నాయి. పొడుగుతోకలూవున్నాయి. దేవుడికిచేసిన సేవనుపట్టి తపస్సునుపట్టిపైగావాళ్ళ అదృష్టంపట్టి కొందరికి పొడుగుతోకలు, కొందరికి పొట్టితోకలు వస్తవి. కొందరికి యెంత తపస్సుచేసినా చిన్నతోకనుకైనారాదు.

నర—ఇందులోకూడ రావడం రాకపోవడంవుందా?

పుర—చేసినతపస్సులకు ఫలమురావడం రాకపోవడం అన్నివిషయములలో నున్నట్టే యిందులోకూడ కలదు.

నర—ఈతోకలవల్ల ప్రయోజనమేమండి?

పుర—అయ్యో! దానిప్రయోజనము నీవెరుగవుగాబోలు, ఎంత ప్రయోజన ముంటేనేగాని, మనుష్యులు పడరానిపాట్లు పడి, చేయరాని సేవలుచేసి, పలుకరానిపలుకులు పలికి, దాటిని సంపాదించుకొందురా?

నర—ఆప్రయోజనమేమిటో కొంచెము చెప్పండి

పుర—తోకగల మనుష్యునికి గౌరవ మెక్కువ జరుగుతుంది.

నర—తోకలేకపోతే గౌరవము జరుగదా?

పుర—జరుగుతుందికాని, తోకవున్నవాళ్ళకే గౌరవం జరుగుతుందని లోకులంతాఅనుకుంటారు. తోకవుంటేవానిపేరు తొంభైఆమడ వ్యాపిస్తుంది.

నర—తోక లేకపోతేమాత్రము వ్యాపించదా? యజ్ఞాలు ధర్మాలుచేసేవాళ్ళపేర్లు తోకలులేకపోయినా తొంభైఆమడ వ్యాపించడంలేదా?

పుర—వ్యాపించవచ్చునుగాని తోకతో వ్యాపించడంసంగతివేరు. తోకలున్నవారిప్రజ్ఞలు నీవువినలేదా? తోకగలహనుమంతుడు సముద్రము అమాంతముగా దాటివేసినాడు. తోకలున్న కోతులన్ని సముద్రమునకు వంతెనకట్టినవి.

నర—తోకలున్నంత మాత్రముచేత గౌరవమువచ్చేటట్టయితే కుక్కలకు, పిల్లులకు, పందికొక్కులకు, పశువులకు గౌరవం రావల సినదేనా?

పుర—సహజంగా పుట్టిన తోకలకంటె తెచ్చిపెట్టుకొన్న తోకలు గొప్పవి. అవి యెక్కువ గౌరవం తెచ్చును.

నర—నీమాటలు నాకు స్పష్టముగా అర్థం కావడములేదు. వాటిపరమార్థ మేమిటో అరటిపండువొలిచి చేతికిచ్చినట్లు చెప్పు?

పుర—తెలియదని ఆలాగడిగితే యిదివరకే చెప్పియుందును. అదుగో మనకెదురుగుండా వొక పెద్దమనిషి వస్తున్నాడు. ఆయ ననుచూడు.

నర—చూచినాను. ఆయన మనగోవిందరావుపంతులు.

పుర—ఆయనపేరు పూర్తిగా నీవు చెప్పడంలేదు. పూర్తి గా చెప్పు.

నర—పూర్తి పేరేమిటి? వారింటిపేరు చెప్పమంటావా? పాలన ముద్రం గోవిందరావుపంతులు.

పుర—అంతేకాదు యింకా కొంతపేరున్నది అదికూడా చెప్ప వలెను.

నర—ఇకేమున్నది? ఆయనకు గవర్నమెంటువారిచ్చిన బిరుదు కూడ చెప్పమంటావా యేమిటి? అయితే రావుసాహేబు పాలనముద్రం గోవిందరావుపంతులు ఈయన ప్రసంగ మెందుకు మనకిపుడు?

పుర—ఈయన తోకగలమనుష్యుడే.

నర—తోకగలమనుష్యుడా? అంటే నాకెంతమాత్రం అర్థంకా లేదు, పెద్దతోకా చిన్నతోకా యీాయనిది?

పుర—వీరభోగ వసంతరాయుడిలాగు ఈయనకు వేపకాయంత తోకయున్నది,

నర—నిజముగా తోకున్నదా? అది పైకి కనపడుతుందా?

పుర—కనుపడకేమి? స్పష్టముగా అందరికి కనుపడుతుంది. ఈ యనకు తోకవచ్చినప్పుడు వచ్చినవార్త పత్రికల్లో పడినది గజెట్టులో పడినది.

నర—అలా అయితే లోకులు ఎవరూ చెప్పుకోలేదేమి?

పుర—చెప్పుకోకేమి? అందరూ చెప్పుకొన్నారు.

నర—రావుసాహేబు బిరుదువచ్చినట్లు చెప్పుకొన్నారుగాని తోకొచ్చి నట్లెవరూ చెప్పుకోలేదు.

పుర—తోకంటే నీకిప్పటికీ అర్థంకాలేదా?

నర—నాకర్థమేకాలేదు స్పష్టముగా చెప్పు?

పుర—రావుసాహేబే తోక.

నర—తోకంటే బిరుదా! సరిసరి, ఇదిచెప్పడానికికా యింత చంపినావు. ద్రావిడప్రాణాయామములాగ తల్లక్రిందుగా త్రిప్పి చంపినావే వీటికోసం తపస్సు చేయుడమేమిటి?

పుర—తపస్సు చేయుడమేమిటా? అధికారిదేవతలను తరుచు వెళ్ళి చూడడం, మంచి మంచిపండ్లు, పంచదారచిలుకలు, మిఠాయిలు వారికి మెహనతుగా పంపుచుండడం వారిగుమ్మములవద్ద ధవాళీలు లేని దలాయతులులాగ నిలిచివుండిసేవలుచేయడం మనస్సులో అష్టాక్షరీమహామంత్రం జపం చేయడం.

నర—అష్టాక్షరీ మహామంత్రమేమిటి?

పుర—"బిరుదులుకావలెను" అనేదే అష్టాక్షరమంత్రం.

నర—బిరుదులుపొందినవారంత రిట్టివారేనా? ధర్మకార్యములు లోకోపకారము చేసినవారికి కూడా బిరుదులు వస్తుంటవే.

పుర—అందరు యిట్టివారుకారు, సత్కార్యములు చేసినవారికి

కూడా బిరుదు లప్పుడప్పుడు వస్తుంటవు వారు వాటికి తగినవారే! అందరూ అటువంటివారు కారు. ఈబిరుదులు పొందినవారిలో అనేకులు తగనివారే వున్నారు. తగినవారికి అవి బిరుదులగును. తగనివారికి తోకలగును.

నర—తోకమనుష్యులంటే యిప్పుడు నాకర్థం తెలిసింది. సరే వెళ్ళుదాము రా!

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు)

---

## ప ర స్ప ర స్తో త్ర స మా జ ము

(గణపతిరావు, కళ్యాణరావు, శంకరరావు ప్రవేశించుచున్నారు)

గణ—కళ్యాణరావుగారు! మన శంకరరావుగారు చెప్పినమాట నిజమే! అన్ని లక్షణములునున్నవి గాని ఐదవతనముతక్కువన్నట్లు మన ముగ్గురికిన్ని అన్ని తెలివితేటలుండీ అక్కరకురాకుండా పోతున్నాము. దీనికేమైనా తగిన వుపాయం మనమాలోచింపవలసిందే.

కళ్యా—చాలకాలమునుంచి నేనుగూడ నిదే ఆలోచిస్తున్నాను. తెలివితేటలు బొత్తిగా లేని మట్టితలనిర్భాగ్యులుకూడా మనతల దాటి పోతున్నారు. వాళ్ళకన్న యెన్నోరెట్లు బుద్ధిమంతులమైన మనము యీలా అధోగతిలో పడివుండడం చూస్తే నాలోనాకే చాలా ఆశ్చర్యమవుతున్నది. చేయవలసిన దేమిటో నాకు తోచకున్నది. పూర్వజన్మకృత మనుభవించవలసినదేకాని ప్రతిక్రియ యేమిచేయగలము. పైవుద్యోగస్థులకు మనమీద దయలేదు. అందరికీజీతాలు వృద్ధిచేస్తారు. అందరికీ బిరుదులిస్తారు. చచ్చినముండావాడు సీతారామయ్య కప్పుడే రావుబహాద్దరు వచ్చింది. మనకొక రావుసాహేబైనా లేదు. వాడు చేసిం

దేమిటి. మనము చేయుందేమిటి? పూజించడంలేదు గాని, మనవాళ్ళ బుద్ధికన్న గొప్పది. ఏమైతే నేమి? మనగీటు బాగున్నదిగాదు. ఆ శని గాడు మననెత్తి నెక్కితొక్కుతున్నాడు

శంక—మనము మందపల్లి వెళ్ళి శనికి నూనె అభిషేకముచేదాం. గ్రహశాంతి చేయించుకొందాం. ఇంతకంటె నాకేయుపాయం తోచలేదు. గ్రహములు బాగులేవని నా అభిప్రాయం. అదేకాకపోతే రాత్రి 10 గంటలుదాకా డెస్కుదగ్గర కూర్చొని పనిచేసి ఆఫీసంతా నాదేఅని దొర్లేవాళ్ళకు యేవిధమైనా ప్రోత్సాహము లేకపోవడమేమి? మనకంటె యేడు వెనకల ఆఫీసులో చేరి సరిగా నాల్గుబంతులైనా వ్రాయలేని అపాత్రులకు అగ్రస్థానములు రావడమేమి?

కళ్యా—ఓరి నీపిచ్చిగూల! మొదటినుండి నీవు జాతకాలుచూపించుకొని, గ్రహశాంతులు చేయించుకొని యింతవరకు పాడైనావు. ఇంకా అదేపాంతకాని నీకు రెండోపాంతలేదు. అది వుపయోగంలేదని తెలిసివుండికూడా యింకా అందులోనే దిగుతావేమి? వెంకప్పశాస్త్రుల్లు జాతకాలుచూచి చక్రాలుగీసి రెండువందల రూపాయలు గొరిగినాడు. ఇంకా నీకు బుద్ధిలేదు. ఈపాటికాదారి మానవేసి మంచిదారినిపడు మనలోకల్లా మన గణపతిరావు బుద్ధిమంతుడు, గణపతికున్నట్లే యతనికికూడ పెద్దపొట్టవున్నది. అది వొట్టిపొట్టగాదు. పొట్టనిండా వుట్టెడు బుద్ధులున్నాయి. అతడే దీనికేదన్నా గట్టివుపాయం చెప్పాల. ఆతడుపాయంచెప్తె కీలెరిగి వాతపెట్టినట్లుంటుంది. కుయుక్తులలో అతనిబుద్ధి అమోఘమైనది. అదివేశాడాలంటెరామబాణములాగుతగులుకొంటుంది. కాబట్టి ఆతనినే మనము ఆశ్రయిద్దాం. బాబూ! గణపతిరావ్! నీవేమేదో తరుణోపాయం చెప్పవలె ఆదెబ్బతో తేలితె ముగ్గురంతేలుతాం. లేకపోతె ముగ్గురం మునుగుతాం. చెడ్డకాపురమునకు ముప్పేమిటి? ఇంతకంటె మనమెక్కువ చెడిపోం. చెప్పు. నీవు బాగా ఆలోచించి వుపా

యం! రెండుమూడురోజులనుంచి రాత్రులు నిద్రలేకుండా నేనీవిషయమే ఆలోచిస్తున్నాను.

కళ్యా—ఆలోచనతెగి యేదన్నా వుపాయంతట్టిందామనస్సుకు ?

గణ—తట్టినది. అదే యిన్నిటిలోకి యెక్కువ వుపాయంలాగు తోచినది.

కళ్యా—చప్పున చెప్పుబాబు ? ఈదెబ్బతో తేలిపోతాను.

శంక—ఇక మనకష్టములు గట్టెక్కినవన్నమాటె.

గణ—ముందుగానే ఆశపడకండి చెప్పినదివినండి! మనము ము గ్గురం కలసి వొక కట్టగావుండి దొరల దరిశనం చెయ్యవలెను. చేసినప్పుడు నన్ను నీవు నీవు నన్ను గొప్పగా చెప్పుచుండవలెను. స్పష్టముగా చెప్తావినండి. నేను దొరగారిదగ్గరకు వెళ్ళినప్పుడు కళ్యాణరావువంటివాడు లేడని నేను చెప్తాను. దానితో నీమీదవ మంచి అభిప్రాయంగల్గుతుంది. నీవు వెళ్లినప్పుడు శంకరరావంత బుద్ధిమంతుడు మనరాజధానిలో లేడని కోతలు కోసివెయ్యి. శంకరరావు వెళ్ళినప్పుడు గణపతిరావుం డబట్టి ఆఫీసువున్నదిగాని లేకపోతె వొక్కనిముషము పనిజరుగదనిచెప్పవలెను. లోపల మనలోమనము స్నేహితులుగానుండి పైకిన్నేమాము లేనట్లుండవలెను.

కళ్యా—వహావ్వా! వహావ్వా! బుద్ధికి బృహస్పతివయ్యా! భేషైన వుపాయం.

శంక—దీనితో మనకు రావ్ బహదర్ బిరుదొచ్చిందన్నమాటె

(నిష్క్రమించుచున్నారు)

(అప్పుడు గణపతిరావు, వానిపై యధికారి ప్రవేశించుచున్నారు)

గణపతి—(తనలో) అధికారులను వశము చేసుకొనవలెనంటె మంచిమంచి వస్తువులు చేయవలెను. అధికారిని చూడవలసి వచ్చినప్పుడు నూరో రెండువందలో బత్తాయిపండ్లు, నాలుగో అయిదో చక్ర

కేళీగెలలు, పట్టుకెళ్ళి చూచితిమా ఆగ్రహపిశాచము ఈ నైవేద్యములో తొలగిపోతుంది. ఎంతో అనుగ్రహం కుదురుతుంది అధికారుల దర్శనం చేయుటకు ముందు బట్లరు దర్శనం చేయవలెను. వానిని చూడకపోతే దేముడు వరమిచ్చినా పూజారి వరమివ్వడు. నా అదృష్టమువల్ల బట్లరు నాకు ముఖ్యస్నేహితుడే అయినాడు. అధికారుగారు నర్వ్వచున్న సమయం చెప్పవలసినదని చెప్పినాను అదిగో! వస్తున్నాడు బట్లర్.

బట్లరు—అధికారిగారు రమ్మన్నారుసామి! మంచి సమయం సామి! పండ్లు లోపలపెట్టేదా?

గణ—అందులో పదిపండ్లు నీవు తీసికొని తక్కినవి అధికారిగారి బల్లమీదపెట్టు.

బట్ల—రొంబ బంప నుంచివాడుసామి నీవు నాకు మంచి ప్రెజెంటియ్యాలసామి అధికారిగారితో ఎప్పుడు చెప్తావుంటా మీసంగతి నేను.

గణ—వెళ్ళవచ్చునా లోపలికి?

బట్ల—ఇప్పుడే పోయ్యా! అధికారి కుశాలుగా వుండాడు.

గణ—(లోపలికివెళ్ళి సలాము చేయుచున్నాడు.)

అధికారి—ఏంపనిమీద వచ్చినావ్?

గణ—గుడ్ మార్నింగ్ సర్!

అధి—ఏమిపనిమీదవచ్చినా?

గణ—వూరికే, తమ దర్శనము చేసి వెళ్ళవలెనని వచ్చినాను. మాతోటలో మంచి బత్తాయిపండ్లు కాచినవి. అవి యేలినవారికి దాఖలు చేసికొనుటకు వచ్చినాను.

(అప్పుడు బట్లరు పండ్లగంప తెచ్చును)

అధికారి—కూర్చుండు! ఆకుర్చీమీద కూర్చుండు!

గణపతి—(సంతోషముతో) థ్యాంక్యూసార్ ! (అని కూర్చుం డును.)

అధికారి—నీకు తోటలున్నవా ?

గణపతి—నాకు మంచితోటలున్నవండి (తనలో) లేనిదేవున్నా యన్నాను. వీడు యింకా తరిచి తరిచి అడిగితే పడిపోతానేమో అని భయం వేస్తుంది.

అధికారి—ఏమేమితోటలున్నాయి నీకు ?

గణ—బత్తాయి, చక్రకేళీ, కొబ్బరితోట.

అధి—నీకు తోటలమీద ఏమివస్తుంది ?

గణ—(తనలో తక్కువచెప్తే వొస్తున్నదంటే మనమీద వీడికి గౌరముండదు. అందుచేత వొకడాబు డాబుతాను. ప్రకాశముగా) సాలుకు పదిహేనువందలు రూపాయిలు వస్తవి.

అధి—బాగున్నది. అయితే నీకిప్పుడు జీతమెంత ?

గణ—రు 80-0-0 లు యిస్తున్నారు.

అధి—అయితే నీకుటుంబములో జనమెంత ?

గణ—ఏడెనమండ్రుగుర మున్నాము.

అధి—మీ హిందువులలో మనిషివొక్కంటి కెంతవుతుంది ఖర్చు ?

గణ—నెలకు మనిషి కేడెనిమిది రూపాయ లవుతుంది.

అధి—పదిహేనువందల శిస్తు ఈ ప్రకారంగా నీ కెన్నాళ్ళనుంచి వస్తుంది ?

గణ—పదేళ్ళనుంచి వస్తుంది.

అధి—నీకు పిల్ల లెందరు ?

గణ—ఇద్దరుకొడుకులు ఇద్దరుకూతుళ్ళు.

అధి—నీస్థితికి నాకు చాల సంతోషంగా వుంది. నీవంటిగొప్ప

కుటుంబస్థులు, ఆస్తివున్నవాళ్ళు ఆఫీసులలోవుంటే చాలామంచిది. డబ్బున్నవాళ్ళుగనుక లంచాల కాశపడరు. హానెస్టుగా వుంటారు, నీవు హానెస్టుమ్యాన్‌వనే వింటున్నాను.

గణ—చిత్తము. చిత్తము. మాపెద్దలు యీదేశంలో దేశపాండ్యాలు. మాది చాలాగొప్ప కుటుంబము. నేను మొదటినుంచి హానెస్టుగానే వుంటున్నాను. కాని మాఅందరి ఆనస్టీ లెక్కేమిటండి! నీతి చెప్పవలసివచ్చినప్పుడు కళ్యాణరావుది నీతి, అతనంత హానెస్టుమ్యాను డిపార్టుమెంటులో వుంటాడని నాకుతోచదు.

అధి—ఎవరు! కళ్యాణరావంటే యెవరు?

గణ—చిత్తము, ఏలినవారు యెరుగుదురు. యెర్రగా- పొట్టిగా- లావుగా- వుంటాడు కుడి కనుబొమమీద నల్లని పుట్టుమచ్చున్నది.

అధి—ఓహో! ఆపోకేగా పడుచువాడా?

గణ—చిత్తము.

అధి—అతడంతనీతిమంతుడని నీవేలాచెప్పగలవు?

గణ—చాలా దృష్టాంతరా లున్నవండి! నేను స్వయంగా నెరుగుదును.

అధి—ఏదీ! వొకటి రెండు దృష్టాంతరాలు చెప్పండి! చూతాము.

గణ—ఈ ఆఫీసులో వెనకవుండే మేనేజరుగారు కళ్యాణరావుకు చాలా దగ్గరచుట్టము. కళ్యాణరా వెంతచెప్తే అంతా ఆయన వినేవాడు. ఒకనాడు ఈవూరిలో పెద్దమనిషికి గొప్పఅవసరం మేనేజరుగారితో కలిగినది. ఆయనవల్ల వొకకార్యం కావలసివచ్చింది. మేనేజరుగారితో చెప్పి శిఫారసుచేసి ఆకార్యం చేయిస్తే వెయ్యిరూపాయిలు రొక్కంయిస్తానని ఆపెద్దమనిషి కళ్యాణరావుతో అన్నాడు. అప్పుడు కళ్యాణరావుకు రు 40—0—0 లే జీతం. కూతురి పెళ్ళికోసం డబ్బులేక

అప్పుడు తిరుగుతున్నాడు. అంతటి యిబ్బందినుండికూడ కళ్యాణరావు చీ! డబ్బునేను పుచ్చుకోనని శిపారసుచేసి ఆకార్యం చేయించినాడు. అంత మంచివాడింకొకడుండడం కష్టం.

అధి—చాలామంచివాడేకాని, ఆతనికి ప్రమోషనెందుకు కాలేదు?

గణ—న్యాయంచూచే ప్రభువులు లేరు ఏలినవారు వచ్చినారు గనుక యిక జరుగవలెన్యాయం. కొందరు తమ ప్రజ్ఞ చాటుకుంటారు ఇతనిదగ్గరా గుణంలేదు తన పనేమో తానేమో. మంచివాళ్ళకిది రోజులుగావు.

అధి—సరే! బాగున్నది యస్ గుడ్‌మార్నింగ్!

గణ—చిత్తము సెలవు పుచ్చుకుంటాను. (అని తనలో) కళ్యాణరావునుగురించి బాగా కోతలు కోశాను నసాళమంటేట్లు చెప్పాను.

(అని నిష్క్రమించును.)

అధికారియిల్లు (అప్పుడు శంకరరావు ప్రవేశించుచున్నాడు.)

శంక—(తనలో) ఆశ యెటువంటిపనైనా చేయించగలదు. తండ్రి తద్దినమునాడైనా దేశవాళీమామిడిపండ్లు కొని బ్రాహ్మణులకు వేయని ముండావాడిని హావ్వాల్‌రజంబహాంగీర్ ఫసందు అంటుమామిడి పండ్లు రూపాయకు అయిదు చొప్పున ఆరుచొప్పున నూరుపండ్లుకొని పైయధికారికి సమర్పిస్తున్నానుకదా! శివరాత్రినాడైనా దేవుడిగుళ్ళోకి వెళ్ళి పూజారివాడి పళ్ళెంలో బేడడబ్బులు పెట్టలేనివాడిని థపేదారివాడి చేతులో రెండు రూపాయలూ బిళ్ళకుడుములలాగు పెట్టివేస్తున్నాను. ఆమడదూరమైనా అవలీలగా నడిచి పొయ్యేవాడిని డాబుకోసం రూపాయిచ్చి గుర్రంబండెక్కి వచ్చినాను మాయధికారి భోంచేస్తున్నాడు. భోజనమైందాక చచ్చినట్లు యీచెట్టుక్రింద కూర్చుంటాను. రెండురూ

పాయలూ పుచ్చుకొని డ ఫేదారు చావగుద్దయినా వేయడు. ఏమిరా అంటే అసలు వ్యవహారం చెడగొడ్తాడు. మావరస్వరస్తోత్రసమాజములో ఏర్పరచుకొన్న రూలుప్రకారం నేను గణపతిరావును గురించి మాట్లాడ వలెను. వీ డబ్బా పీడిశిఖతరగ ! ఈగణపతిరావు వట్టి అవకతవకముండా కొడుకు కాని యేర్పరచుకొన్న నియమము ప్రకారము వాడు వువ్వులే కుండా ముప్పందుము త్రాగుతాడని, యింతవాడు లోకంలో లేడని బుద్ధికి బృహస్పతని, దానకర్ణుడని నోటికివచ్చినట్లల్లా చెప్పవలెకాబోలు! ఏమిచేయను వసుదేవుడు గాడిదకాళ్ళు పట్టుకొన్నాడు. విశ్వామిత్రుడు కుక్కమాంసం తిన్నాడు. సమయం తప్పివస్తే స్వలాభం నిమిత్తం ఏంచేసినా చెయ్యాలి.

థఫేదారు పంతులుగారూ శెలవైంది. లోపల దయచెయ్యండి!

శంక—వస్తున్నా (అని బట్టలుసర్దుకొని లోనికివెళ్ళి) గుడ్ మార్నింగ్ సర్! (అని సలామచేసి అధికారియెదుట నిలువబడును)

అధి—ఎవరు నీవు?

శంక—జేవరవారి తాబేదారిని ఆఫీసులో వుద్యోగస్తుడిని.

అ—ఏమిపనిమీద వచ్చినావు?

శంక—చిత్తము. ఏలినవారి దర్శనము చేసుకొనేందు కొచ్చి నాను.

(అంతలో డఫేదారు మామిడిపండ్లబుట్ట తెచ్చి బల్లమీద పెట్టును.)

అధి—ఎవరు పంపించినారు ఈపండ్లు?

డఫేదారు—ఈ అయ్యగారే తెప్పించినారండి

అధి—ఏం! నీవే తెప్పించినావా?

శంక—చిత్తం చిత్తం నేనే దాఖలుచేసుకొన్నానండి

అధి—ఎక్కడి వీ మామిడిపండ్లు? ఏమిరకం?

శంక—ఇవి జహాంగీరుఫసందుపండ్లు మాచుట్టాలున్నారు పంపించినారు. అవి దేవరవారికి (తనలో) (కొని తెచ్చానంటే ఎంతగాదా వస్తుందో బాబూ ఏదో నోటికొచ్చినట్లు కూసివేసినాను)

అధి—ఓ! మీచుట్టాలకు తోటలున్నవా? అందులో ఇంకేమి రకములున్నవి.

శంక—(తనలో) ఏమేమిరకాలున్నవో నేనసలు యెరుగను. అయితే అయింది. యేదో అడ్డంగా కోతకోస్తాను. అధికారులదగ్గర మనిషి చకాచికీగావుంటేగాని పనికిరాడు (ప్రకాశముగా) ఇంకా మంచిమంచి యెక్కూరకాల పండ్లున్నాయండి షాజహాను పసందు, నూర్జహాను పసందు, ఔరంగజేబ్ పసందు వున్నవి.

అధి—జహాంగీరు పసందువిన్నానుగాని, తక్కినపసందులెప్పుడు వినలేదు. ప్రపంచములో ఏతోటల్లోను యివివున్నట్లెరుగను. మీవాళ్ళ తోట్లోవుంటే ఆరకంపండ్లు కొన్ని తప్పక పంపించండి.

శంక—(తనలో) దీనమ్మకడుపుకాలకొరివిగాకోతలగొట్టుకున్నాను ఎరగనివాడని యెరగనట్లూరుకోకుండా కోతలుకోసి కొంప తీసికొన్నాను. కొనైనా తీసుకొద్దామంటే ఆరకంపండ్లు లోకంలో లేనేలేవట. నేతవ్వుకున్నగోతిలో నేనేపడ్డాను. ఈరకాలు గిరకాలు నాకు తెలియవు చిన్నప్పటినుంచి నాకు అలవాటైనరకాలు రెండుమూడున్నవి. వంక పులుపుపసందు. తొక్కుపులుపుపసందు. చింతకాయ పసందు మొదలైనవేగాని వీటి మొగమెరుగను. ఏమనిచెప్పను. అధికారితో వీడు ఆవలిస్తే ప్రేవులు లెక్కపెడ్తాడు. ప్రమోషన్‌గాదుగాని కత్తెరబోనులో ప్రవేశించాను దేవుడా!

అధి—ఏమి! ఆలోచిస్తున్నావేమిటి?

శంక—చిత్తం చిత్తం ఏమిలేదండి తోటలునావికావు. పండ్లు యిస్తారో యివ్వరో! యేమో అని ఆలోచిస్తున్నానండి.

అధి—పోనీ! వాళ్ళిద్దరిని తోస్తే నేను రూపాయిలిస్తాను కొని పట్టుకురా?

శంక—(తనలో) బద్మాసు రాదేముడా! ఈదెబ్బతో! యిప్పుడేమి జావాబుచెప్పను ఈయనికి. (ప్రకాశముగా) మావాళ్ళు స్వంత యుపయోగానికేగాని అమ్మరండీ.

అధి—అమ్మకపోతే రకానికి నాలుగుపండ్లు పూరికేపట్టుకురా?

శంక—చిత్తము! అలాగే తీసుకొస్తానండి!

అధి—నీవువచ్చిన పనేమిటి?

శంక—నాకుప్రమోషన్లై చాలాకాలమైనది ప్రమోషనిప్పించవలెను.

అధి—నీజీతమెంత?

శంక—రు 50 లు జీతం.

అధి—గణపతిరావు కెంతజీతము?

శంక—గణపతిరావుకు రు 50 లు.

అధి—కళ్యాణరావు కెంతజీతము?

శంక—కళ్యాణరావుకు రు 50 లేనండీ.

అధి—మీముగ్గురలో సీనియరెవరు?

శంక—గణపతిరావుగారే సీనియరండి.

అధి—అయితే గణపతిరావుకే ముందుయివ్వవలసి వుంటుంది.

శంక—చిత్తము! చిత్తము! గణపతిరావుగారికే ముందుకావలెనండి గణపతిరావు ఆఫీసంతలోకి రత్నంవంటివాడు అతనికి నాకూ సరిపడదుగాని, నిజంచెప్పవలసివచ్చినప్పుడు విరోధమైన సత్యంచెప్పక తప్పదు కలంపుచ్చుకుంటే శారదవలె వ్రాస్తాడు. ఆఫీసులోనున్న రికార్డులన్నీ ఆయనకు కంఠతఃవచ్చును. 50 యేండ్లనాటి రికార్డు అయినా ఆయనకు తెలియందేమిలేదు. అంత అసిస్టెంట్ మరొకడుంటాడని నేనను

కోను. రూపాయంటే గుడ్డిగవ్వ. ఆయన యెంతఆనెష్టుమనిషంటే? సర్కారు ఉంత్రోతులచేత తన వుత్తరాలైనా పోష్టులో వేయించుకోడు తన స్వంత వుత్తరాలు సర్కారుకలం సర్కారుసిరాబుడ్డి పెట్టి యెప్పు డూరాయడు. ఆఫీసర్లతో సర్కారువెళ్ళినప్పుడువి స్తరాకుముక్కైనా సప్లయి పుచ్చుకోడు. అందరికంటె వొక డబ్బెక్కువిస్తాడు నరుకులకు.

అధి—అబ్బా అటువంటి ఆనెష్టుమన్యాను నెప్పుడు చూడలేదె? అయితే యిదివరకెందుకు ప్రమోషనైంది కాదతనికి?

శంక— వెనుకటి మేనేజరుగారికి గణపతిరావుగారికి పడదండి! వారువైష్ణవులు వీరు మధ్వులు పంగనామాలకు బెండకాయకు లట్ పట్ వచ్చింది.

అధి—ఇతనిమీద లంచాలుపుచ్చుకొన్నట్లర్జీలువచ్చినవంటూరే

శంక—అవన్ని కూడా మేనేజరు స్వయంగా యిప్పించినఅర్జీలే యింకా మేనేజరుదగ్గిరె మొతక గుణముండేది సం॥ రానికి వొక్కొక్క గుమస్తా వొకనెలజీతమియ్యవలసిందని బలవంతంపెట్టాడు. ఛీ! నేనివ్వను పో అని గణపతిరావు తిరస్కరించాడు అని మేనేజరుకోపము.

అధి—మంచిపనిచేశాడు. ఆలాయివ్వకూడదు. సరె నీవువెళ్ళు గణపతిరావు కిచ్చినతర్వాత నీపని ఆలోచిస్తాము.

శంక—చిత్తము! (అని సలాముచేసి యివతలకువచ్చి తనలో) గణపతిరావు కళ్యాణరావునుగురించి చెప్పాడు. నేను గణపతిరావును గురించికోశాను. ఇక నన్నుగురించి కళ్యాణరావు చెప్పాల. వాడుమా యలపక్కీరు. చూచిరమ్మంటె కాల్చి వస్తాడు. ఇంతకు నేను మామిడి పండ్ల ఆపదలోనుంచి తప్పించుకొని బయట పడితేగదా? మీదదేము డున్నాడు.

(అని నిష్క్రమించును.)

అధికారియిల్లు.

(అప్పుడు కళ్యాణరావు ప్రవేశించుచున్నాడు)

కళ్యాణ—(తనలో) సూక్ష్మములో మోక్షము సంపాదించిన వాడే ప్రయోజకుండు. మామిడిపళ్లు బత్తాయిపండ్లు చక్కెరకేళీ అరటిపండ్లు నూటికొకనాడైనా మనకు దొరకవు డబ్బుచేతిలోవుంటే నేను నాపెళ్ళాము బిడ్డలు చక్కగా తినకుండా మధ్య అధికారికిపెడితే యేమున్నది. అందుచేత ఒకడబ్బే ఖర్చుచేసి అధికారిని చూడడము మంచిది డబ్బుకి రెండు నిమ్మకాయలు వచ్చినవి. పైగా యిది నా సొంతపని కాదుగదా? నేను వెళ్ళి అధికారిదగ్గర శంకరరావును స్తోత్రము చెయ్యాలి. అందుకోసం పదిరూపాయలు ఖర్చుపెడతానా? గణపతిరావు శంకరరావు అంటె కొంచెము పిల్లికూన వున్నవాళ్లు కనుక ఖర్చుపెట్టగలిగినారు. నేనేమి ఖర్చుపెట్టగలను? ఈ రెండు నిమ్మకాయలతో కార్యమైతే అవుతుంది కాకపోతే కాకపోతుంది. శంకరరావును గురించి యేమిచెప్పను? నన్నుగురించి గణపతిరావు లంచాలు పుచ్చుకోనని చెప్పినాడు. శంకరరావు గణపతిరావును గురించి చెప్పే టప్పుడు తెలివిగలవాడు, వ్రాతగాడు, లెక్కగాడు అని చెప్పినాడు. శంకరరావును గురించి నేను ఏమిగాడని చెప్పను. ఆఫీసుకు పనికొచ్చేవాడు గాడు గోదావరిలో పడేస్తే యీతగాడు చీట్లాటలో పడేస్తె కోతగాడు. చెడుగుడీ ఆటలో మంచికూతగాడు. దొరగారి దగ్గర యీసంగతులు చెప్పే పనికిరావు గదా? పనికివచ్చేటందుకు యిప్పుడు కవిత్వం చెప్పాలి. యీకరంభూమి లేనివాడిని రాజాధిరాజని కొండముచ్చంటివాడని మన్మథుడని కవీశ్వర్లు చెప్పినట్లు నేను మాశంకరరావును స్తోత్రము చెయ్యాలి. సరే మానుతుంది గనుకనా? పీడు గొప్పస్వామిలీ వాడని చెప్తాను. అడుగో? డఫేదారొస్తున్నాడు.

(అప్పుడు డఫేదారువచ్చును.)

డఫేదారు—ఏమండీ? పంతులుగారూ మొన్న పండుక్కొయినామువస్తే దర్శనమైందిగాదు.

కళ్యా—(తనలో) దర్శనమైతే రెండురూపాయలు దొబ్బడానికే గదా. (ప్రకాశముగా) అయ్యయ్యో! నీకోసం రూపాయలుమూట గట్టుకొని కూర్చున్నానోయి. సమయానికి నీవు వచ్చావుకావు. అంతా పట్టుకొని పోయినారు రూపాయలు.

డఫే—నాఅదృష్టంలేదు మహారాజ్! నేను పదిసార్లు వచ్చాను మీకోసం. మీరు కనబడలేదు.

కళ్యా—అయ్యో! నేనిట్లోలేనప్పు డొచ్చావు కాబోలు. ఈవేళ సాయంత్రమురా? తప్పకుండాను నీది నీకిచ్చివేస్తాను. మీ మామూలు లెక్కడికిపోతుంది, మీపెట్టెలో నున్నట్టే.

డఫే—చిత్తము! అనకవస్తాను. దొరగారి దర్శనం చేస్తారా యేమిటి?

కళ్యా—అవును ఇది సమయమేనా.

డఫే—మంచిసమయమండి? కులాసాగా వున్నారు దొరగారు మీకార్డు యివ్వండి?

(కళ్యాణరావు కార్డిచ్చుచున్నాడు. డఫేదారు లోనికివెళ్ళి తిరిగివచ్చి)

డఫే—దయచెయ్యండయ్యా! రమ్మన్నారు.

కళ్యా—సరే! (అని వెళ్ళుచున్నాడు.)

(అప్పుడధికారి ప్రవేశించుచున్నాడు)

అధి—నీపేరెవరు?

కళ్యా—(సలాంచేసి) నాపేరు కళ్యాణరావు (అని నిమ్మకాయ ---చ్చును.)

అధి—(పుచ్చుకొని బల్లమీదపెట్టి)కూర్చుని ఎందుకొచ్చినావు?

కళ్యా—(కూర్చుండి) దర్శనము చేసివెళ్ళవలెనని వచ్చాను.

అధి—నీకేమికావలెను?

కళ్యా—ప్రమోషను కావలెను.

అధి—అందరు ప్రమోషను కావలెనంటే ఏలావస్తుంది.

కళ్యా—మామామాసంగతులు మేమ చెప్తూవుంటాము. దేవరవారిష్టమువచ్చినట్లు చేయవచ్చును.

అధి—యిప్పుడేమి ఖాళీలేవే.

కళ్యా—వచ్చినప్పుడే తమరు దయచేయించవచ్చును.

అధి—నీవు శంకరరావు సమానజీతంలో నున్నారుగదా? మీ యిద్దరిలో యెవరికియ్యవలసినది?

కళ్యా—దేవరవారియిష్టము యెవరికిచ్చినాసరే! శంకరరావు చాలాపెద్దకుటుంబమువాడు.

అధి—ఏమిగొప్పకుటుంబము కొంచెముచెప్పు.

కళ్యా—(తనలో) పప్పులో అడుగేశాను. ఏమని చెప్పను? ఇప్పుడాలోచిస్తే కార్యంలేదు (అని ప్రకాశముగా) ఈయనతాత హైదరాబాదుయిలాకా తహసీలుదారీ చేసినాడు అతనిముత్తాత మైసూరిలాకాలో యేదోవొక గొప్పవుద్యోగం చేశాడు.

అధి—అబ్బా అంతగొప్పవుద్యోగాలా? తండ్రేమిచేశాడు?

కళ్యా—తండ్రి గొప్పవుద్యోగములు చెయ్యలేదుగాని పెద్దమనిషిఅని పేరుపడ్డాడు అతనికుటుంబం గొప్పేకాకుండా శంకరరావు చాలాపెద్దమనిషి. ఈవూళ్లో ఆతనంటే అందరికిగౌరవం మనడిపార్టుమెంటులో అట్లాంటివాడు లేడని చెప్పవచ్చును. దస్తూరీ ముత్యాలఫలాలు. అతనికున్నవోపిక మరొకరికిలేదు ఆఫీసులో జబ్బుచేసి పనిచేయలేని

వాళ్ళు వస్తుంటా ఆయనచేస్తారు. ఆయన పిల్లలుకలవాడుకూడాను. ఆయనకు ప్రమోషనిస్తే మేమంతా సంతోషిస్తాము.

అధి—ఇదివరకు నాకు తెలియలేదు. ఇంతమంచివాడా శంకర రావు? సరే! మీరు వెళ్ళండి!

కళ్యా—సెలవు చిత్తము (అని సలాముచేసి వెళ్ళుచున్నాడు)

(తనలో) శంకరరావుతాత ముత్తాత హైదరబాదులో మైసూరులో గొప్పఉద్యోగాలు చేసినట్లు కోశేశాను. ఈయనగారు నేనులేనప్పుడీ సంగతి అతని నడుగుతారేమో? వాడు మరోలాగు చెప్పినట్లయితే వాడికొంపానాకొంపామునుగుతుంది. నేను చెప్పిన పాటేవాడమని ముందుగావెళ్ళి వాడితో చెప్పాలి.

(అని నిష్క్రమించును)

(కాగితము చేతబుచ్చుకొని చదువుచు అప్పుడు అధికారి ప్రవేశించుచున్నాడు.)

అధి—(తనలో) ఈఅర్జీ చిత్రముగానున్నది. చదివిచూచెదను.

"మహారాజశ్రీ భోగాపురం జిల్లాకలెక్టరువారి సముఖమునకు

భోగాపురం కాపురస్తులైన ఆకాశరామన్న, పిడుగుఅగ్నిహోత్రుడు యేకస్తులై వ్రాయించి దాఖలుచేసుకొన్న అర్జీవిన్నపములు.—

ఏలినవారు మీమనస్సువలెనే అందరి మనస్సు స్వచ్ఛమైనదనుకొని మోసపోతున్నారు. మీకచ్చేరీలో మీ తాబేదారులుగనుండే ముగ్గురుమనుష్యులు చిత్రమైన సంఘమొకటి యేర్పరచినారు. దానిపేరు పరస్పర స్తోత్రసమాజము ఆముగ్గురెవరనగా? గణపతిరావు, శంకరరావు, కళ్యాణరావు గణపతిరావు కళ్యాణరావును పొగడటం కళ్యాణరావు శంకరరావును పొగడడం, శంకరరావు గణపతిరావును పొగడుతున్నారి ఏర్పాటు ఈయేర్పాటు మీవద్దకు వచ్చినప్పుడు ముఖ్యంగా జరుప

వలసిందని వారి నిర్ణయం ఇది మిమ్మల్ని బుట్టలో పెట్టవలెనని చేసిన ఆలోచన. వీళ్ళుముగ్గురు లంచగొండులు వీళ్ళుముగ్గురు అబద్ధాల కోరులు వీళ్ళుముగ్గురు తుంటరులు ఈసంగతులు పూర్తిగా తెలిసి వెనుకటి అధికారులు వీళ్ళకు ప్రమోషను లేకుండా చేసినారు వీళ్లుమాట్లాడుతుంటే నొసలు వెక్కిరిస్తుంటవి వీరు రావణ కుంభకర్ణాదుల వంటి వారు. మనసులో ఆలోచించేది వకటి నోటితో చెప్పేది వకటి, చేతితో చేసేదివకటి. వీళ్ళవంటిమోసగాండ్రు ప్రపంచములో పుట్టబోరు వీళ్ళమాటలు కూలినవారు నమ్మవద్దు. నమ్మితే బొందలో బడిపోవడమే మీరు క్రొత్తప్రభువులగుటచేత వీళ్ళసంగతులు తెలియక మోసపోవచ్చును. ఇదివరకే వీళ్ళుమీదగ్గర నాటకమారంభించినట్లు కనపడుచున్నది. కళ్యాణరావంతటివాడు లేడని గణపతిరావు, గణపతిరావంతవాడు లేడని శంకరరావు, శంకరరావంతవాడు లేడని కళ్యాణరావు వొకరినొకరు స్తోత్రముచేసుకుంటూ తమయందు మంచియభిప్రాయము అధికార్లకు కలుగవలెనని ప్రయత్నముచేస్తున్నారు. ఈ సంగతులు దేవరవారికి తెలియచేయుటకు న్యాయముగా యీఅర్జీ వ్రాసినాము. ఇందులో అబద్ధము లేదు. ఇందుకు భూమిసాక్షి, ఆకాశం సాక్షి, అగ్నిహోత్రుడుసాక్షి, వాయుదేవుడుసాక్షి.

అంగీరసనామ సం॥ర } ఆకాశ రామన్న వ్రాలు
మాఘశు॥ పున్నమి } పిడుగు అగ్నిహోత్రుడు వ్రాలు"

ఈఅర్జీ నిజమైయుండునా ? ఈఅర్జీదారులు వ్రాసినట్లు వీళ్ళు ముగ్గురు నావద్దకువచ్చినారు. ఒకరినొకరు స్తోత్రముచేసుకున్నారు. అంత వరకు ఈఅర్జీలోని సంగతులునిజమే. వీళ్ళు తెలివికలవాళ్లు, మర్యాదస్తులై తే వెనకటిఅధికారులు వీళ్ళకు ప్రమోషనియ్యకపోవడానికి కారణమేమి ? అందుచేత వీళ్ళు తుంటరులన్నమాట నిజము. ఆకాశరామన్న అర్జీ లోకప్పుడు నమ్మవలసేవుంటవి. ఎల్లప్పుడు వాటిని తోసివేయ

గూడదు. నిజమైనసంగతులే ప్రత్యక్షంగా రుజావుచేయలేక ఆకాశ రామన్న అర్జీలు వ్రాస్తారు. ఈముగ్గురిని నమ్మి నిశ్చయంగా మోసం చేయవలెననే సంకల్పించుకొన్నారు అందుచేత వీళ్ళతెగులు గట్టిగా కుదర్చవలె వీళ్ళకుబుద్ధిచెప్తాను, ఈదెబ్బతో మరెవరూ యిటువంటి పన్నాగం పన్నకుండా చేస్తాను డఫేదార్ ! శంకరరావునుపిలు.

డఫేదార్డు—(వెళ్ళి పిలుచుకొని వచ్చుచున్నాడు)

శంకర—(ప్రవేశించి) సలాము !

అధి—ఎమి? మిరాచిట్టాలతోటలో సూర్జహానుపసందు, ఔరంగ జేబుపసందు మొదలగుమామిడిపండ్లున్నాయన్నావుకాదా ? ఏవాపండ్లు రాలేదేమి ? నాకు ఖరీదుకేకావలె. ఉచితముగా అక్కరలేదు.

శంక—చిత్తము, వహావాళ్ళతోటలో ఉన్నాయనుకొన్నాను కాని, లేవండి !

అధి—అనుకొన్నావా ! నీవు, నీవుఅనుకోలేదు. నాలుగు కల్ల బొల్లిమాటలు నాదగ్గర చెప్పి నన్ను బుట్టలో బెట్టనాలోచించినావు. ఎల్లకాలము నీవబద్ధాలు చెప్పినందుకు నీకెప్పుడు ప్రమోషనియ్యకూడ దని యిందులో వ్రాసివేస్తాను.

శంక—దేవరవారు క్షమించవలెను. పొరపాటొచ్చింది.

అధి—బుద్ధిపూర్వకముగా చేసినదానికి క్షమించడము లేదు. వెళ్ళు అవతలికి.

శంక—(వెళ్ళుచు తనలో) అనుభవించక తప్పదు.

అధి—డఫేదార ! గణపతిరావునుపిలు.

డఫె—(వెళ్ళి గణపతిరావుతో ప్రవేశించుచున్నాడు)

గణ—సలామండి.

అధి—నీకు సాలుకు రు 1500 వస్తావని నాతో చెప్పినావు. నీసఖర్చులక్కువ, చాలబడిమొక్కువగానున్నట్లు కనబడుతుంది. ఆకారణ ముచేత నీకు ప్రమోష నియ్యనక్కరలేదు.

గణ—ఎంత చెట్టుకంత గాలివున్నది. ఖర్చు లేకేమండి మహా ప్రభో !

అధి—నీమాట నేను నమ్మను. నీకు ప్రమోషను లేదనరేకదా! నీవు వెనక నాతో చెప్పిన మాటలనుబట్టి నీదగ్గర పదివేలో పదిహేను వేలో వున్నట్లు నాకు కనుపడుతుంది అది వడ్డీకి తప్పకుండా తిప్పుతుంటావునీవు. కాబట్టి నీకు సాలుకు రు 40 లు ఇన్‌కంటాక్సు వేస్తున్నాను నీవు అప్పీలుచేసుకున్నా కార్యంలేదు. లండన్‌కు వెళ్ళినా కార్యంలేదు. చచ్చినట్లిచ్చుకో ?

గణ—నేనిచ్చుకోలేనండి నేను పేదవాడినేగాని భాగ్యవంతుడనుకాను.

అధి—డఫేదార్ ! ఇతనిని అవతలికి పంపించు. కళ్యాణరావుకు కూడ ప్రమోషనివ్వవని చెప్పు ? మీవాళ్ళగురికి వీలైతే జీతంతగ్గించడానికి ప్రయత్నంచేస్తానుగాని ప్రమోషన్ యివ్వను. వెళ్ళిపో ? గణపతిరావు వెళ్లుచున్నాడు.

గణ—(తనలో) చేసిన ప్రయత్నమంతా వ్యర్థమై పోయెను.

కడపటిరంగము

(అప్పుడుగణపతిరావు, కళ్యాణరావు, శంకరరావు ప్రవేశించుచున్నారు)

గణ—కళ్యాణరావు ! చేసినప్రయత్నమంతా వ్యర్థమైపోయింది

కళ్యా—మనపాపము మననే కొట్టిందదిరా బాబూ !

శంక—పాపము బద్దలు కాకమానదు.

గణ—తానొకటి తలిస్తే దైవమొకటి తలచినాడు.

కళ్యా—దురాశ దుఃఖములచేటన్నమాట మనయందు సార్థకమైనది.

శంక—ఇటువంటి సమాజము లెప్పుడు స్థాపించవద్దని అధికారి బుద్ధిచెప్పాడు. ఇకమీదైనా బుద్ధిగలిగివుందాము.

గణ—మనము చెప్పిన అబద్ధాలికి భగవంతుడు మాకుశిక్షవిధించవలసిందే! రండి! వెళ్ళుదాము. (వెళ్ళుదురు)

---

## గౌరవసంపాదనము

(పేరయ్య వీరయ్య ప్రవేశించుచున్నారు.)

పేర—ఓరే వీరయ్యా! నీవు చెప్పినమాట నిజమే మనకిప్పుడు గడ్డిపరకంత గౌరవమైనాలేదు. కూర్చున్న గుడ్డిముండలేదు. ఇందుకు మనమేమి చేయవలసియున్నది. మనము గౌరవము సంపాదింపవలయును దీనికేముపాయము.

వీర—గౌరవమేలాగున సంపాదించగలవురా కూరగాయలా బజారులోనికివెళ్ళి వీసెమూడణాలుచొప్పున కొని తెచ్చుటకు పొట్టచించి కంచుకాగడా పుచ్చుకొని వెతకినా యెక్కడ అణుగమ్మెక్క లేదు. పోనీ డబ్బైనా ఉన్నదేమో అనుకుంటే అమ్మాబువ్వ అయ్యాబువ్వ లాగున్నాము. ఏపూటకాపూటే పొయిమీదికి కుండెక్కడు. మనకున్న భూములు క్షుద్రభూములేకాని వేరేలేవు.

పేర—డబ్బు, భూములు చదువు లేకపోతేమాత్రము మనిషికి గౌరవమురాదా యేమిటి. మహారాజుగారు పంచభక్ష్య పరమాన్నములు తింటే నేను గంజియన్నమే తింటాను మనకుండవలసిన గౌరవము మనకుండదా పేదవాళ్ళకు గౌరవముండదా యేమిటి.

వీర—ఉండకేమి డబ్బులేకపోయినా భూమి లేకపోయినా విద్యలేకపోయినా నడతమంచిదిగానుంటే కావలసినంత గౌరవముంటుంది. నీకు నాకు ఆ నడతేది నీవు పేచీలకు పెదబాబువు. నాలుగుడబ్బు లెవడైనా అప్పిస్తె ఎగవేస్తే సూత్రమే ఆలోచిస్తావు. అడిగితే చిరాకు అడగకపోతే పరాకు. తప్పుసాక్ష్యమంటే మనకు నమర్థు బెరుగు లేదు. ఈలాంటివాళ్ళకు గౌరవము రమ్మంటే యెక్కడనుంచి వస్తుంది.

పేర — మనలను మనమే చులకనచేసుకుంటే పై వాళ్ళు చులకన చెయ్యరా ఈగుణాలు మనకే యుండడమేమి పెద్దమనుష్యులని పేర్లు పెట్టుకొన్నవారికి చాలామందికున్నాయి. మనమేమో వట్టి వెధవలమని పై వాళ్ళందరు గొప్పవాళ్ళని నీకు వట్టి వెఱ్ఱిభ్రాంతిపట్టినది. కుండలోకి కూరైన కొలువులోని గొప్పతనమైనా తెచ్చుకుంటేకాని రాదన్నాడు గొప్పతనము మనము తెచ్చుకోవాలి.

వీర — కుండలోకి కూర తెచ్చుకోలేనివాడవు నీవు గొప్పతన మెలా తెచ్చుకుంటావో చెప్పు విని సంతోషిస్తాను. నాకుగూడా గొప్ప వాడిని కావాలని అందల మెక్కవలెనని యున్నది నీధర్మమా అని గొప్పవాడినగుతాను. ఆకాస్తా చెప్పేశెయ్యి.

పేర — అయితే చెపుతాను విను. ఈరోజులలో ప్రతిచోట్ల మీటింగులు మీటింగులని చెప్పుకొనుచున్నారు విన్నావా?

వీర — అవా! వింటున్నాను. మన గ్రామములో జరిగేవాటిని చూస్తున్నాను.

పేర — ఆమీటింగులలోకి మనము వెళ్ళి సభలో పెద్దవారికో సము వేసినది పెద్దఅరుగులా వుంటుంది, దాని పేరేదో అంటారయ్యా! పేటుఫారమో యేదో అంటారు. దానిమీదకు వెళ్ళి అక్కడ మనము కూర్చోవాలి. దానితో కొంత గౌరవము వస్తుంది.

వీర — ఓరి నీయింటపటారుగాను ఆపేటుఫారముమీదే మనము కూర్చోడం ఆసభలోకి వెళ్ళి క్రిందైనా కూర్చోడానికి తాహతులేని ముండాకొడుకులకు మనము పేటుఫార మేమిటిరా. ఈమాసిపోయిన కుళ్ళుగుడ్డలు నీవు వెళ్ళావంటే వీడు దగ్గరనా వస్తే కలరా వస్తుందని జుట్టుపట్టుకొని బరబర లాగి వీధిలో గూర్చో పెడతారు. నక్కయెక్కడ దేవలోక మెక్కడరా.

వేర—ఓరి మట్టితలవీనుగా. ఇందుచేతనే నీవు నామరూపాలు లేకుండా ద్రేపివై పడియున్నావు సభలోకి యీలాగే వెడతాననుకున్నావూ. చాకలిపకీరుగాడు చల్లగావుంటే మనకు బట్టలకు లోపమట్రా. వెత్తివెదవవై జరీపాగాలు ఆల్పాకాకోట్లు పట్టుకండువాలు తెల్లషల్లు తాసులు చాలాడబ్బు కర్చుపెట్టి కొనుక్కొ—నేవాళ్ళున్నారంటావా లేరంటావా వాళ్ళుమనకోసము కొంటున్నారుకాని వాళ్ళకోసమట్రా నాయనా పకీరుగాడికి నాలుగు బట్టలకు నాలుగుడబ్బులు మనవిగావని పారేశీనామంటే పట్టాభిషేకానికి తీసుకొనువెళ్ళే మహారాజుకొడుకులా గుండమట్రా ఆ దిరేసు వేసికొని కళ్ళకి సుర్మాపెట్టి బూడ్సుజోడొకటి తొడిగికొని, ఎక్కడైనా కొంచెము లవండరు ముప్పైత్తి జేబురుమాలు మీదవేసికొని యెడమచేతితో వాసన చూచుకుంటూ, కుడిచేతితో యరువుబెత్తము చేత బట్టుకొని తాంబూలం ఝుణాయిస్తూ రోడ్డంట టక టక నడిచివెళ్ళి ప్లేటుపారముమీద కూర్చుంటే. అడిగేనిర్భాగ్యుడెవడురా. మనలనుజూచి యేజమీందారో యేహైకోర్టువకీలో యేయీనాందార్రో అని దిగాలబడి చూచేవాళ్లేకాని నోరెత్తెవొగాడెవడురా అక్కడికొచ్చే పెద్దమనుష్యులలో సుప్రాతిక మంది మనవలెనే మేడి పండువాటము పెద్దమనుష్యులే.

వీర—ఓరి ముండావాడా! నీవు గుండెలుతీసిన బంటవురా. ఇంత ధైర్యముమాత్రము నాకు రాదు.

వేర—ఓరి జైనుపీనుగా నీవు వట్టి అప్రయోజకుడవురా, నీకు చేతకాకపోతే నీకుకూడా పకీరుగాడితో చెప్పి బట్టలిప్పిస్తాను, నావెనకాలే వుండు, ఈమాత్రము ధైర్యము లేకపోతే ప్రపంచకములో బ్రతకడ మెల్లాగురా, వెనక నేను పెద్దాపురంలోనుండి మెట్టదారిని వెళ్ళుచు రాజానగరంలో రాత్రి ఆగవలసివచ్చి పోలీసుయినస్పెక్టరునని చెప్పి వూళ్ళోవాళ్ళనందరిని గడగడలాడించి పాలుపెరుగులు కాయించి తెప్పించి

జరాయించి విందు చేయించినాను, నేనే కాకుండా నాతో వచ్చిన నలుగురు బావనకుంతలకు గూడ సుష్టుకర్తుగా భోజనం పెట్టించినాను, ఇలా టదాల్లో నా ధైర్య మసాధారణమైనదే

వీర—అబ్బో నీప్రజ్ఞెక్కడ నీవెక్కడ నీకిఅఖండచండాలమార్గాలశక్తిరానాయినా నీశక్తిసామర్థ్యాలు మూసుకుమ్మంటే వస్తాయా.

పేర—కావుగనుకనే వచ్చినట్లు నేను చెప్పినట్లువిను.

వీర—వింటానునరేకాని నీవు చెప్పిన సన్నాగము మావూళ్లో మీాటింగైనప్పుడు పనికివస్తుంది. రైలుఖర్చులుపెట్టుకొని పడవఖర్చులు పెట్టుకొని మనము వెళ్ళగలమా. దానికయ్యేఖర్చు మనదగ్గరుంటే పది రోజులు మనయింట్లో బియ్యము వస్తాయి.

పేర—వెళ్ళగలిగినప్పుడు చేతిలో డబ్బున్నప్పుడు వెడదాము డబ్బులేనప్పుడు మానివేదాము.

వీర—మానివేస్తే మనకు గౌరవమెల్లావస్తుంది.

పేర—దానికూడా కొన్ని వుపాయాలాలోచించే పెట్టినాను. మీావలెనేను మట్టితల పెద్దమ్మ ననుకున్నావా యేమిటి ఏమీాటింగుకయినా మనము వెళ్ళలేనపుడు మూడుపావలాలడబ్బులు మనవికావంటే సరి

వీర—మూడుపావలాల డబ్బులేమిటి నాకర్థంకావడములేదు. మూడుపావలాల టోపీయొకటి క్రొత్తది కొనుక్కొని వచ్చినట్లున్నావు.

పేర—ఈరోజున క్రొత్తగా కొనుక్కురాలేదు. మొదటినుంచి మనదగ్గరనున్నదే. నీకు తెలియదుగనుక చెపుతున్నాను విను. మూడు పావలాల డబ్బులుఖర్చుచేసి ఒకటెలిగ్రాము కొట్టవలెను. ఆటెలిగ్రాములో "సభకు నేను రాలేనందుకు చాలవిచారించుచున్నాను. సభకు జయము కలుగవలెను" అనేమాటలు తప్పక యుండితీరవలెను.

వీర—అలాగు టెలిగ్రాఫిస్తే గొప్పతనమెల్లావస్తుంది.

వేర—అందులోనేయున్నదిరా నాయనా గొప్పతనము. ఆమీటింగులో చెక్కచేరిఅంటూ ఒకడుంటాడు లేకపోతే భోజనాలన్నీ పెట్టేటందుకు పెత్తందార్లుంటారు. దానిపేరు చనుమానసంఘమో యేదో అంటార్రా. వాళ్ళెవళ్ళో లేచి సభలో నిలుచుండి సభకు రాలేకపోయితిమని చెప్పి టెలిగ్రాపులిచ్చినవాళ్ళ పేర్లు వుత్తరాలు వ్రాసినవాళ్ళ పేర్లు చదువుతారు. మహాళయంలో తర్పణాలసమయంలాగ ఆసమయంలో టెలిగ్రాపిస్తేనూ మనపేరుగూడ అక్కడుదహరిస్తారు. అదే గౌరవసంపాదన. గౌరవమంటే వేరేవున్నదా. వేయిమందిసభలో మనపేరు చెప్పుకోవడమే గౌరవము.

వీర—బాగానేయున్నది కాని మనదగ్గర ఆ మూడుపావలాల డబ్బులుగూడ లేకపోతే గతేమిటా అని సందేహము తోస్తుంది.

వేర—"శతకోటిదరిద్రాణాం అనంతకోట్యుపాయాః" అని యొకసామెతున్నది. శతకోటిదరిద్రాలకు అనంతకోటి ఉపాయాలుంటాయని దీనిఅర్థం. దీనికూడా ఒక గత్యంతరము నేను కల్పించకలను కాలముకాని కాలములో బుట్టినానుకాని వెయ్యేళ్ళకుముందు పుట్టినట్లయితే కుడిచేత్తో యెడమచేత ధర్మశాస్త్రములు వ్రాసిపారేసి నీవంటి వెఱ్ఱివెధవలచేత కాళ్ళు పట్టించుకోపోదునా దానికేమిగాని ప్రస్తుతం చెపుతాను. నీదగ్గర మూడుపావలాల డబ్బులు సమయానికి లేకపోతే నాలుగుడబ్బుల కవరుకొని ఒకవుత్తరం పారేయించు మనఖజానాలో అంతమాత్రం దమ్మకూడా హాజను లేకపోతే ఆముక్కలే ఒకకార్డుమీద వ్రాసిపారేసి పోస్టులో జారీచేయించు. దానితడాఖా అంతా అర్థణా బిళ్ళతో జమాయించిపోతుంది.

వీర—భేష్. బాగావుందిరా నీవుపాయం. కాని యీమీటింగుకు రాక టెలిగ్రాపులు ఉత్తరాలు వేసేవాళ్ళంతా మహోపాధ్యాయులే అంటారేమిటి.

పేర—అబ్బెబ్బే. కాదుకాదు కొందరు గొప్పవాళ్ళు నిజముగా రావడానికి వీలులేక టెలిగ్రాఫులు ఉత్తరాలు వేస్తారు. వాళ్ళు మన సహాధ్యాయులుకారు. కాని అందులో మనగోత్రకులుకూడా కొందరుంటారు. ఇందువల్లనే నేడు రావాలనే మహానుభావులు. అప్పుడు మనముకూడా ఒక టెలిగ్రాఫో ఉత్తరమో పారేస్తిమా వాళ్ళతోపాటు మనకుకూడా తిలోదకాలు ముడతాయి.

వీర—నీవు చెప్పిన యుపాయాలన్నీ నా తలకు బాగా నచ్చినాయి. ఇకముందునుంచి అల్లాచేస్తాను. కాని ఒక చిన్న చిక్కు సంభవించేటట్టు కనబడుచున్నది. నీవుగాని నేనుగాని స్వయముగా వ్రాయలేము. ఎవరినైనా వ్రాసిపెట్టుమనవలసి వస్తుంది.

పేర—వస్తే తంటాయేమిటి వ్రాసిపెట్టేవాళ్ళంతా మన గుమస్తాలనుకో. మనము జమీందారులము దొరలము.

వీర—నీవు అఘటనఘటనా సమర్థుడవు నీవు యేలాగుపడితే ఆలాగు సమర్థించగలవు. ఇప్పుడు కల్లపురములో వంట్లబ్రాహ్మణుల మహాసభ జరుగుచున్నది. అక్కడికిరాలేమని ఒక టెలిగ్రాము పారేద్దామురా. (అని యిద్దరు నిష్క్రమించుచున్నారు)

---

## ల బ ల బ లు

### మొదటిరంగము

### కంసాలిదుకాణము

(నాగలింగమను కంసాలియు జోగన్నయను బ్రాహ్మణుడును ప్రవేశించుచున్నారు)

నాగ—జోగన్న బావగారూ మీయభిప్రాయమేమిటో పూర్తిగా సెలవివ్వండి, నీళ్ళునములుచు మాట్లాడితే అర్థముగాకుండా యున్నది.

జోగ—అభిమానాని కేమున్నది నన్నొక యింటివాణ్ణి జేసి రక్షించవలసినదని నాకోర్కె. మహారాజువు వంశము నిలబెట్టిన ప్రఖ్యాతి ప్రతిష్ఠ నీకుంటుంది.

నాగ—(నవ్వి) సన్యాసిగాడి పెళ్ళికి పుట్టుదగ్గిరనుంచి మెరుప సున్నట్టు నీకన్నీ మెరుపే గావలెను. ఇల్లా వాకలీ పొలముపుట్రా, నగా నట్రా యేమీలేదు. పైగా చుట్టం పక్కం యెవరూలేరు. పట్టుమంటే పది కొత్తడబ్బులులేవు నీదగ్గిర. నీకుపిల్ల నెవరిస్తారయ్యా యేమిచూచి యిస్తారు. డబ్బుచూసిమ్మంటావా రూపంజూసిమ్మంటావా చదువు చూసిమ్మంటావా పరువు ప్రతిష్ఠాజూసిమ్మంటావా, వయెస్సుజూస్తే 60 సం॥రములు దాటినవి. అందంజూస్తే అష్టావక్రుడవు. పగలుజూస్తే రాత్రి కల్లోకొస్తావు. నీకు పెళ్ళేంటయ్యా నామొకం. నిన్ను పెళ్ళి చేసుకునేపిల్ల జిల్లేడుపువ్వులు పూజచేసుకుని వుండాలి. నీచెట్టపడితే పడేసుఖం యింతా అంతాగాదు. పిల్ల రెండుచేతులా భోంచేస్తుంది.

జోగ—ఇల్లా వాకిలీ పొలము పుట్రా చదువు సంధ్యా వున్న వాడికి యెవరుబడితే వారే పిలిచిపిల్లనిస్తారు. వారికి వరదక్షిణిచ్చి కాళ్లు గడిగి పెళ్ళిచేస్తారు. నావంటివాడికి పిల్లనిచ్చేవాళ్ళుండరు గాని వాడికేలు. ప్రయోజకత్వంవుంటే నీకాళ్ళూ నీకడుపులూ పట్టుగోవడమెందుకు యేప్రజ్ఞేనావుంటే నిన్నాశ్రయించడమెందుకు పెళ్ళిగానివాడికి పెళ్ళి జేసితేనేగొప్ప. నూరుకల్లలాడి వొక యిల్లు నిలుపమన్నాడు. అందుచేత నాకీవుపకారం చేసి యీకీర్తి మీరుపొందాలి.

నాగ—నిజమే పాపం నీవంటివాడికి పెళ్ళిచేసితే పుణ్యముంటుం దన్నమాట నిజమే. కాని చూసిచూసి నీకెవడిస్తాడయ్యా పిల్లని. అబద్ధమాడినా నమ్మాలిగదా 'సీతారామా భ్యాన్నమః' అంటేనేగాని నీకు పూట గడవదు. చస్తే దర్మకర్మసి తగలెయ్యాలిగాని వేరే దిక్కులేదు. అటువంటి పెళ్ళాంనుంచడానికి నాలుగుమూరాయలు మనవర్తిచ్చే ఆధార మైనాలేదు.

జోగ—నీవుచెప్పే మాటలన్నీ నిజమేబావా. ఈలాటివాడికి పెండ్లిచేస్తేనే నీబుద్ధికుశలత కనపడాల నీవుయుగంధరుడంటివాడవు తలుచుకున్నావంటే కార్యం నెగ్గించి తీర్తావు. ఇవి చేతులుగావు కాళ్ళు. ఆమూడు ముళ్ళూ వేయించి నన్నొక యింటివాణ్ని చెయ్యి గంగయ్యశాస్త్రుల్లుదగ్గిర పన్నెండేళ్ళ పిల్ల గుజ్జంబావుంది. పెళ్ళయిన ఆరుమాసాలికల్లా కాపరానికొస్తుంది పది మందిచేత చందావేయించినాసరే యేలా చేయించినాసరే ఆపిల్లను నాకిప్పిస్తావా నీకెంతో పుణ్యముంటుంది. మహారాజువు కొడుకుడితే నీపేరెట్టుకుంటాను. యింకో జన్మానికి నీయింట్లో కుక్కనై పుడతాను

నాగ—గంగయ్యశాస్త్రులు కూతుళ్ళందర్ని వెయ్యేసిరూపాయిలకి అమ్ముకున్నాడు ఆయన కింతవరకారుగురు కూతుళ్ళు పుట్టినారు. ఆయన తర్చుగా పెళ్ళాన్ని పిలిచి "వోసీనీబొజ్జ వరహాలబొజ్జే అందరి నీకూతుళ్ళనేకంటున్నావు యింకా పదిమందికూతుళ్ళను కంటివా మనిల్లంతా బంగారమైపోతుంది" అంటూవుంటాడు. యిదివరకు నలుగురు కూతుళ్ళనునాలుగు వేల కమ్మినేసేడు. ఒకల్లు డెబ్భై యేళ్ళవాడు, రెండవవాడు వంటబ్రాహ్మడు మూడవవాడు నీళ్ళబ్రాహ్మడు నాలవవవాడు పీనుగుల మోతగాడు. నీదగ్గిర వెయ్యిరూపాయిలుంటే వాడిపిల్లవస్తుంది చందా వెయ్యిరూపాయి లెవడిస్తాడు. నూరూ యేభై గనుకనా?

జోగ—ఈగ్రామంమీద వెయ్యిరూపాయిలు చందాగావూ? పెళ్ళికార్యమంటే పుణ్యంగనుక చాలామందిస్తారు.

నాగ—వెయ్యిరూపాయిలుకాదుకదా నూరైనా చందాగావు. చదువుకుంటున్నవాడు కుర్రవాడూ అయితే యెవళ్ళయినా చందాయిస్తారు. నీవు చేసేది యాయవారం తిరగటి గంట్లులాగ మొహాంన్నిండా మసూచికంమచ్చలు నువ్వూ ముప్పయ్యోపడ్డెల్లి నలభయ్యోపడొచ్చింది నీపెళ్ళికి చందాలంటే నలుగురూ మొహాంమీదుమ్మేస్తారు.

జోగ—అయితేయిహ ఆశవదలుకోవలసిందే? ఘోటకబ్రహ్మచారినై యిలాచావవలసిందే?

నాగ—మిమ్మల్ని చూస్తే జాలేస్తుందయ్యా పాపం మీదగ్గర యేమాస్తుందండి ఒక యకరంభూమైనా వుందా.

జోగ—వున్న భూమి శ్మశానభూమె అంతకన్నేం లేదు. నాదగ్గర ముష్టెత్తుకొనె రాగిచెంబుంది.

నాగ—సరే ఆబియ్యంకండువాలో పోసి మూటకట్టుకొని ఆరాగిచెంబిలాపారెయ్యవయ్యా.

జోగ—రేపటినుంచి ముష్టెలాయెత్తుకోను.

నాగ—ముష్టిమానేసెయ్యి రూపాయిచెల్లగా రూపాయి నేనిస్తూవుంటాను. అదిపెట్టి వరుకులుకొని తింటూవుండు. బట్టకు రెండబ్బులిస్తె చాకల్ది పడిదికిస్తుంది తెల్లనిబట్టలు కట్టుకుంటూవుండు. ఆపయిని కార్యంచెప్తాను.

జోగ—చిత్తం చిత్తం అలాగే యిదుగో చెంబు.

(అని యిచ్చుచున్నాడు.)

ఇద్దరు నిష్క్రమించుచున్నారు.

---

## ౩ వ రంగము

(నాగలింగము గంగయ్యశాస్త్రి ప్రవేశించుచున్నారు.)

నాగ—ఏమండి గంగయ్యశాస్త్రుల్లుగారూ యిల్లాదయచేశారు బహుకాలదర్శనం. ఊరక్కరారుమహాత్ములన్నట్టు యేదోపని యుంటే నేకాని తమరు దయచెయ్యరు.

గంగ—ఊరికినే వచ్చాను కొంచెము పనియుండి వుదుచేరినా నొకటి చేసిపెట్టాలి.

నాగ—మాపిన్నమ్మగారికేనా యేమిటి?

గంగ—ఆ మీాపిన్నమ్మగారికే. ఎనిమిది కాసులనాను రెండు కాసుల జిగినీ చెయ్యాలి. 15 రోజులలోపుగా మాకియ్యాలి. మా వాళ్ళపెళ్ళికి వెడతారు అప్పటికి తయారుకావాలి.

నాగ—అలాగే తమ సెల వైల్లాగయితే ఆలాగే, 15 రోజు లెందుకండీ వారమునాటికి తయారుచేస్తాను. లగ్గసరికూడా తగ్గింది. ఇప్పుడుచేతిలో పనులాట్టేలేవు. ఒక బంగారు గొవతాడుమాత్రముంది. అదిచాలమట్టుకు తయారై పోయింది.

గంగ—గొవతాడెవరిది? ఈరోజులలో గొవతాడు పెట్టుకునే వాళ్ళట్టే కనబడరే.

నాగ—ఉన్నాడొక మహానుభావుడు. అయనపేరు చెప్పడానికి వల్లకాదు.

గంగ—చెపితేనుయ్యా! ఇదేమి దొంగతనమా? లంజతనమా?

నాగ—దొంగతనముకాదు, లంజెతనముకాదు. కాని తన పేరె వరికి చెప్పవద్దని నాచేత వట్టుపెట్టించుకొన్నాడు. నిష్కారణంగా ఆయన పేరు మీాతోజెప్పి పెట్టుకొన్నవొట్టు తప్పడమెందుకు?

గంగ—ఒంటిమీాద పెట్టుకునేవస్తువుగదా దీనికింత రహస్య మెందుకు? మొలని పెట్టుకుంటే పదిమందీచూడరా అప్పుడురహస్యము బయలుపడదా.

నాగ—బయలుబడుతుంది పడకేమి. కాని ఆయన యీవస్తువ రహస్యంగా రాత్రులు పెట్టుకుని అప్పుడే తీసివేస్తాడట. తానుచూచు కొని ఆనందించవలెనని ఆయన సంకల్పముకాని ఒకరుచూచి ఆనందించ వలెనని ఆయన సంకల్పముకాదు.

గంగ—ఈయనచూస్తే విపరీతపుమనిషిలాగున్నాడు.

నాగ—అవును. విపరీతపుమనిషే. ఈయనసంగతి చెప్తాను విను. ఈయనదగ్గర సొమ్ముమూలుగుతూంది ఈయన అంగవస్త్రమే కాని కట్టుకోడు. ముష్టికూడే కానితినడు. పెండ్లిచేసికొనే వయసున్నది కాని పెండ్లిచేసికొనడు. పోనీ ఉన్నసొమ్ము వడ్డీకైనా యివ్వడు. ఇంత పిసినిగొట్టుమనిషిని పృథివిపుట్టిన తరువాత యెప్పుడూ చూడలేదు.

గంగ—నిజంగానేనా? ఇల్లాంటిమనిషుంటాడటయ్యా! పెళ్ళి చేసికొనకపోవడం ఖర్మమేమి.

నాగ—పెళ్ళిచేసుకుంటే పిల్లనిచ్చేవాళ్ళు వెయ్యో రెండువేలో తెమ్మంటారు. పెళ్ళాన్నిపోషించాలి. అందుక్రింద సొమ్ముఖర్చయి పోతుందికదా ఖర్చుగిట్టకను పెళ్ళిచేసికొనకపోవడం.

గంగ—(బుర్రమీద చేతులువేసుకొని) లోకములో యెల్లాటి మనుష్యులయినా యుంటారు. వీడెవడో వెఱ్ఱివాని లాగున్నాడు పోనీ వడ్డీకైనా యెందుకిచ్చుకోడు డబ్బు. అందువల్ల వృద్ధవుతుందిగా.

నాగ—వడ్డీకిస్తే పైవాళ్లు భాగ్యవంతులనుకొని పోతారొకటి. రెండవది దొంగపడతారనుభయం.

గంగ—ఈమహానుభావుడు పేరేమిటో ఒక్కమాటు చెవినేస్తూ బాబూ. చెప్పకపోతేవట్టు. నన్ను చంపుకున్నట్టేనరి.

నాగ—బాబుగారూ నామనవిని నన్నొదిలేస్తురూ. దొంగ మోటం పెట్టకండి.

గంగ—దొంగమోటమేమిలేదు, గిగమోటమేమిలేదు. చెప్పక తప్పదు. చెప్పకపోతే నీవు కాశీలో గోహత్య చేసినట్టే.

నాగ—మాచెడ్డచిక్కు తెచ్చిపెట్టారేనాకు. మీరూ నేనూ ఒకకుటుంబములోవాళ్ళలాగున్నాము గనుక చెపుతా వినండి ఎక్కడా చెప్పనని చేతిలో చెయి వెయ్యండి!

గంగ—ఎక్కడా చెప్పను (అని చేతిలో జేయివేయును.)

నాగ—(రహస్యముగా) ఆ బ్రాహ్మణుడు నాప్రాణాని కిసూరిగ మంటాడు సుమండీ తెలిస్తేను. చెప్పకండెక్కడా. మనవూళ్లో ముష్టెత్తుకుంటూన్నాడే జోగన్న నే బ్రాహ్మణుడు ఆయనే యీయన.

గంగ—(ఆశ్చర్యముతో) ఏమిటీజోగన్నా. వాడిదగ్గరడబ్బుందీ. ఏమాటలోయి యివి. ఈసంగతి మనిషైనవాడు నమ్మడు.

నాగ—నమ్మరని నాకూ తెలుసును. మీరందరు నమ్మకపోవా లనే ఆయనకోరికకూడాను.

గంగ—ఏమాత్రము డబ్బుం దలాయితేను.

నాగ—డబ్బుగిబ్బు నేనెఱుగను ఇరవయి బంగారపు కణికెలున్నవి కణికెవక్కంటికి 50 తులాలు. తులం యిరువయిరూపాయిలు కాడికి చూసుకున్నా కణికె వెయ్యిరూపాయలుఖరీదు. కణికెలన్నీ 20 వేలకిమ్మత్తున్నవి అంతామేలిమిబంగారం. నోపతాడుకోసమిచ్చినబంగారముకూడా అందులో ఒకకణికెలోముక్క.

గంగ—ఎక్కడిదీ బంగారము వీడికి? సంపాదించాడా? ఈ డబ్బుండీ యీముష్టిఖర్మ మెందుకు వీడికి?

నాగ—సంపాదించడానికి వాడితరమా వాడితాతతరమా? పూర్వము పెంటపాడులో వీడు కాపుర మున్నపుడు బంగారపు కణికెలతో నిండియున్న బిందెలు పాదుకోసం తవ్వుతూంటే రెండుదొరికినవి తెలిస్తే సర్కారు సొమ్ము పుచ్చుకుంటారని ఆయింటివాళ్లు సొమ్ము తెమ్మంటారని భయముచేత ఆబిందులు అర్ధరాత్రివేళ పట్టుకుని మెల్లాగా మనగ్రామములో వచ్చిపడ్డాడు. పూర్వపుముష్టి మానివేస్తే అనుమానపడతారని యింకా ముష్టియెత్తుచున్నాడు.

గంగ—అత్యాశ్చర్యముగా నున్నది ఇంతకూ వాడదృష్టము బాగావుంది. అయితే పెళ్లిచేసుకోమని చెప్పరాదూమీరు.

నాగ.—చెబుతూన్నానండీ యెన్ని చెప్పినా వినడు. డబ్బుఖర్చు వుతుందని బెంగ.

గంగ.—ఎల్లాగైనా మెడలువిరిచి చేయిస్తూ నాదగ్గిర 12 ఏళ్ళ పిల్లయున్నది. ఏడాదినాటికి కాపురానికివస్తుంది నేనిస్తాను.

నాగ.—వినడుగాని చెప్పిచూస్తాను. అయితే మీరు కన్యాదానం చేస్తారా యేమిటి.

గంగ.—లేని ముండాకొడుకుని నేను కన్యాదానం చేయగలనూ.

నాగ.—అయితే యేమియ్యాలనుంటారు మీరు.

గంగ.—మహారాజువు నాగలింగంచూడూ నీకూ నాకూవున్న స్నేహాన్నిపట్టి రెండు కణికెలు నామొగాన్ని పారవేయించు పిల్లనిస్తాను. నీవెల్లాచెబితే ఆలావింటాడు.

నాగ.—అమ్మో రెండుకణికెలే. ఒక్క కణికెకన్న యెక్కువియ్యడు. దానికె నల్లమేకను బలిపెట్టాలి.

గంగ.—బాబువుగాదూ నామనవి విను. అతనిని ఒక యింటివాడిని చేసినవాడవు అవుతావు. నాదరిద్రము తీర్చినవాడవు అవుతావు అల్లాచేయించు.

నాగ.—సరే, ఎల్లాగో చెప్పి యిప్పిస్తాను. రేపు రాత్రిరండి. కణికలుచ్చుకుని తాంబూలాలిప్పిస్తాను.

గంగ.—సరేబాబూ. నీ మూలాన్ని తేల్తాను. రేపురాత్రి వస్తాను. (అనియిద్దరు నిర్గమింతురు.)

## 3 వ రంగము

(గంగయ్యాయు పేరుభట్టను బ్రాహ్మణుడు ప్రవేశించుచున్నారు)

పేరు—గంగయ్యాగారూ! మీపిల్లవాన్ని జోగన్నకిచ్చి వివాహము చేస్తారు షేమిటి?

గంగ—అవునండి ఆలాగే నిశ్చయించినాము.

పేరు—బాగుంది సంతోషించాను. (అని మెల్లగా) ఇచ్చిపుచ్చుకోడాల్లో యేమైనా బాగాసరళిగావుందా మీ మూడోపిల్లదానికి రెండోపిల్లదానికి బేరం నాద్వారానే ఫయిసలయింది గనుక అడుగుతూన్నాను. నీకు పది రూపాయిలొచ్చాయంటే నాకు పరమానందం.

గంగ—ఇచ్చిపుచ్చుకోడాలేమిలేవు. కాకపోయినా యివ్వడానికి జోగన్న దగ్గర యేముంది మీ రెఱుగరూ.

పేరు—పైకి యేమీ లేనివాడులాగే యున్నాడు. కాని యే పుట్టలో ఏపాముున్నదో యెవరికి తెలుసును? అందుకుచేత నేమైనయిచ్చాడేమో యని కాకపోయినా యిదివరకు నలుగురు పిల్లలను యేదో విధంగా రొక్కానికే యిచ్చివేశారు గనుక ఈపిల్లని మాత్రము ఇవ్వరాయని నాకు నమ్మకం.

గంగ—అటువంటిదేమీ లేదు. ఇదివరకు పెద్దపిల్లలు నలుగిరి దగ్గర డబ్బుపుచ్చుకొని నరమాంసవిక్రయము చేసినానని నాకు మనస్సులో కించ వున్నది. అందువలన మాపెద్దలకు మంచిగతులు కలగాలని పెళ్ళికొడుక్కి కాళ్ళుకడిగి కన్యాదానము చేయవలెననినా యుద్దేశ్యము.

పేరు—ఓహో మంచిపని చేస్తూన్నారు కాని అంత కన్యాదానం చేయదలచుకొన్నపుడు ఈముష్టి నిర్భాగ్యుడ కియ్యకపోతే కాస్త నోన్నదకాలున్నచోట యియ్యరాదూ.

గంగ—అనోన్నదకాలున్నవాళ్ళకి పిల్ల నెవరుపడితే వారిస్తారు

పెండ్లి చేసికొగలవాడికి పిల్లనిస్తే అందులో విశేషమేమున్నది పొలము పుట్ర యిల్లు వాకిలి యున్నవాడి కెవరుపడితేవారు పిల్లనిస్తారు. అదేమీ లేనివాడికి ముష్టివాడికి పిల్లనెవరుయియ్యారు. అటువంటివాడికిస్తే నే కన్యాదానఫలం దక్కుతుంది అన్నమున్నవాడికి అన్నముపెట్టినా యిల్లున్నవాడికి గృహదానం చేసినా అగ్రహారీకుడికి భూదానం చేసినా ఫలమేమైనా దక్కుతుందా అలాగే కన్యాదానంకూడా కన్యయెక్కడ దొరకక పెండ్లిచేసుకుందు కాధారం లేకుండా వున్నవాడికిస్తే నే ఫలం దక్కుతుంది.

వేరు—ఈమోసరు కన్యాదాన మెక్కడాచూడలేదు. చాలా మంచిదే అయితే వివాహ మెప్పుడు.

గంగ—వివాహమా! రేపురాత్రి మీరుతప్పకుండా దయ చెయ్యవలె.

వేరు—చిత్తము తప్పకుండా వస్తాను. సెలవు పుచ్చుకుంటాను (తనలో) ఈదొంగముండాకొడుకున కింత పరమార్ధము కూడానా? ఏభూమో పుట్రో అమ్మించో తాకట్టుపెట్టిచో నంచో నంచిన్నరో గుంజుకుంటాడుకాని వీడు కన్యాదానంచేస్తాడా! అది వీడబ్బతరాన్ని తాతతరాన్ని కూడా లేదు.

(ఇద్దరునిష్క్రమించుచున్నారు.)

గంగయ్యగారియింట్లో పెండ్లిపందిరి.

(పెండ్లికొడుకు పెండ్లికూతురు గంగయ్య నాగలింగం కొందరు బ్రాహ్మణులు కొందరు ముత్తయిదులు ప్రవేశించుచున్నారు.)

బ్రాహ్మణుడు—గంగయ్యగారూ! పెండ్లి చాలా శోభస్కరంగా అయింది. కన్యాదానఫలం తమకు దక్కింది. ఆ బ్రాహ్మణుని యొకయింటివాడిని చేశారు.

గంగ—ఇంతసొద్దై పక్కృపల్లాగున్నది మనప్రయత్న మేమున్నది నాకు శెలవియ్యండి. అప్పగింతలకు వెళ్ళాలి (అని లోపలకు వెళ్లును)

(అప్పుడు ముత్తయిదు లప్పగింతలపాటలు పాడుచున్నారు)

ఒకముత్తయిదు—(మెల్లగా) కణికెలీ మాసొమ్ము కాంతమీా సొమ్మా. (అని చమత్కారముగా పాడును)

నాగ—(మెల్లగా) లబలబలు మీాసొమ్ము లక్ష్మి మాసొమ్ము.

గంగ—అదివిని (తనలో) లబలబలు మీాసొమ్ము లక్ష్మిమా సొమ్ము. అని నాగలింగం పాడుచున్నాడు. ఆశ్చర్యముగా నున్నదే. నాకు పెండ్లికొడుకుచేత యిప్పించిన రెండు కణికెలు నిజమైన బంగారు కణికెలగునా కాదా. నాకప్పగింతలు తోచడములేదు. (పురోహితుని చూచి) శాస్త్రిలుగారూ త్వరగా అప్పగింతలు కానియ్యండి. నాకేమో కాని కడుపు నొప్పిగానున్నది. కూర్చో లేకుండా వున్నాను. పెండ్లికొడుకుచేతిలో అప్పగించాము చాలదూ. తక్కినవాళ్ళ చేతిలో నెందుకు. (వెళ్ళును)

---

## రం గ ము

### కంసాలి మల్లేశలింగము యిల్లు

(రంగయ్య మల్లేశలింగం ప్రవేశించుచున్నారు.)

మల్లే—అదిగో బావగారు దయచెయ్యండి. ఏమిపనిమీాదదయ చేశారు.

గంగ—(రహస్యముగా) బావా! రెండు బంగారపు కణికెలు తెచ్చాను. ఇది మేలిమి అగునో కాదో తెగ్గొట్టిచూడాలి.

మల్లే—ఏవీ చూడనివ్వండి. (అనిపుచ్చుకొని) బావగారుపైకి మేలిమిలాగే వుంది. తెగ్గొట్టిచూస్తాను. (అని తెగకొట్టి) బావగారూ భేషైన రాగయ్య ఉద్ధరిణీలు చేయించుకో వచ్చునీారు.

గంగ—(గుండెబాదుకొని) అయ్యో అయ్యో కొంప మునిగి పోయింది. కొంపమునిగిపోయిందోయిబాబూ నాగలింగంగాను నాకొంప తీశాడురా నాయనా ? మాణిక్యమువంటి పిల్లని తీసికొనివెళ్ళి ముష్టి ముండాకొడుకు పొట్టని పెట్టేనురా తండ్రీ. పన్నెండేండ్లు పెంచాను. ఎవడికమ్మినకున్నా పన్నెండువంద లిస్తురు. ఎంతదండుగ ఎంతదండుగ ఎంతడబ్బుపోయింది. ఎంతమోసము చేశారు. హరిహరీ.

మల్లే—కన్యదాన మిస్తున్నా ననవటయ్యా నాతోటి.

గంగ—పరువుకోసము ఏడిశాను. ఇక నాకేమిగతి. నేచచ్చిపో తాను. నేను బ్రతకను. అయ్యో పన్నెండువందలు పన్నెండువందలు.

మల్లె—నోరుమూసుకొనివూరుకో. కన్యాదానఫలమైనాదక్కు తుంది. ఊరుకో వెళ్ళు.

(అని యిద్దరు నిష్క్రమింతురు)

---

## పూలమందిరము

అప్పులపాలెం జిల్లాలోనున్న సంగ్రామపుర నివాసులయిన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు గ్రామవజనము సకలవిషయ ములలోను పరస్పరాభివృద్ధి చేసుకొనుటకై యొక సమాజము స్థాపించు కొని ఆసమాజము నిమిత్తమై యొక మందిరము కట్టింప దలచుకొని యీక్రింది నిబంధలను కట్టుబాటులను నేర్పరచుకొనిరి.

1 ఈసమాజముపేరు పరస్పరాభివృద్ధి సమాజము.

2 ఈసమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము లేవనగా. ఒకరికి తెలియని సంగతులుమరొకరివల్ల వినుట పుక్కిటిపురాణములు స్వేచ్ఛ గా చెప్పుకొనుటకు యిండ్లదగ్గర చెప్పుకొనుటకు మాట్లాడుకొనుటకువీల్లు

లేనివంగతుల నిచ్చట జెప్పుకొనుట సమస్తవిధములయిన యాటలు
అనగా—జూదము, పులిజూదము, చెడుగుడి, ఉప్పట్లు, కోకు[illegible],
చీట్లాట, పోట్లాట, కాట్లాట, చదరంగము, వైకుంఠపాళి, దశావతారి
మొదలగునవన్నియు స్వేచ్ఛగా నాడుకొనుట.

3 పుస్తకములుగాని, వార్తాపత్రికలుగాని యీ సమాజము
నిమిత్తమెప్పుడును తెప్పించగూడదను, ఈ సమాజముయొక్క యేసభికు
డయినా తనయింటివద్దకు పత్రికలు తెప్పించుకొన్నాడని సమాజము
వారికి తెలిసినపక్షమున వెంటనే యాసభికుడు సమాజమునుండి తీసి
వేయబడవలసినది. మఱియు నేసభికుడయినను పొరబాటు చేతగాని
బుద్ధిపూర్వకమునగాని, నిబంధనలను యెరిగిగాని యెరుగకగాని యే
పుస్తకమునుగాని వార్తాపత్రికనుగాని చేతిలోగాని జేబులోగాని పట్టుకొని
సమాజమందిరము లోనికిగాని, ఆవరణలోనికిగాని, స్వయముగాగాని
యితరుల ప్రోత్సాహమునగాని ప్రవేశించిన పక్షమునగాని ప్రవేశింప
దలచిన పక్షమునగాని వెంటనే సదరు పుస్తకముగాని పత్రికగాని
సమాజపు బంట్రోతులు వాని చేతిలోనుండి లాగివేసి వాని నవతలకు
గెంటివేయవలసినది. ఈనిబంధనయున్న నిబంధనలలోనికి ముఖ్యమైనది.
కాబట్టి యీ నిబంధన నెవ్వరతిక్రమించగూడదు.

4 ఈ మందిరముగాని, దీని యావరణలో దేనిభాగముగాని,
పగలుగాని, రాత్రిగాని ఉదయముగాని, సాయంకాలముగాని, మధ్యా
హ్నముగాని, మరియేవేళప్పుడుగాని మీటింగు చేయుటకై యెప్పుడు
నివ్వబడగూడదు. మీటింగులవల్ల కలుగు నష్టములన్నిటిని యీ సమా
జము వారు లోకానుభవసిద్ధులగుటచే గ్రహించి యీ నిబంధనమును
లోకోపకారార్థమై యేర్పరచినారు గావున యీ నిబంధన నతిక్రమించిన
వారు సమాజమునుండి వెలివేయబడుదురు.

5 ఈ సమాజములోని సభికులకు నెల 1కి రు 0—1—9½ లు యిచ్చుకొనునట్లు చందాయేర్పరుపబడినది. ఈ చందాధనము చీట్లపేకలు కొనుటకు చదరంగబలములో విరిగిపోయినవాటిని తీసివేసి క్రొత్తవి దెప్పించుకొనుటకు అవసరమునుబట్టి అనవసరపు ఖర్చులు చేయుటకు ఆకాశరామన్న అర్జీలనిచ్చుటకు దొంగవుత్తరములు వ్రాయించుటకు నుపయోగించుకొనబడవలసినదేగాని మరొక విషయమై వినియోగింపబడగూడదు.

6 ఇందులో జేరినట్టి ప్రతిమెంబరు చుట్టకాల్చి తీరవలయును. ఒకవేళ నిదివరకు అలవాటు లేనివాడైనను నిందులో చేరిన వారము దినములలోపల నేర్చుకొనవలయును చుట్టకాల్చుట నేర్పుటకై యిద్దరు చుట్టల యుపాధ్యాయు లేర్పరుపబడినారు. ఈ యుపాధ్యాయుల బోధన వల్లగాని, స్వబుద్ధివల్లగాని, క్రొత్తగా జేరిన సభికుడు వారము దినముల లోపులో చుట్టత్రాగుట నేర్చుకోజాలని పక్షమున అతడు సమాజములో నుండి తీసివేయబడును. చందాధనములో మిగిలిన సొమ్మంతయు చుట్టలు త్రాగువారెక్కడబడితే నక్కడ యుమ్మివేసికొనుటకై పీకిదానులు కావలసియుండునుగనుక వాట్లనిమిత్తమై ఖర్చుపెట్టబడును.

బూతులు మేము మాటలాడెమని బింకములు బలుకునట్టివారును భోగముమేళములు చూడమనినట్టివారును యీసమాజములో నెన్నడు సభికులుగా జేర్చుకొనబడజాలరు. ఏలననగా అప్పుడప్పుడు యిక్కడ మేజువాణీలు జరిగించుకొనుట ఈమాటలామాటలననుండ నోటికివచ్చిన మాటలెల్ల నాడుకొనుట యీ సమాజముయొక్క ముఖ్యోద్దేశములు కాబట్టి సంగ్రామపురమునందు కాపురమున్న జనులందరు యీ సమాజములో తప్పక చేరవలయునని కోరబడుచున్నారు. ఇంతకంటె ఆనందకరమైన సమాజము యింతకంటె నుపయోగకరమైన సమాజము స్థాపించుటకు ప్రపంచములో వీలులేదుగనుక యిది తమపాలిటి భాగ్య

దేవత యని తలంచుకొని దీనిని పురజనులందరు అభివృద్ధిచేయుదురు గాక.

ఈక్రిందసామెత లెందుకు బుట్టినవో మనసామాజికులు పూర్ణముగా విమర్శించుచు చక్కని యుపన్యాసములుకూడ నిచ్చుచుందురు.

తంజావూరుసత్రము, చిదంబర రహస్యము. ఏదో కుంభకోణము, చెన్నపట్నపుటోసి, కంచిగరుడసేవ, తిరుపతిమంగలిక్షౌరము, నెల్లూరి నెరజాణలు, రావూరి రసికులు, బందరు బడాయి, తణుకభిమానము, ఐతంపూడి యుద్యోగము, గోలకొండకబుర్లు లేణుకోయి మాచవరం, పుల్లాయవేమవరం, గునుపూడిజంగాలు, పెంటపాడు బైరాగులు, కొండవీటి సీమచేంతాడు, కొల్లేటిదోమలు, కలువాయి. వేదాంతము, శ్రీరంగనీతులు, ఒంగోలుజంగాలు, ద్వారపూడి పచ్చిపాళ్ళు, చిక్కవోలుతూము, కూచిపూడి భాగవతులు, ఆడ మళయాళము, బల్లిపాడు పెళ్ళిళ్ళు.

---

## కావలెను "నభ్యులు" కావలెను!

...చూచి భయపడేవారు, దౌర్భాగ్యపు పనులు చేయుచు జాబుగా తిరిగేవారు, తానె గొప్పవాడనని భావించుకొని గర్వముచే విఱ్ఱవీగుచు తలకుదగని వేషములువేసి జనులను మోసముచేయుచు ధన మార్జించువారు, దొంగభక్తులు మాయమాటలుచెప్పి నీతిమాలిన పనులుజేయుచు ఉదరపోషణ గావించుకొనువారు, ధర్మోపన్యాసముల జేయుచు న్యాయమార్గమున సంచరించువారువలె కనబడుచు అవినీతి కార్యంబుల చేయత్వరపడువారు; త్రాగుబోతులై, జూదరులై, ముండల

నుంచుకొని రోగములచే తీసుకొనుచు పెద్దవేషములు వేసి. ఉద్యోగస్థుల మనియు, జమీందార్లమనియు, షాహుకారులమనియు భాగ్యవంతుల మనియు గర్వపడు మహానుభావులు ఇతరులపై లేనిపోని నేరములు గల్పించి కలహించువారు, ఒకరికొకరికి తంత్రములుపన్ని కలహమును గల్పించువారు, ఏయవనీతిపనియైన జేసి కుటుంబమును బోషించుకొన్న వాలునని చెప్పి యితరులచే నట్టి యవనీతిపనుల జేయించుచు వారివలన గౌరవము నొందుచుండువారు ఎల్లప్పుడు తిట్లయందే కాలముగడుపు వారు, పిత్రార్జితములైన భూములనమ్మి ముండలకు సొమ్ము కొల్లబెట్టి తినతిండిలేక కడుపు చేతబట్టుకొని దేశాంతరముల కేగినవారు తుంటరులైన గొప్పవారితోను జమీందారులతోను గలసి తుంటరిపనులచేయుటయే గొప్పయని నమ్మివర్తించు పండితులు, గావలెను ధనముగలవారి పజ్జచేరి వారిహృదయము నాకర్షించి తుదకువారిని భిక్షకులుగాచేయుచు పండితులమని చెప్పుకొను తుంటరులును కావలయును. ఎల్లప్పుడువీధులవెంబడి సంచరించుచు చూచినస్త్రీని మోహించుగొప్పవారు, గొప్పవారికి కోపమువచ్చునేమోయను భయముచేత వారుచెప్పినదుష్కార్యముల నాచరించు కొద్దివారు కావలయును. అబద్ధములాడి దొంగపత్రముల వ్రాసి, దొంగసాక్ష్యములిచ్చి సంసారము పోషించుకొనుచున్న వృద్ధులు యౌవనులు గావలయును తాగకూడదనియు, తుంటరిపనులు చేయకూడదనియు, నీతిగా నుండవలెననియు జెప్పు దుర్మార్గులు తుంటరులు నీచులు త్రాగుబోతులు కన్నగాండ్రు, ముండల ముతాకోరులు నైన బియ్యేలు ఎంయేలు, న్యాయవాదులు కావలయును. ఇట్టివారు దేశమును బాగుచేయువారు కావున వీరినిమానసమాజములో జేర్చుకొని వీరికి తగిన బహుమానములనిచ్చి సత్కరించుచుందుము. త్రాగుబోతులైన కవులకు నుద్యోగస్థులకు వారి వారికి తగిన మరియాదల చేయుచు ఆదరింతుము. ఇట్టివారిని పోషించుటకై పదికోట్లరూపాయలు మూలధన

ముతో సమాజము బయలుదేరతీసినాము. ఈసమాజమువారు లోకములోగల లోటులనవరించి దేశమును క్షేమకరమైనదిగా జేయుదురు గావున నందరు తమపిల్లలనుబుద్ధిలేక పాడై పోయేవారిని యీసమాజములో జేర్చి బాగుచేయవలయునని కోరబడుచున్నారు మేము కేవలము లోకము నుద్ధరింపవలయుననియే ఈసమాజమును స్థాపించుచున్నాముగాని స్వలాభము కోరిగాదు ఇందుచదువుకొన్నవారును న్యాయవాదులును, ఉద్యోగస్థులున్నారు. జమీందారులున్నారు భాగ్యవంతులున్నారు కావున చేరేవారు సంశయింపబనిలేదు. త్రాగుడు, జూదము, తుంటరితనము బాగుచేయుటకుముఖ్యమైనవి గనుక గొప్పవారిలో ననేకులు ఎట్టిపనుల చాచరించుచుండుటవలనను, ఈసమాజమునకు మంచిపరువువచ్చుననే యాశతో దీనిని స్థాపించినాము గనుక తప్పక చేరవలయును బాలురుచేరేయెడల ఈసమాజములో చేసెడు తుంటరిపనులుచూచి యింటిలోనుండి కాటికికాళ్ళుజాపుకొన్న ముసలి తలిదండ్రులుగాని పోషకులుగాని యేమైనా అంటారేమో అన్నభయమక్కరలేదు. వారికి యెంతమాత్రమును తెలియదుసరిగదా. ఇందులోనున్న పండితులు పాండిత్యము నేర్పి కవులు కవిత్వము నేర్పి మహారాజులు బిరుదులిచ్చి ధనికులు కొలువులు పతకముల బహుమానముచేసి బంపుదురు గావున విభూతి పిండికట్లు ధరించి మునుపటికన్న దాబుగా తిరగనచ్చును కాన నందరును తప్పక చేరి యీ సమాజమువారి యుద్యమునకు ప్రోత్సాహము కలుగుజేయుదురుగాక! మా సమాజమునుజూచి యెవరేమనుకొన్నను లక్ష్యపెట్టక యెల్లప్పుడు సాగేటట్టు ఏర్పాటు చేసినాము గనుక పోవునేమోయని భయపడనక్కరలేదు.

ఇందు త్రాగుబోతు లున్నారనిగాని తుంటరులున్నారనిగాని యెవరును చెప్పకో గూడదని మేము అందరకు తెలియజేసినాము కావున సమాజములో చేరేవారికిరహస్యము బయలుపడునేమోయను భయము

క్కరలేదు దరఖాస్తులు పంపువారు మా క్రిందిచిరునామాకాయిని పేర
పంపవలయును. ఇందు ముఖ్యముగా డాబుగా వేషములువేసి లోపల
లోపల త్రాగి, తుంటరిపనులు చేయుటయందు, ఆశక్తిగలిగి చరించే
మహానుభావులనే చేర్చుకొందుము కాని అవకతవక ప్రసంగములు
చేయుచు ముక్కుతు నూటిగా నడచుచున్నామనే వెఱ్ఱిబాగుల వారిని
జేర్చుకొనమని యిందుమూలముగా దెలియజేయుచున్నాము.

అప్పాలపాలెం జిల్లా }
సంగ్రామపురం }

ఇట్లు,
బడాయి బాపన్న.

---

ఏజంట్ల తమాషాలు

(వెంకటశాస్త్రులు వీరన్న ప్రవేశము)

వెంకట—ఏమోయి వీరన్న ! పనిమీద వచ్చినావా ఏమిటి?

వీరన్న—చిత్తమండి తమరేం నలా శెబుతారోఅని యవారం
పనియి శెయ్యడానికోచ్చానండి.

వెంకట—ఆవ్యవహారమేమిటి ?

వీరన్న—ఏవుందండి మాపెదెంకన గాడెవారమే.

వెంకట—దాని కింతాలోచ నెందుకోయి. వాడు చదివినట్లు
లొంగుతాడు. మొన్ననునేను చెప్పినట్టు చెయ్యి తప్పకుండా డిక్రీ
అయితీరుతుంది నీకేమి భయములేదు నేను వెనకాలుండి కథంతా
నడిపిస్తానుకాదూ.

వీరన్న—అమ్మబాబో అంతపని శెయ్యడమే నాగుండె లుండ
బట్టవుండి. కోర్టోరు పెమాణకం శెయ్యమంటే నోరు తడబడదూ అంత

పనిచెయ్యడానికి నాకిష్టం లేదుండి మరో మార్గం సూదురూ. ఆణ్ణి పిలిచి మందలించుండి. ఆడికేనుదరికి నేనెళ్ళాను. కనకనా, ఆదు నా శేలోకి రాడానికి.

వెంక—చూడు నీవు వెఱ్ఱిబాగులమనిషివి నేను నీకు లాభము వచ్చేపని చెప్పినా చెయ్యనంటావేమిటోయి. నీకంతగా భయముంటే నాపేర బ్రొనోటు వ్రాసుపరుచెయ్యి. మనబుచ్చావధానులుగారు, వ్యాఘ్రేశ్వర చయనులుగారు సాక్షివ్రాళ్ళు చేస్తామన్నారు రామసోమయాజులుగారు నోటువ్రాసి దానిమీద వెంకన్న నిశానిపెట్టి తప్పక కోర్టులో సాక్ష్య మిస్తానన్నారు. అంతా సిద్ధమైయుందికదా. ఇక నీకేమిభయము ?

వీరన్న—ఏంభయమంటారేంటి నాకాళ్ళు గజగజ లాడు తున్నాయి. ఆణ్ణెత్తికొట్టి అంతసొమ్ముచ్చుకుంటే నేనింక ముందు కొత్తానా ! మీాకేం మీారు బాగానే యుంటారు. అంతబద్ధమాడి, ఆడికొంప తీస్తే దేముడు సన్నూరుకుంటాడా బాబు. మీారు బ్రాహ్మలు కన్క పాపాలంటవుకుండాని యేంజేసినా శేత్తారు అంతపనే.

వెంక—చూడు నీకిష్టములేకపోతే వాడిని యేడిపించి తిరిగి యిచ్చివేయవచ్చును. నీవు సొమ్ముపుచ్చుకోనేవద్దు కాని నోటు సృష్టించి కంప్లయింటు చేసినావంటే వాడికి భయముంటుందోయి. దుర్మార్గుల నేమిజేసినా పాపం లేదన్నాడు నీవు భయపడకు రేపు నేను వెళ్ళి సోమయాజులుగారిచేత మూడువందలకు సృష్టినోటు వ్రాయించి కంప్ల యింటునిమిత్తం రాజమహేంద్రవరము పట్టుకువెడతాను నేను మొన్నను వెళ్ళినప్పుడు లంబోదరరావు పంతులుగారితో అంతా ఆలోచించి నాను, ఆయన డిక్రీఅవ్వుటకు అభ్యంతరములేదన్నాడు, వారి తీరుబడి రోజులుకూడానట. తప్పకుండా వ్రాయించితీసుకరమ్మని సలహా యిచ్చి

నారు. గనుక నీవు మారుమాట చెప్పకు. నీవు బోనెక్క వలసిన అవసరమే యుండదు అంతా మేమే చేస్తాము. నాయకా వున్నాననిపిద్దూ.

వీరన్న—(నవ్వి) ఎంతకేనా తగినోరయ్యా. అప్పుడే ప్లీడరు గారితో ఆలోశించారూ ఏంటీ అగితె మనకి శిక్ష లేదుకందా తరోత ఆడిసొమ్మాడికిత్తాం కాదూ. అందులో దోసాలున్నాయా!

వెంక—ఏదోషమూ లేదోయి. భయపడకు అనలు దుర్మార్గులను ఏవిధంగానైనా చెరపమని శాస్త్రాలు చెవుతున్నాయి నీకేమి భయములేదు. కానియ్యమన్నావా?

వీరన్న—మీాశిత్తం.

వెంక—అలైతే సాక్షులనిమిత్తం నలబైరూపాయలు కావాలి ప్లీడరుగారిఫీజు తర్వాత ఇయ్యవచ్చునులే.

వీరన్న—ఇప్పుడు ఖర్చుందా? డబ్బుఖరుచు పెట్టాలా యేంటి?

వెంక—ఖర్చుపెట్టకపోదే సాక్షులువస్తారా. అవుతేమిలే. యీా సొమ్మంతా మళ్ళీతిరిగి మనకొస్తుంది భయములేదు. జంకుతావేమిటి చూడు ఇకముందు నీపేరుచెప్పితే గజగజలాడుతూ వుంటాడు.

వీరన్న—కాని మళ్ళీ మనకొస్తుంది కందా అలైతే భయం లేదు. చూడుండి చాత్తులుగారూ మీామాట నమ్మానుచుమండి నాకు మాటరాకూడదు. మరి మీాచిత్తం మద్దాలబోశేశి ఆయీాదిక్తొత్తేని చొమ్మిత్తాను. పీడరుగారు నాకేమీా భయములేదని చెప్పారుకందా.

వెంక—ఓయి వెట్టివాడా నీకు మాటరానిస్తానా వాడిపొగరడ చాలని కాని మరొకటికాదు. పొద్దోయింది ఇకనీవుపో. నేనుభోజనం చేసి మీాయింటికివచ్చి అంతా మాట్లాడుతాను.

వీరన్న—నాకు మాటరాకుండా శెయ్యండి బాబు. నేపోతాను.

వెంక—సరే వెళ్ళు. (అని తనలో) మళ్ళీ యిదోకొన్నాళ్ళు నడుస్తుంది ప్రస్తుతం నలభై రూపాయలు చేతిలో పడతాయికదా. సాక్షులకు యిరువయిరూపాయలు పోయినా మనకుయిరువయిరూపాయ లుంటాయి ప్లీడరుగారితో (నోటు డిక్రీతాలూకు సొమ్ములో పుచ్చు కొనేపద్ధతిని) యిదివరకే మాటాడినాము. కాని భగవంతుడున్నాడు. ఏదో యింత దొరకకపోవునా? ఆ పరమాత్ముడు భక్తిమార్గము చూపకమానడు.

(అని నిష్క్రమించును.)

---

## న క్ష త్ర ము లు లె క్క

(మహాదేవరాజు, నాగలింగము, మల్లికార్జునశాస్త్రియను విద్దఱు జ్యోతిష్కులు, సభాసదులు ప్రవేశించుచున్నారు)

మహా—మంత్రులారా! పండితులారా! మాతండ్రిగారి మరణా నంతరమున నేను సింహాసనమెక్కి యిరువదిసంవత్సరములనుండి రాజ్యము చేయుచుంటిని. నాకు సామంతులై కప్పములకట్టుచున్న రాజులనే కులు కలరు భక్తవత్సలుడైన పరమేశ్వరుని నే నెల్లప్పుడారాధనము జేసి యాతని యనుగ్రహము సంపాదించి శైవమతోద్ధారకుడనియు వీర శైవుడననియు గొప్పబిరుదులగాంచి యష్టైశ్వర్యములు ననుభవించితిని. ఏకొరంతయు నాకులేదు. శత్రువుల ననేకుల యుద్ధములలో జయించి లింగములుకట్టి వారిని శైవమతములో గలిపితిని. గాని యెవ్వరిని బల వంతపెట్టలేదు. బలవంతపెట్టలేదనుటకు వేరె సాక్ష్యమక్కరలేదు. నారాజ్యములో నాకు లోబడి పురదరాజు తిరుమలరాజు మొదలగు

వీరవైష్ణవశిఖామణులు జమీందారులైయుండి నాకు కష్టములుగల్గించదు వారిమతములో వారు సుఖముగ నుండుటచేత నే నెంత పరమతసహనము గలవాడనో తెలిసికొనవచ్చును శైవులమీద నా కపరిమితానురాగమే కాని వైష్ణవులమీద నాకు ద్వేషము లేదు. చక్రాంకితము జేసికొని తిరుమణి తిరుచూర్ణములు ధరించుకొన్నవారి మొగములు చూడకూడదని లింగధారణ కాలమందు మా వంశపరంపర గురువులగు చిక్కయ్యఅయ్యవార్లుంగారు నాకు హితోపదేశము జేసిరి. కాని కొన్ని లౌకికబాధలచేత వారి యుపదేశప్రకారము నేను నడచుకొనజాలనైతిని. ఇదియే నేనుచేసిన గురుద్రోహము ఈమహాపాతకము జేసినందును నామనస్సెంతో తపించుచున్నది. అయినను దానికనేక ప్రాయశ్చిత్తములు చేసికొన్నాను. నాకు విచారములేవియులేవు. కోరికలేవియులేవు కాని నాకొక్క కుతూహలము మాత్రము చిరకాలమునుండి గలదు ఆకుతూహలము నా సంస్థానమునగల పండితులందఱి సహాయమున గాని తీరదు.

నాగ—(లేచి) మహాప్రభూ! మేము మూడుతరములనుండి మీయాస్థానములో పండితులమైయున్నాము మీకుతూహలము దీర్చుటయె మాకు ముఖ్యకర్తవ్యము మీకుతూహలమేదో మాకు తెలియ జేసినపక్షమున నది మాకు సాధ్యమగునేని తప్పక తీర్చెదము.

మల్లి—దేవా! నేను లేనిపోనిమాటలు చెప్పువాడను కాను. మీకుతూహలము తీర్చునిమిత్తము నాశరీరమైన కోసి యిచ్చెదను.

మహా—ఇటువంటిపండితులు మంత్రులు నావద్దనుండగా నాకు లోపమేమియు లేదు. ఇదుగో చెప్పుచున్నాను వినండి నాకుతూహలము ఆకాశముమీద నెన్నినక్షత్రములున్నవో లెక్కపెట్టించి తెలిసికొనుటకు నాకు బాల్యమునుండియు కుతూహలముకలదు. ఇది తర్కశాస్త్ర పండితులవలనకాదు. వేదాంతశాస్త్ర పండితులవలనగాదు. వ్యాకరణ

శాస్త్రప్రవీణులవలన గాదు. జ్యోతిశ్శాస్త్రజ్ఞులవల్లనే కావలెను. అందు చేత మీరే గుణించి గణించి నక్షత్రములసంఖ్యను నాకు నాలుగుమాసము దినములలో తెలియచేయవలయును దీనికి మారుమాటాడవలదు.

నాగ—(తనలో) చంపివేసినాడురా నాయనా రాజు. ఇది నా తరమా. నాయబ్బతరమా. నాతాతతరమా. చుక్కల లెక్కబెట్టుట నాకుగాదు సరిగదా నన్ను పుట్టించిన జేజెమ్మతరమైనా కాదు. ప్రభువు లనగా ఒకవిధమైన యున్మత్తులు వాళ్ళతో చిక్కేకాని మారు మాట వినరు. చేతగాదంటిమా యుద్యోగములు పోవును. చేతనగునం టిమా లెక్కపెట్టుమని తోమును ఈరాజు బ్రదుకునన్నవాడు నరనుడు నగునుగాని మధ్య మధ్య పిచ్చికళలు వీనికి మొత్తుచుండును. ఈపిచ్చికళ యీపరియాయము జ్యోతిష్కులమీద పడినది. దీనికేమియుపాయము. నాలుగుపండలమంది సాలెవాండ్రను జంగమువాండ్రను శిష్యులుగ గ్రహించి యేటేట శిష్యసంచారము వెళ్ళి యైదాఱువందల రూపాయి లేలాగో యేరుకొని తెచ్చుకొని హాయిగా నుండక రాజస్థానములలో నుద్యోగమెందుకు సంపాదించితినయ్యా. ప్రారబ్ధమింతకూ యీలాగున నున్నది. ఇంతకు యేమిచేయగలను. ఇదివరకు భూలోకములో నాయంత పండితుడు లేడని చొరకాయ లడ్డముగా గోసితిని. ఇప్పుడు చేతకాదని యనుటకు నోరెట్లాడును. అయినను మామల్లికార్జునుడు సమయస్ఫూర్తి గలవాడు. ఏదో ఫణుగురాయలాగున నొక్కమాట నడ్డువేసి యీాపద వెళ్ళబుచ్చలేకపోవునా ?

మల్లి—(తనలో) మొడమీాదికి కత్తివచ్చినది. చుక్కలులెక్క పెట్టుమని చెప్పిన పిచ్చివాడు లోకమున వీనుతప్ప మరియొకడు లేడు. మారుమాటాడితినా మండిపడిపోవును. చావగొట్టించి నభలోనుండి గెంటించును. మహారాజుల మాటలు మాయవాదములచేతనే గెలువ

వలయును. అందుచేత నేనొక చమత్కారప్రయోగము చేసెదను. ఇది బ్రహ్మాస్త్రమువలె పట్టుకొని తీరవలసినదే.

మహా—ఏమయ్యా! కుతూహల మేమిటో చెప్పుమని నన్ను తొందరపెట్టి నేను చెప్పగానె నోళ్లు మూసికొని యూరకొన్నారేమి చేతనగునా కాదా భూమండలంబున మీయంత పండితులు లేరని యిదివర కనేకసారులు చెప్పితిరిగదా మీకవసరము వచ్చినప్పుడు నోరెత్తి ధాటిగా జెప్పలేరేమి ఈ మాత్రము మాటలు చెప్పలేక పోయినచో మీరు గణించెడిదేమి. గుణించెడిదేమి. పంచాంగములు వ్రాయుటలో నొకగొప్ప లేదు. ఈదినములలో గుడ్డిముండ వ్రాయుచున్నది పంచాంగాలు ఏమి మాటలాడరేమి.

మల్లి—మహారాజా! నాదొక్కమనవియున్నది. జ్యోతిశ్శాస్త్రములో మావంటి పండితులు లేనిమాటనిజమే కాశీలో సదానంద పండితులవద్ద నేను చదువుకొన్నాను ముప్పదిసంవత్సరము లిందులో కృషిచేసినాను గ్రహసంచారములు గ్రహములు ఉత్తరాయణ దక్షిణాయణ ప్రవర్తనములు జక్కగా జెప్పగలను భూతభవిష్యద్వర్తమానములను మేముచెప్పినట్లు మరియొకడు చెప్పనేలేడు ఈసంగతులు దేవరవారికి మొదటినుండియువిశదము. ఎన్నోసారులు మేము చెప్పినది చెప్పినట్లు జరిగినది. ఇక నీవిషయములో నందురా మాప్రజ్ఞలు పనికిరావు ఎందుచేతనంటే మనమందరము లింగధార్లము లింగధార్లు చచ్చిపోయినప్పుడు భూమిలో పాతిపెట్టుదురు అందుచేత లింగధార్లకు భూమిలో సంగతులు భూమిమీద సంగతులు విశేషముగా దెలియునుగాని ఆకాశముమీద సంగతులు విశేషముగా దెలియవు నక్షత్రము లాకాశముమీద నున్నవి గనుక మాకు తెలియుట దుర్లభము వైష్ణవులు చచ్చిపోయినప్పుడు వారిని కాల్చివేయుదురు అందుచేత వారు ధూమరూపముగా నాకాశమార్గమును జేరుదురు. కావున వారి నాకాశముమీద

సంగతులు విశేషముగా తెలియగలవు మాయనవిచిత్రగించి దేవరవారు వైష్ణవజ్యోతిష్కులకు వర్తమానములంపివారిని పిలిపించి వారి నడిగిన పక్షమున మీావందేహము తీరగలదు ఈచుక్కలలెక్కలో వైష్ణవుల మించినవా రెవ్వరులేరు తక్కిన జ్యోతిశ్శాస్త్రములో వారుమాకు చాలరు. ఇందులో మేము వారికిచాలము.

మహా—మీారుచెప్పినమాట మంచియుక్తియుక్తముగ నున్నది. శైవులను పాతిపెట్టుదురు గావున వారికి భూసంబంధములైన విషయములే తెలియును వైష్ణవుల కాకాశముమీాద సంగతులు తెలియుటకు మీారు చెప్పినసంగతులు సరిపోయినవి. వైష్ణవపండితు లెక్కడున్నారు.

మల్లి—మహాప్రభూ! తిరుమలరాజుగారి సంస్థానములో నున్నారు. అక్కడ తాండవకృష్ణమాచార్యులుగారు తిరునారాయణా చార్యులుగారు పెరుమాళ్ళయ్యవార్లంగారు జోతిశాస్త్రములో చక్రవర్తులని చెప్పవచ్చును. వారిని పంపించవలసినదని దేవరవారు తిరుమలరాజుగారిపేర జాబు వ్రాసినపక్షమున వారు తప్పక పంపగలరు.

మహా—పంపుదురా లేదాయని సందేహించుచున్నాను.

నాగ—సరి సరి పంపకపోవుట కెన్నివేలగుండెలున్నవి దేవరవారియాజ్ఞ శిరసావహించనిపక్షమున వారిప్రాణములు దక్కునా వారు మీాకరిగాపులన్నమాట దేవరవారు మరచిపోతిరా యేమి.

మహా—అవునవును మనమాట తీసివేసి వారు బ్రతుకగలరా అవునయ్యా తిరుమలరాజుగారికి జాబు వ్రాయండి.

మంత్రి—చిత్తము మహాప్రభూ! ఇప్పుడేవ్రాసి యేలినవారి సంతకము నిమిత్తము పట్టుకొనివత్తును.

మహా—పండితులను పంపకపోయినట్టయితే వారి మానప్రాణములు దక్కవని స్పష్టముగా వ్రాయండి.

మంత్రి—తప్పకుండా సెలవు దేవరివారియాజ్ఞ ముల్లోకములు వెళ్ళిర తిరగను. తిరుగుటయే కాదు నాథుగారూ త్రినేత్రుండయినా తమసెలవు ప్రకారము నడుచుకొనవలసినదే.

మహా—సరే ప్రస్తుతము మీరింతా వెళ్ళండి మధ్యాహ్నమగు నది శివపూజకు లేవవలెను.

(రాజు మంత్రి లేచి వెళ్ళుచున్నారు)

నాగ—(వెళ్లుచు లోపల) మల్లిఖార్జునశాస్త్రీ! నీకు నీ పెద్దలకు పదివేల నమస్కారములు. నేటికి మా ప్రాణములు దక్కించినావు నీది మిక్కిలి మంచిసమయస్ఫూర్తిరా బాబూ! ఎటువంటియుక్తి పన్నినావంటే మూడులోకములకు వెళ్ళిరా తిరుగనియుక్తి పన్నినావు వహావా నీవు మంత్రిగా నుండదగినవాడవు కాని సామాన్యుడవుకావు బాబూ నీవామాటలు చెప్పుచున్నపుడు కడుపు చక్కలగునట్లు నాకు నవ్వువచ్చినది నవ్వితే బుఱ్ఱ ఎగిరిపోవునను భయమున నగముచచ్చినట్లు పడియున్నాను ఎంతచమత్కారముగా జెప్పినావయ్యా మట్టితల ముండకొడుకు క్లిష్టసమ్మి సరే యన్నాడు. కిలెరికి వాత పెట్టినావయ్యా.

మల్లి—శ్రీలింగమూర్తి సమయమునకు నాకటువంటి యుక్తి తోపించినాడు నానాలుకమీద అపర దేవతవాణి నిల్చి అవిఘ్నముగా పనిపించినది లేకపోతే నేటిదినమున మన మీవిధముగ మరల మనయిండ్లకు వెళ్ళగలమా ఈపిచ్చిరాజునకు నచ్చినదికాని నాయుక్తి తెలివిగల వాని కవ్వానికి నచ్చదు మానినది మందనునట్లు యేదో తోచినది సమయానికి ఇంతకూ మనము లేచినవేళ మంచిది పెళ్ళాము బిడ్డలు చేసికొన్న పుణ్యము మంచిది. పెద్దపులినోరునుండి బయలువడినాము మన మీద వాలిన శనిగానిని వైష్ణవులమీద త్రోసివేసినాము పోతే వైష్ణవులే పోవుదురు ఒక్క పంచాంగములవాడు పోయినా మనకు మంచిదే మనకు రెండుగోదానములు దక్కునట్లు ఏలాగనగా మనప్రాణ

ములు దక్కుట. మా క్షేత్రవులైన ఒకరిద్దరు వైష్ణవులు పోవుట ఒక బెడ్డతో రెండు పిట్టలను గొట్టునట్లు కావెళ్ళునను.

అని నిష్క్రమించుచున్నారు)

[అప్పుడు తిరుమలరాజు తాండవకృష్ణమాచార్యులుగారు నారాయణాచార్యులుగారు పెరుమాళ్ళయ్యవార్లంగారు మరి కొందరునభికులు, మంత్రి ప్రవేశించుచున్నారు]

తిరు—మంత్రి ! మహాదేవరాజెవరిని బంపించినారు ? ఎందుకు బంపించినారు ?

మంత్రి—వారి సంస్థానములోని మనిషియొకడొచ్చినాడు మీ కేదో జాబుతెచ్చినాడు.

తిరు—ఏడీ ! ఆమనుష్యుడు రాలేదేమి ?

మంత్రి—అదుగో వచ్చుచున్నాడు.

[అప్పుడొక మనుష్యుడు ప్రవేశించును]

మను—దేవరవారికి నమస్కారము.

తిరు—నీ పేరెవరు ? నీ వెక్కడనుండి వచ్చితివి ? ఏమిపని మీద వచ్చితివి ?

మను—నాపేరు చంద్రశేఖరుడు మహాదేవరాజుగారు మీకొక జాబిచ్చి పంపినారు.

తిరు—ఏదీజాబు. ఇటుతెమ్ము.

చంద్ర—చిత్తమిదిగో ! (అని అందిచ్చుచున్నాడు)

తిరు—(అందికొని) మంత్రీ ! దీనిని విప్పి చదువుము.

మంత్రి—చిత్తము. (అనియిట్లు చదువుచున్నాడు)

'మహారాజరాజశ్రీ మహామండలేశ్వరులైన తిరుమలరాజుగారికి శ్రీ మద్రాజాధిరాజ రాజపరమేశ్వర పరగండభైరవ వైరిసింహశరభ

హాత్తుహాన్నిబ్బరగండ హాత్తుహైవదగండ జగనొబ్బగండ మూరురాయరగండ వీరశైవప్రతిష్ఠాపనాచార్యబిరుదాంకితు లగు మహాదేవరాయలు వ్రాయించి పంపించిన యుత్తరువులు శ్రీమదుమామహేశ్వరుల యనుగ్రహముచేతను, బసవేశ్వరులవారి యాశీర్వచనము చేతను మేమిక్కడ సురక్షితముగా నున్నాము మాకు నిన్నటిదినమున నక్షత్రము లెన్నియున్నవో తెలిసికొనవలెనని సదాశివప్రసాదమువల్ల బుద్ధి పుట్టినది. జ్యోతిశ్శాస్త్రములో గొప్పప్రజ్ఞగల పండితులు నక్షత్రములు లెక్కపెట్టగల పండితులు, మీ సంస్థానమునందు గొందఱువైష్ణవులున్నారని మాదివ్యచిత్తమునకు తెలియవచ్చినది. ఆవైష్ణవపండితులను యీజాబు చేరిన వెంటనే మాసన్నిధానమునకు పంపించవలసినది వారల మీరు పంపకపోయినను, వారు రాకపోయినను వచ్చి యిక్కడ సరిగా నక్షత్రముల లెక్క చెప్పకపోయినను మీరందరు మాఆగ్రహమునకు పాత్రులగుదురు. మాకాగ్రహము వచ్చినా యేమిజరుగునో మీకే తెలియును. కాబట్టి వారిని తక్షణమె పంపించి వేయవలసినది.

ఇట్లు
మహాదేవరాయలు

తిరు—(తనలో) ఆహాహా! గొప్పచిక్కువచ్చినదే. ఈవైష్ణవులు తిరిగి బ్రతికిరారు. వీరికర్మము గాలినది. (అని ప్రకాశముగా) ఓయి చంద్రశేఖరా! నీవు మాపత్రములో బస యేర్పరచితిమి. నీవక్కడ పోయియుండవచ్చును. నీకు బత్తెమంపెదము సేవకుల నంపెదము. మహాదేవరాయలవారి సెలవుప్రకారము పండితుల పంపెదనని మనవిచేయుము. విష్వక్సేనాచార్యుల యనుగ్రహముచేతను, లక్ష్మీసమేతులగు శ్రీమన్నారాయణమూర్తివారి యనుగ్రహముచేతను, మేమిక్కడందరము క్షేమముగా నున్నామని మనవిచేయుము.

చంద్ర — చిత్తము. నేను సెలవు పుచ్చుకొనుచున్నాను. (అని నిష్క్రమించును.)

తిరు — ఏమండి! నారాయణాచార్యులవారూ! తాండవకృష్ణమాచార్యులుగారు పెరుమాళ్ళయ్యవార్లంగారు! మీరందరుపయనమై వెళ్ళండి.

తాండవ — మహాప్రభో. ఇంతకాలమునుంచి పెరుమాళ్ళకైంకర్యము పదోవిధంగా జేసికొనుచు కాలక్షేపము చేయుచున్నాము. దేవరవారే అళహాశింగరిస్వాములవారని దేవరవారి తిరువడిఘళైనమ్మికొన్నాము. ఖండనుకుమామీద దయ లేదు.

పెరుమా — తమరు చక్రవర్తి తిరుమహావారంతవారు. నీట ముంచినా పాలముంచినా మీదేభారము ఎంబెరుమానారి అనుగ్రహమెల్లాగున్నదో తెలియదు.

నార — శ్రీమతే రామానుజాయనమః నాథమునినేనమః ఆరాజురుద్రుని భక్తుడు మనలను చూడగానే పరమపదమునకు పంపించివేయును తోళ్ళెక్కముల నిమిత్తము చెరుకు కట్టలుకూడా తీసుకొని మనమక్కడికి వెళ్ళవలెను. పెళ్ళాము బిడ్డలకు మనకు ఋణము తీరినది. ఆరాజు లింగధారియగుటచే మన ప్రాణాలుతీసి దహనమయినా చేయకుండా త్రవ్వి పాతిపెట్టించగలడు. మనము ఉభయలోకభ్రష్టులమై పోగలము.

తిరు — ఆచార్యులుగారూ! విచారించకండి తిరువెంగడత్తాన్ మనపాలిటయున్న పక్షమున మనకు మేలుకలుగగలదు. మీరు నాలయిరములో పాశురములు చదువుకొనుచు సాక్షాత్ రంగేశ్వరుని మనస్సులో నిలుపుకొని వారి యాస్థానమునకువెళ్ళి శాస్త్రరీత్యా నక్షత్రముల సంఖ్య చెప్పండి చెప్పినపక్షమున మీకే యుపాయము కలుగదు శైవులన్న కారణముచేత ప్రాణములుతీయడు.

తాండ — చెప్పగలిగితే మాకిన్ని పాట్లెందుకండీ ! మేమెన్నో గ్రంథములు జ్యోతిశ్శాస్త్రములు చదువుకొన్నాముగాని, నక్షత్రముల లెక్క మాకెక్కడా కనుపడలేదు ఏగురువూ మాకుపదేశము చెయ్యలేదు. మేముముగ్గురము చచ్చిపోయినామన్నమాటే

తిరు — నేనేమిచేయగలను. పంపకపోయినపక్షమున నా రాజ్యము పోవును. నాతలపోవును. పంపిన పక్షమున మీప్రాణములు పోవును. ఇప్పుడు చేయవలసినదేమో నాకు తెలియకున్నది. ఈరాత్రిమనమందరము పెరుమాళ్ళకైంకర్యము మిక్కిలి ప్రపత్తితో చేయుదము. శ్రీయఃపతి ఏమియోచించునో అది రేపు చేయుదము. ప్రస్తుతము వెళ్ళండి.

(అందరు నిష్క్రమించుచున్నారు)

---

(అప్పుడు తిరుమలరాజు, తాండవకృష్ణమాచార్యులు, నారాయణాచార్యులు పెరుమాళ్ళయ్యవార్లంగారు, మంత్రి, పింగళప్పయును, విదూషకుడు ప్రవేశించుచున్నారు)

తిరు — ఆచార్యులుగారూ! ఎన్నివిధముల యోచించినామీరు విజయం చేయకతప్పదని తోచుచున్నది. రాత్రి పెరుమాళ్లు నాకలలోకి వేంచేసి మిమ్ములను పంపించుమని శాసించినారు ఉడయవరుయొక్క మంగళాశాసనములుకూడ ఆప్రకారముగానె కనబడుచున్నవి.

తాండ — నాథమునులవారు తెల్లవారుజామున నాస్వప్నములో దర్శనమిచ్చి శైవసభకు వెళ్ళవద్దని శైవుల మొగముల చూడవద్దని శాసించినారు.

నారా—మనవాళ్ళు మహామునులు, తిరుమంగయాళ్వారు నా స్వప్నములో దర్శనమిచ్చి మేము వెళ్ళుట యెంతమాత్రము భావ్యము గాదని సెలవిచ్చినారు.

పెరు—పెరుమాళ్ళు మీతో అలా సెలవిచ్చినారేమో గాని, నాతో అల్లా శాసించలేదు. నేను నేత్రములు మూసికొని ధ్యానరూపకముగా పరుండియుండగా గరుడవాహనారూఢులై భాష్యకార్లవారితో గూడ మేఘములాగున చక్కావచ్చి "శరీరమాద్యం ఖలు ధర్మసాధనం" అని సెలవిచ్చి వెళ్ళిపోయినారు. దీని అర్థమేమిటో తెలియకుండా వున్నది.

తిరు—పెరుమాళ్ళు నాతో వొకమాట చెప్పి మీతో వొక మాట చెప్పారా? మీ స్వప్నము నేను నమ్మను అందుచేత మీరందరు వెళ్ళకతప్పదు.

తాండ—అయితే మేమందరము చచ్చిపోవలసినదేనా?

తిరు—శ్రీయఃపతి సెలవైతే తప్పుతుందా. వారి సంకల్పమే సంకల్పముగాని, మనసంకల్పములు నెరవేరునా?

పెరు—నాయనా! వెంగళప్పా! విన్నావుగదా మాయవస్థ. దీనికేదైన వుపాయము యోచించి మమ్మొకదరి జేర్చలేవా?

వెంగ—ఉభయపరులు శ్రీయఃపతులు చేయలేని పనులు నేను చేయగలనా?

తిరు—ఓనోయి వెంగళప్పా! మరిచిపోయినాను. నీ కుత్పన్న మందబుద్ధులు పుట్టుచుండును. గట్టియోచనచేసి పావ మీ స్వాములకు వచ్చిన యాపద తప్పించు.

వెంగ—నాలుగు దినములపాటు నన్నే పెరుమాళ్ళుగా నెంచుకొని వీరందరు శ్రద్ధగా కైంకర్యము చేసినపక్షమందు నేను వీరికందరికి తొల్లైక్యము జరుగకుండా జాగ్రత్తపెట్టగలను.

తాండే—నాయనా! అదీ కావలసినది. నాలుగుదినములే కాదు. కంఠములో ప్రాణ మున్నంతవరకు నీకు నిత్యకైంకర్యము చేయు చుందుము.

వెంగ—అట్లయినపక్షమున నేను చెప్పినమాట వినండి మహా దేవరాజు సభలోకి నేను గొప్పజ్యోతిశ్శాస్త్రపండితుడనని వెళ్ళెదను. నాకు పెద్దంచు దక్షిణాదిపంచలు కట్టబెట్టండి. తులసిపూసలు తావళ ములు నామెడనిండా వేయండి ద్వాదశోర్ధ్వపుండ్రములు మీరు ముగ్గురు కూర్చుండి నాశరీరముమీద మొగమునిండా దిద్దండి. మంచి పావుకోళ్ళజత యొకటి యివ్వండి. పంద్రెండుగురు భోయీల సవారీలో నన్ను కూర్చోబెట్టండి. సింహనాదములు మ్రోగుచుండగా బోయీలు ఓం ఓం ఓం అని ఓంకారధ్వనులు చేయుచుండగా పెళ్ళుమని మహా దేవరాజుగారిపట్నం నేను వెళ్ళెదను. మీరు ముగ్గురు నావెంట శిష్యులుగా రండి ఈయన మా గురువుగారు జ్యోతిశ్శాస్త్రములో బృహస్పతిని మించినవారు ఈయన వద్దనే మేము చిన్ననాటనుండి విద్యలు నేర్చుకొన్నాము. ఈనాడు ప్రపంచములో జ్యోతిశ్శాస్త్రములో యింతవారు లేరు అని చెప్పండి. నన్నెవరైనా మహాదేవరాజుగారి సభలోని పండితులు వాదానికి రమ్మంటె ముందు మాశిష్యులతో వాదింపమని మీదగ్గిర కంపుతాను నావద్దకుమాత్రము వాళ్ళను వా మునకు రానియ్యకండి వచ్చినట్లయితే పొట్టచించినా అక్షరము లే వాడను. గనుక నాపరువు మీపరువు బయటపడును. .. తవరకు రానియ్య కండి. పరువుప్రతిష్ఠన అనవసరోక నాకు వింజామరలు వేయండి, నేను కూర్చోమన్నదాకా కూర్చోకండి. ఆసభలో నాయెదుట చేతుల జోడించుకొని నిలుచుకొనండి. నన్ను చూచినప్పుడు లేచి నిలిచియుండం నేను మధ్య మధ్య లేనికోపము తెచ్చుకొని మిమ్మును దౌర్భాగ్యులారా తెలివితక్కువవాళ్లారా! అక్షరము ముక్కలు రావు అని తిట్టుచుందు

ఒకప్పుడు దర్భాసనము దీసికొని కొట్టనూగలను. గట్టిదెబ్బలు తగల నియ్యను. అంతమాత్రముచేత మీరు కోపగించుకొని ముక్కుమూరెడు మొగముజానెడు చేసికొని మేమయ్యా గొప్ప ఆచార్యులవారము. మమ్ముల నీనిర్భాగ్యుడు తిట్టుచున్నాడని గుంజుకోవద్దు. మీవద్దనున్న తాటాకులపుస్తకము లన్నిటిని బండ్లమీద వేసి నావారీవెనుక పంపించండి. తాటాకులపుస్తకములు కొత్తవి వ్రాయునివి రెండుబండ్లు కూడా పంపించండి నేను మీకు గురువుగారిని గనుక మంచి మంచి భక్ష్యములు ఫలహారములు, పానకములు, మజ్జిగతేటలు, కొబ్బరికాయనీళ్ళు మొదలైనవి నాకెప్పటికప్పుడు సిద్ధముచేసి యుంచవలెను కాళ్ళు పిసక మంటే పిసకవలెను. ఇన్నిమాట లెందుకు, నాకీవి, నావైభవము చూచి మహాదేవరాజు అతని ఆస్థానంలోవుండే లింగధారపండితులు డంగుపోవలెను. ఈప్రకారం చేసినపక్షమందు నేను సరిగా చుక్కలు లెక్కపెట్టి మహాదేవరాజును మెప్పించి గొప్ప బహుమానములు పుచ్చుకొని మీప్రాణములు గాచి మన రాజుగారిపరువు దక్కించి పెళ్ళుమని పెళ్ళికొడుకులాగున తిరిగి పట్నంచేరగలను. ఇది మీకు సమ్మతమైనపక్షమున రేపుఉదయం సిద్ధముగండి. లేదా యెవరికివారే యమునాతీరే.

తాండ—నాయనా! నీవేలాగున చెప్పితే ఆలాగున వింటాము.

పెరు—బాబూ నీకు దాసానుదాసులమై యుండగలము.

నారా—తిట్టినా సరే కొట్టినా సరే మాకిష్టమే ప్రాణాలు రక్షించు.

తిరు—వెంగళప్పా నీఅదృష్టము మంచిదికాని యిటువంటి స్వాములచేత వుపచారములు చేయించుకొను యోగ్యతపట్టింది నీజాతక మిప్పుడు యోగించినది. లేకపోతే నవారియోగములు పట్టునా? రేపు ప్రయాణమై వెళ్ళండి.

వెంగ—దీనికంతటకు దేవరవారి అనుగ్రహమే కారణము సెల వియ్యండి.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

---

(మహాదేవరాజు, నాగలింగము, మల్లిఖార్జునుడు ప్రవేశించుచున్నారు)

మహా—వారు రావలసిన దినము నేడేకాదా?

నాగ—నేడేనండి.

మల్లి—యింకను రాకపోవుటకు కారణమేమో! తిరుమలరాజు గారు పంపకపోయియుందురా? లేక వారు రాకపోయియుందురా?

మహా—ఏమీ! తిరుమలరాజు పంపకయుండునా? వారు రాక పోయియుందురా? మూడవకన్ను తెరచిన మహాదేవునివలెనే మహాదేవ రాజు, వారి నందరిని భస్మపటలము చేయునని వారెరుగరా? పరమేశ్వ రుడు త్రిపురాసురుల సంహరించినట్లు సంహరించనా.

నాగ—చిత్తము చిత్తము. అలాగే మల్లిఖార్జునుడు మాటవరుస కాలాగన్నాడుగాని, దేవరివారిమాట కెదురున్నదా లోకములో.

(అప్పుడు భటుడు ప్రవేశించుచున్నాడు)

భటుడు—మహాప్రభో! గోడలకు వెల్లపరజాలు వేసినట్లు పంగ నామాలు పెట్టుకొని వైష్ణవులు సాతానులు వచ్చినారండి సెలవైతే లోనికిరమ్మంటాను, లేకపోతే, మెడమీద చెయివేసి గెంటుతాను.

మహా—(నవ్వి)ఓహో! వచ్చినారా యెమినర్వాములు. రమ్మను.

భటు.—చిత్తము. (అని వెళ్ళి వెంగళప్పను తాండవకృష్ణమాచార్యులుగారిని, నారాయణాచార్యులుగారిని, పెరుమాళ్ళయ్యవార్లంగారిని తీసికొని ప్రవేశించుచున్నాడు.)

వెంగ—శ్రీమతే రామానుజాయనమః

వైష్ణవులు—శ్రీమతే రామానుజాయనమః

మహా—సాంబసదాశివశంకర. సాంబసదాశివశంకర.

నాగ-మల్లి—బసవేశ్వరాయనమః బసవేశ్వరాయనమః

వెంగ—(తనలో) అబ్బా! ఏమిరుద్రాక్షలు! ఏమి విభూతి పిండికట్లు! నందీశ్వర దుండీశ్వర చండీశ్వరులలాగు కూర్చున్నారు.

వైష్ణవులు—(తనలో) ఈబూడిద పూసికొన్న ముండాకొడుకులను చూడవలసిన పాడుయోగము మాకు పట్టినదికదా! శ్రీమన్నారాయణమూర్తీ! ఈదయ్యాలనోట్లోనుండి యెప్పుడుబయట పడవేయుదువో.

నాగ—(తనలో) వంటికి వెల్లవేసినట్లు పణ్ణెండు ఊర్ధ్వపుండ్రము లేలాగున ధరించినారో! తులసిపూసలుధరించినారు. వీళ్ళతులసిపూసలు మండిపోను అచ్చుపోసిన ఆంబోతులులాగు జబ్బలు తెగకాల్చుకొని పులిహోరముద్దలు; దద్ధోజినంముద్దలు, మింగుచు కైంకర్యములు చేయుచుందురు. తలకొకలింగము కట్టి వదిలివేసిన బాగుండును

తాండ—(తనలో) వీళ్ళలింగాలు తెంపివేసి చక్రాంకితము చేసి వదలివేసిన బాగుండునుగదా! ఈ లింగధారివీనుగుల మొగములు చూడగనే నాకు డోకు వచ్చుచున్నది.

మహా—ఎవరండీ మీరు?

వెంగ—మహాప్రభూ! నేను శ్రీతిరుమల దేవరాయల వారి ఆస్థానంలో జ్యోతిష్కుడను. శ్రీమన్నారాయణమూర్తి వారి అనుగ్రహముచేతను, ఎంబెరుమానారి వాత్సల్యముచేతను, పన్నిద్ద రాళ్వార్ల

పరిపూర్ణకటాక్షముచేతను, తక్కిన ఆచార్యపరంపరయొక్క దయచే తను, నేను చదువని గ్రంథములేదు చూడని శాస్త్రములేదు వేయని గణితములేదు. తెలిసికొనని విషయములేదు. వాదముచేయని పండి తుడులేడు. ఓడింపని జ్యోతిష్కుడులేడు. పుచ్చుకొనని బహుమానము లేదు. దేవరవారు తప్ప తక్కిన రాజులందరిదివరకే నన్ను మెచ్చి పారితోషకములు కప్పినారు. అఖండభూమండలాఖండలులైన దేవర వారిదర్శనముకూడ చేయవలెనని చిరకాలమునుండి కోరుచునేయుంటిని, నేటికి లభించినది నేనదృష్టవంతుడను. నాజన్మ తరించినది కైలాసము విడిచి భూలోకము నవతరించిన శంకరులనగా తమరే. శత్రుమిత్రు లను సమానముగా జూచునట్టి మహానుభావు లెవరనగా తమరే. మీా సంస్థానమునకు వచ్చుటచేత నాపాండిత్యముకూడ సఫలమగును. వీరు ముగ్గురు నాశిష్యులు వీడు కొండవకృష్ణుడు వీడు పెరుమాళ్ళయ్యవార్లు వీడు నారాయణాచార్యులు, వీళ్లు నాశుశ్రూషచేసి సమస్తవిద్యలు నా వద్దనేర్చినారు. దాదాపుగా నాయంతవాళ్ళయినారు.

నాగ—(కోపముతో) వాదముచేయని పండితులు లేరనిమీారు ప్రభువుగారియెదుట సొరకాయకోతలు కోయుచున్నారే మీారుమాతో వాదించినారా?

వెంగ—నేను పండితులతో వాదము చేసితినని చెప్పినాను పండితులైతే మీాతో వాదము చేసియుందును.

మల్లి—ఏమీా! మేము పండితులముకామా?

నాగ—ఏమీా! వైష్ణవులు గర్వము!

వెంగ—వైష్ణవులను మీారు దూషించినను, నేను శైవులను దూషింపను. మీారు పండితులైన పక్షమున ప్రభువుగారు చుక్కల లెక్కనిమిత్తము మమ్మేల పిలిపింపవలసివచ్చును?

మహా—సరే పాదములు కట్టిపెట్టండి అయ్యా! మీపే రేవరండి?

వెంగ—మాయింటిపేరు ప్రతివాది భయంకరనల్లానిచక్రవర్తులు వారు నాపేరు తొండరటిప్పొడి నిరువేంగడిత్తాన్,

మహా—నాయనా! నీపేరు నీయింటిపేరు నానోట పట్టుటలేదు. ఇదెక్కడిపేరయ్యా. విపరీతపునామధే యమువలె నున్నది.

వెంగ—తల్లిదండ్రులు తెలివితక్కువచేత ఆప్రకారముపెట్టినారు పేరు మార్చుకోవలెనని నాకుకూడా యున్నదికాని యిదివర కెన్నో దస్తావేజులలోను అప్పుపత్రములలోను ఈపేరే యుండుటచేతః మార్చుకొనుటకు వీలులేకపోవుచున్నది.

మహా—సరే. పేరుకేమిగాని, మేము నిన్ను పిలపించిన సంగతి తెలియునా?

వెంగ—చిత్తము చుక్కలలెక్కనిమిత్తము పిలిపించినా రని విన్నాను.

మహా—ఔను ఆకాశముమీద చుక్కలెన్నియున్నవో మాకు చెప్పవలెను?

వెంగ—(నవ్వుచు) ఈమాత్రపులెక్క చెప్పలేకపోయిన పక్షమున నాజ్యోతిశ్శాస్త్రపాండిత్యమెందుకు. తగలపెట్టనా! కాని, నాకొక వారము దినములు గడు విప్పించండి. మీచిత్తమొచ్చినట్లుచెప్పి మెప్పించెద.

మహా—సరే ఇచ్చినాను. మీరు మాకోటలో చిట్టచివర మేడలో బసచేయవచ్చును. మీకు కావలసిన సమస్తసామగ్రులు పంపించెద వెళ్ళండి.

వెంగ—చిత్తము మహాప్రభో!

(అందరు నిష్క్రమించుచున్నారు.)

(అప్పుడు మహాదేవరాజు, నాగలింగము, మల్లికార్జునుడు, తిరునారాయణాచార్యులు, పెరుమాళ్ళయ్యవార్లంగారు, తాండ్రకృష్ణమాచార్యులు, వెంగళప్ప, మరియు ననేక సభికులు ప్రవేశించుచున్నారు )

మహా—(వెంగళప్పనుజూచి) అయ్యవార్లుగారూ ! మీఅద్భుత గణితము వినుటకు ఈపట్టణములోనుండియేగాక చుట్టుప్రక్కలనున్న పల్లెలనుంచి వందలకొలది జనము వచ్చినారు. సభ కలకలలాడుచున్నది చుక్కలలెక్క చెప్పవలసిన దినమీదినమేగదా ? కాబట్టిత్వరగాచెప్పి మమ్మందరను మహానందము నొందింపుడు.

వెం—చిత్తము అందుకేగదా వచ్చినది అయిదుదినములనుండి రాత్రితెల్లవార్లు నాకు నిద్రలేదు.

మహా—ఎందుచేతనండీ నిద్రలేకపోవుట ?

వెంక—ఏమని మనవిచేయగలను ? తన్ను తానుపొగడుకొనుట తన్ను కొన్నట్లుంటుందన్నారు. దీపములుపెట్టింది. మొదలుకొని నిద్రాహారములులేకుండ తిరిగి తెల్లవారువరకు యెత్తినమెడ యెత్తినట్లే యుండునట్లు, తెరచినకన్నులు తెరచినట్లే, కదలెడు పెదవులుకదలినట్లే యుండునట్లు, నక్షత్రములు లెక్కపెట్టుచూ, గ్రహసంచారములు తెలిసికొనుచు, నేను పైకి చూచునప్పటికి చేతిలోని గంటము లెక్కలు చేయవలసినదే నేను వేసిన లెక్కల తాటాకులు నాలుగుబండ్లమీద వచ్చినవి.

తాండవ—(తనలో) అరే వీడమ్మకడుపుకాల ఈవెంగళప్ప గాడు ఏమికోతలు కోయుచున్నాడురా నాయనా ! దీపముపెట్టగానే గేదెపెరుగుపోసుకొని లకోటాకు మెతుకులేకుండా అన్నముతిని గుఱుపెట్టి నిద్రపోయి తన్ను మాయలేదని చెప్పుచున్నాడు. ఈతాటాకుల మీద మీయిష్టమువచ్చిన అంకెలు వేయుమని మమ్మున బ్రతిమాలి వేయించి అవి అన్ని తాను గణితముకొరకు వేసినట్లు సారకాయకోతలు

కోయుచున్నాడు. ఈమహాదేవరాజును పిడుచక్కగా బుట్టలో పెట్టినాడు కాని, వీడివల్ల తలగాచుకొంటిమా పిడెన్ని జేసినను నకే.

మహా—అబ్బబ్బ! పాప మెంత శ్రమపడుచున్నారు. నక్షత్రముల లెక్కనగా యింతకష్టమున్నది గాబోలు!

వెంగ—మహాప్రభూ! ఇంతంత శ్రమకాదు. ఈదెబ్బతో నేను మంచమెక్కిపోతాను. ఆరునెలలదాక మసిపిసిగాను. బుద్ధిపనిచెయ్యకుండ దీనికి. ఒకటే ఆలోచన ఒకటే బలోచన, శంఖాలు, అర్బుదాలు, కోట్లు మనసులో గణించుకోవలసినదే. అలాగునమనసులో గణించగా మిగిలినలెఖ్ఖలో యీతాటాకులమీద నున్నవి. ఈచుక్కలలెక్క నాశత్రువునకైనా వద్దండి. సామాన్యముగా యీవిద్య మరెవరికీ రాదు. నేను చిన్నప్పుడు బ్రహ్మకపాలమువరకు యాత్రవెళ్ళి యక్కడ బదరీనారాయణాశ్రమములో సాక్షాత్తు వేదవ్యాసునివద్ద జ్యోతిషము నేర్చుకొన్న యొక మహామునివద్ద పదమూడు సంవత్సరములు శుశ్రూషచేసి వారి యనుగ్రహము సంపాదించి యీవిద్య నేర్చుకొన్నాను. శుశ్రూషఅనగా ఎటువంటి శుశ్రూషనుకొన్నారు? కాళ్ళుపిసికి, దర్భాసనములుమోసి, కౌపీనములు కాషాయవస్త్రములుపుదికి యెన్నోసార్లు పెద్దపులిగండాలు, చిరతపులిగండాలు, తాచుపాముగండాలు తప్పించుకొని, యెట్లాగో బయటపడినాను. మరొకడైతే ఆశుశ్రూషచేయలేడు ఈవిద్య సంపాదించలేడు. నేనుగనుకా నిశాచరపు ముండావాడనూ అంతకష్టపడినాను గాని మనుష్యమాత్రుడు పడగలడా!

మహా—అయ్యయ్యో మీరు చాలా శ్రమపడి సంపాదించినారు. శ్రమలమాట తర్వాత చెప్పవచ్చునుగాని, ముందు గణితము చెప్పండి? వినవలెనని కుతూహలముగా నున్నది.

వెంగ—చిత్తగించండి. (అని క్షణమునేపు కన్నులుమూసి ధ్యానముచేసి) శ్రీమతే రామానుజాయనమః, శ్రీమన్నారాయణానమః, శ్రీమదనంతగరుడవిష్వక్సేన పాదారవిందాభ్యాంనమః అయ్యా సభవారందరు వినండి. ఆకాశముమీద తూర్పుదిక్కునయున్న చుక్కలు సరిగా నాలుగువేల యెనిమిదివందల తొంభైనాలుగు అర్బుదములు, తొమ్మిదివేల యెనిమిదివందల డెబ్బదిమూడుకోట్ల తొంబదితొమ్మిది లక్షల తొంబది తొమ్మిదివేల తొమ్మిదివందల తొంభైతొమ్మిది. దక్షిణంవైపు నున్న చుక్కలు సరిగా మూడువేల రెండువందల పదకొండు అర్బుదములు. ఏడువేల ఆరువందల యేబదినాల్గుకోట్ల యెనభైయెనిమిదిలక్షల యెనుబది యెనుబదవేల యెనుబదివందల యెనుబదియెనిమిది. పడమటనున్న చుక్కలు సరిగా అయిదువేల నాలుగువందల ముప్పదిమూడర్బుదముల యేడువేల తొమ్మిదివందల నలుబదినాలుగు కోట్ల, డెబ్బదియేడులక్షల డెబ్బదియేడువేల యేడువందల డెబ్బదియేడు. ఉత్తరమునయున్న చుక్కలు సరిగా రెండువేల రెండువందల యిరువది రెండర్బుదముల మూడువేలమూడువందల ముప్పదిమూడుకోట్ల అరువది యారులక్షల అరువదియారువేల ఆరువందల అరువైయారు.

(అందరు చప్పట్లు కొట్టుచున్నారు)

వైష్ణవులు—జయ జయ! జయా! జయా! జయ!

మహా—భళీ! అయ్యవార్లంగారు భళీ!

నాగ—మహాప్రభూ! యీలెక్కతప్పు. ఇదినేనొప్పుకొనను.

వెంగ—(కోపముతో లేచి) ఏమనుచున్నావు! రాత్రి పగలు నిద్రాహారములులేక నేను గణితములు చేసినలెక్క తప్పా? తప్పైతే లెక్కపెట్టి యెక్కడతప్పో చూపించు! మహారాజా! యిది వోర్వ లేనితనము.

మహా—నిశ్చయముగా నిదివారోక్వాలేనితనమే!! ఏమయ్యా నాగ లింగముగారు! వీరు చెప్పలేరు సరిగదా నుదిరియుకరు చెప్పినప్పుడుతప్పు తప్పందురా? నోరెత్తినారంటే మిమ్ముద్దరను జేపడి మన్నా చేయించెదను.

నాగ—(తనలో) ఈ వెంగళప్ప ముండాకొడుకు మావెర్రి రాజుకు టోపీవేసినాడు. మోసపోయినావయ్యా అని నేను చెప్పినను వినడు ఇంతకు వానియదృష్టము బాగున్నది. ఈమహాప్రభుసాహసము నావద్దలేకపోయినది.

మహా—మంత్రీ! ఈఅద్భుత జ్యోతిష్యునకు పదివేలరూపాయిలను దుశ్శాలువలు బహుమానము నిప్పించుము. వాని శిష్యులకు ముగ్గురికి నూటపదహారుచొప్పున బహుమానము చేయించుము.

తాండ—(తనలో) బతికినాముగాబాబు! బహుమానాలకేమి గాని ప్రాణాలతో బయటబడ్డాము. వెంగళప్ప మమ్ము కాపాడుటేగాక పదివేలు సంపాదించుకొన్నాడు.

వెంగ—మహాప్రభో! మేమింక సెలవు పుచ్చుకొందుము.

మహా—మంచిది వెళ్ళండి.

వెంగ—తమకేదైన యిట్లసాధ్యమైన గణితము వచ్చినప్పుడు నాకు వర్తమానమంపండి.

(అందరు నిష్క్రమించుచున్నారు)

## కరణాల కట్నం

(కొందరు కాపులతో గ్రామకరణం సుబ్బారాయుడు ప్రవేశించుచున్నాడు)

సుబ్బా—బాపన్నా! సాగుబడిలెక్క వ్రాసి పదిరోజులలో తాలూకాకు పంపించాలి. రివిన్యూ యినస్పెక్టరుగారు తణిఖీకి వస్తూన్నారు నీయరటితోట విషయంలో యేమంటావు?

బాపన్న—అనేందుకేముందండి. అంతా మీకే తెల్సు మామూలు ప్రకారం కానియ్యండి.

సుబ్బా—విన్నావా! వెంకన్నా! నేను మామూలు ప్రకారం వ్రాసి నిరుడు మనకట్నంనిమిత్తమై మంగల సూరిగాడిని పంపిస్తే నానామాటలు అన్నాడట ఉపకారానికి రోజులుకావు పదిరూపాయలు తీరువాయిపోదా అని యేదో వ్రాసినాను. ఇతనిమాట లెట్లు నమ్మను?

బాపన్న—ఓయి బాబూ! కూచేవుండి రారాంటే, ఆడికంత పొగరా మీతో శెపితే, ఆ మాటట్టుకున్న నన్నుకాదంటే దిగడిందేంటయ్యా ఆతాచీలుదారుకే తాంబూలంయిత్తాను తాంబూల ముచ్చుకోని ఒకణ్ణిసూపెడుదా యేలుమడిశి?

వెంక—ఒరే బాపన్నా! ఆరు కామందికార్లు ఆరెల్లా శెబితే అల్లాగినాలా కాకమడకురా! దికార్ల కోపం మొత్తది.

సుబ్బా—చూచావా! సుబ్బిరెడ్డి! మీరహితాంగం వ్యవహారమేయిది. అందితేజుట్టు లేకపోతే కాళ్ళు కరణాల కట్నాలకుపేచీ పెట్టని రహితున్నాడా? అబ్బే అందుకనే నాకెందుకని యూరకుంటు

న్నాను. మీపాట్లు మీరు పడతారు దరఖాస్తులు లేకుండా నీరు పెట్టి నప్పుడు డబ్బిలుతీరువాయి యిచ్చుకొన్నప్పుడు కాని తెలియదు చాలు చాలు.

సుబ్బారెడ్డి—ఊరుండి. అడు బుద్ధిలేనోడు. మీరుకూడా కా కమడితే మెల్లాగా మీకట్టాలికి పేసీలెవరు పెట్టరు బాబూ. ఏంటో యిబ్బందుంటే వదరి చెప్పుకుంటా కాని పేచీపెడితే తెల్లారిమళ్లీ రావొద్దూ.

బాప—సుబ్బిరెడ్డీ! నీకేం-చుబాబు తెల్దూమకో. నిరుడు పాల కాయలపంట్ల మొండిమోతే రిమిలాచ నిప్పుత్తారనుకుంటే ఆ రిమిలాచ నంతా ఆయనేవుచ్చుకొన్నాడు. పై మామూలంట. కరణారకేంట్రా చాలూమామూలంలేదు. ఏకమామూళ్లే ఏకమామూళ్లే. కూరమామూలు పెరుగుమామూలు గడ్డిమామూలు. అబ్బబ్బా పాణం యిగిరిపోతుం దంటేనమ్ము. యినీ మారాజేడి ఆతాచీలుదూరంతకంటేని ఈళ్ళుద్దో గాలుమండా. చత్తరువ్వులంట తిని, ఊరంటమున్నైత్తి యీళ్ళునమ కొంని ఉద్దోగాల్లోకి రావడం మనపాణాలు తియ్యడాన్కే కాబోలు. ఉద్దోగత్తులొత్తున్నారంటే మొసులొళ్ళొత్తున్నారన్నమాటే.

సుబ్బా—చూచారా! మీరంతా! నాయెదుటనే యెట్లుతిట్టు చున్నాడో మొన్నను రివిన్యూయిన్స్పెక్టరుగారిమీద యీరీతిగానే పడ్డాడట. ఆయన నాతో చెప్పి సిగ్గుపడ్డాడు.

వెంకన్న—అడుమోటోడు. అడికేం తెల్లండి మీరేకూంత కరు ణించాలికాని తొందర పడకండి.

సుబ్బా—ఎందుకు ఇతనివిషయమై పైకివ్రాస్తాను. ఇట్టిదుర్మా ర్గులు గ్రామంలోనుంటె అంతా చెడిపోరూ.

బాపన్న—చూడండి. మీరెంతరాచినా చరేకాని నాకేం బయంలేదు. దొంగతనంచేశానా, లంజతనంచేశానా, నాకేం బయమయ్యా. మీకు లంచాలియ్యకమానే గౌసిరుగారు బుజ్జగీతారేమో శూత్తాను.

సుబ్బి—లంచాలనకురా బాబు. కట్నాలను.

సుబ్బా—తొందరపడకు. లంచాలిస్తూన్నావుగా. సరే ఆలోచించుకో.

బాపన్న—ఓయిబాబు పొణుకొచ్చిందయ్యా, ఏంబెదిరిత్తావు మొన్న నింజనీరుగారితో మాటాడేప్పుడు నేయిన్లేదూ చెరువుమరమ్మతుచాల్దని యింకాలాగాలనుకున్నావు కాబోలు ఈరోజే ముచ్చుకుందుగాని కాదూ.

సుబ్బా—అదేమిటి చెరువు మరమ్మతేమిటి కొత్తకల్పనలు చేస్తూన్నావు. కొంచము పైత్యకళమునిమీద లాగున్నావు.

బాపన్న—పైత్తెకలా చాల్లేవయ్యా కావుల్ని శెల్లోశేపలపట్టుకుని నాచుతియ్యమంటం లేదు.

సుబ్బా—అవును శుభ్రముగా నుండునని తీయుమన్నాను దానికేమి ?

బాపన్న—లోకలు పండోరిచ్చే డబ్బేంచేస్తున్నావయ్యా అది మీపెట్లోకా ? నీచుమాపొట్లోకా ? ఏంకరణాలో మలమలమాడ్చుకతింటారుకంబా

సుబ్బి—అయితేని సుబ్బారాయుడుగారూ ! మనశెరువు శేటాయేభై రూపాయలు మరమత్తుచెయ్యమని యిత్తున్నారంట కాదుండి.

సుబ్బా—అదంతా అబద్ధమేనోయి కిట్టనివాళ్ళకల్పన.

బాపన్న—అబ్బోకల్పనా. నిజం శెబితే వుల్కొత్తుంది నాకేందుకు.

సుబ్బా—చూడు నీవు నాయెదుటనుండిపో, నీ మొగముచూడ కూడదు వట్టి పశుప్రాయుడవు లాగున్నావు పో.

సుబ్బి—కోంపడకుండి ఆడితోశేంటి.

సుబ్బా—వెంకన్నా నీవు సుబ్బిరెడ్డీ మధ్యాహ్నా మొక్కసారి మాయింటికిరండి మీతో మాట్లాడాలి భోజనమునకు ప్రొద్దుపోయినది. నేను వెళ్ళుచున్నాను బాపన్నా నీపవయ్యమై యేమంటావు. కట్నం యెప్పుడు తెస్తావు

బాపన్న—యెల్లుండా కట్నానికేం దిమీంచనిద్దూ మద్దే లొత్తాను.

సుబ్బా—నీవుకూడా భోజనము చేసిరా. వెఱ్ఱిమొఖమా చెడిపోకు.

(అని పోవును)

(అందరు నిష్క్రమించుచున్నారు)

---

## వ డ్డీ వ్యా పా ర ము

[అంతట వెంకటశాస్త్రులుగారియింట రామప్పపంతులు రమణయ్యాతో ప్రవేశము]

రామ—(తనలో) వెంకటశాస్త్రుల్లుగారు బదులు యిస్తానన్నారు. కాని గౌరీపతి శాస్త్రుల్లుగారివిం కే నన్నేమైనా అంటారేమో అని భయమగుచున్నది. వీడు ఏలాగున బాగుపడడు. ఆ వహోవానను వదలడు. కావున మనకు దొరికేసి మొండుకు పోగొట్టుకోవాలి బంధు

త్యాముమాట అనక విచారించుదాము. వేయిరూపాయలకు నోటు వ్రాయిస్తె మనకు వందరూపాయలు యిస్తానన్నారుగదా. వాడికిచ్చేది వ్రాయిస్తే మనకు వందరూపాయలు యిస్తామన్నారుగదా వాడికిచ్చేది అయిదువందలు మొత్తము అరువందలు వెయ్యిరూపాయలు వెంకట శాస్త్రుల్లుగారికి యిప్పించినట్టు. కావలసినంత ఆస్తి యున్నదిగదా. మొన్నను గోపాలచార్యులతో వెళ్ళి రంగసానికి ఎనిమి దెకరాల భూమి వ్రాసి యిచ్చినాడట. మనకు బదులు యిప్పించినామంటే యీనాలుగు రోజులలోను మనకు తప్పకుండా యేమైనా డబ్బుదొర కకమానదు. అదిగో చావడిలో కూర్చున్నారు. లోపలికివెళ్ళి బదులు సంగతిచెప్పి తప్పకయిచ్చేలాగునచేస్తాను. (ప్రకాశముగా) రమణయ్యా అదిగో ఆయన చావడిలో కూర్చుని యేవో కాగితములు చూచుకొను చున్నారు. నేను వెళ్ళి మాట్లాడివస్తాను. నీవిక్కడనే కూర్చో ఆచుట్ట పారేద్దూబాబూ! ఆయనకు నీగొడవంతా తెలుస్తే అసలుడబ్బు పుట్టదు.

రమ——సరే పారేస్తాను. మీరు వెళ్ళండి.

రామ——(లోపలకువెళ్ళి) శాస్త్రుల్లుగారూ నమస్కారము.

వెంక——దయచేయండి. అకుఱ్ఱవాడిని తీసుకువచ్చినారా యేమిటి?

రామ——ఆ. తీసుకువచ్చినాను. ఈవేళ వ్రాతమూలం అయిపో వాలి. లేకపోతే మళ్ళీ వీలుండదు.

వెంక——అయితే ప్లీడరుని యెవరినైనా తెలుసుకొన్నారా? వీడిచేత దస్తావేజు వ్రాయించుకోవచ్చునా.

రామ——ఆ. కనుకొన్నాను. మనసుందరరావు పంతులుగారిని తెలుసుకొన్నాను. వేరేయున్నాడు గనుక కొన్నినెంబర్లు ఉదహరించి

వ్రాయిస్తే చెల్లుతుందన్నారు. సమయమువస్తే ఆయనకు వకాల్తనామా యిమ్మన్నారు. మీరు భయపడనక్కరలేదు. ఆస్తికి లోపములేదుగదా.

వెంక—అయితే నేనొకమాట చెపుతాను. మీరు కోపము పడకండి. ఈకుఱ్ఱవాడు తాగుతాడటకాదూ?

రామ—తాగితే మనకేమి? ముండ నుంచుకుంటే మనకేమి? మనకు డబ్బుప్రధానము వాడికి బదుళ్ళెందుకు. అందుకే గాదటయ్యా.

వెంక—అట్లయితే మనము త్రాగించి వ్రాయించినా మంటా పేమో.

రామ—వాడిమొగం రిజష్టరాఫీసులో డబ్బిచ్చి రిజిష్టరీచేయించిన తరువాత యీవెఱ్ఱివేషాలు సాగుతాయా!

వెంక—రిజిస్ట్రారుగారియెదుట వెయ్యిరూపాయిలు పొయ్యాలా? అక్కరలేదా?

రామ—పొయ్యొవద్దూ లేకపోతే రిజష్టరెల్లాగ?

వెంక—అందుకోసమని చేద్దాము. ఏమిటంటే యిదివరకు అయిదువందలకు నోటు వ్రాసినట్లున్నూ ఆనోటుబాపతువడ్డీ వసూలు యిచ్చినట్లున్ను ఆనోటుసొమ్మునోగలిపి యిప్పుడు వేయిరూపాయిలు బదులు యిచ్చినట్లున్ను వ్రాయిద్దాము. అది బాగావుంటుందా?

రామ—భేషైన వాడవయ్యా మంచి వ్యవహారతలు మీకు మేము సలహా చెప్పాలా. అదిచాలా బాగానున్నది. అట్లయితేముపా యిదా వ్రాయించండి.

వెంక—ఆకుఱ్ఱవాడేది. తీసుకువచ్చినారా,

రామ—తీసువచ్చినాను కాని మీరు వారి గొడవ తెలియనట్టే నటించాలి.

వెంక—మన కెందుకు. వాడిపాడునడతవల్ల వాడే చెడిపోతాడు ఆగొడవ మనకెందుకు.

రామ—ఈచిత్రం విన్నారా. మొన్న యేలూరునుండి మళ్ళీ యింకోక తెను. తీసుకువచ్చాడట వీడిపిచ్చమండా. రంభలాగునభార్యా యుండగా వీడి పొయ్యేకాలం చూచారా! ఏమైనా అంటే చెడతాగి కొడతాడేమో అని భయం.

వెంక—పదిమందిని తీసుకు రానియ్యండి. మన కెందుకా గొడవ చెడిపోతాడు. ఎన్నాళ్ళుసాగుతుందిలెండి. లోపలకు రమ్మనండి.

రామ—(వీధిలోనున్న రమణయ్యనుతీసుకువచ్చి) అరుగోశాస్త్రి ల్లుగారు! ఎప్పుడేనా వీరిదర్శనంచేశావా?

రమణ—చెయ్యకేమి చాలాసార్లు చూచినాను.

వెంక—అబ్బాయీ కూర్చుండుము నీ వయస్సెంతనాయనా!

రమణ—నాకిప్పు డిరువది మూడవసంవత్సరము.

వెంక—అయితే మీారు పంచుకొన్నారటకాను.

రమ—భోజనమువేరేనే చేయుచున్నాము భూములమీాదవచ్చే శిస్తుమాత్రం పంచుకొనుచున్నాము.

వెంక—మీాకంతా పదిహేనువందలు వస్తాయనుకుంటాను.

రమ—ఆ రెండువేల రూపాయలువచ్చుచున్నాయండి.

వెంక—నీకు తప్పకుండా సొమ్ము యీావేళ కావాలా?

రమ—చిత్తము ఈవేళ కావాలాండి. మా మేనమామను ధాన్యము ఖరీదునిమిత్తం పంపించాలి. మనిషిని గాత్రిబండీమీాద వెళ్ళుచున్నాడు.

వెంక—(తనలో) ఔరా! మేనమామకు పంపవలెనని వ్యవహా రస్తులు మాట్లాడినట్టే మాట్లాడినాడు. బొంక నేర్చినవాడే రంకునేర్చి నవాడన్నారు. (ప్రకాశముగా) మధ్యాహ్నము భోజనముచేసి పందల

కడరా! మన రామప్పగారు మీతో అంతా చెప్తారు. వెళ్లు.

రమ—చిత్తము. మధ్యాహ్నము తప్పక వెనలు చెయ్యాలండీ.

వెంక—తప్పకుండా యిస్తాను.

రామ—చిత్తము. శాస్త్రులుగారూ సెలవా? వెళ్ళుచున్నాను. (అనిపోవును)

(అందరు నిష్క్రమింతురు)

---

## మ హో ప న్యా స ము

### ఒ క స భ

[అప్పుడు సభాధ్యక్షుడు వందలకొలది పెద్దమనుష్యులు కూర్చుండగా దంబాల దశరథరామయ్య లేచి యుపన్యసించుచున్నాడు]

దశ—సభానాయకుడిగారికి దణ్ణాలు. కూర్చున్న పెద్దమనుష్యులందరికి నమస్కారాలు. ఈపాక చాల చల్లగానున్నది. ఈ పాకే యించినోరికందఱికి దణ్ణాలు. ఈసభలో నన్ను మాటాడమని మావూరినుంచి మావోళ్ళుపంపించారు. పరే మీరందరూ కూడా వింటావన్నారు గనుక నాకుతోచినమాటలు నాలుగు చెపుతాను. యెఱ్ఱిమాటలలో మొఱ్ఱిమాటలలో అవిమీరు జాగ్రత్తగా వినాలి. నాది గుడిసెలగూడెం కాపురము నాయింటిపేరు దంబాలవారు నాపేరు దశరథరామయ్య. మాఅమ్మపేరు జానకమ్మ మానాయినబోయి పదేళ్ళయినది. మాఅమ్మ చచ్చిపోయి రోజ్ణాలయినది. పెద్దముండ కూతురైనా

మాఅమ్మపోవడం నాకు చాలా కష్టంగావుంది. పులుసుకాచిందంటే మాఅమ్మే కాచాలి నాకేపై యేళ్ళున్నాయికాని మాఅమ్మని తలుచుకుంటే నాకేడుపొస్తాది. (అని వెక్కి వెక్కి యేడ్చుచున్నాడు)

సభ్యులు—(చప్పట్లు కొట్టినవి) భేష్ భేష్ వహావా వహావా బాగుంది, బాగుంది. దిగుదిగు చాలుచాలు.

అధ్యక్షుడు—ఏమండోయి దశరథరామయ్యగారు మీఅమ్మ సంగతి మీనాన్నసంగతి యెందుకండీ అల్లాటిమాటలు చెప్పకూడదు. నీటితూరల విషయమైన తీర్మానము మీరుబలపరచాలి. అందుకుమిమ్మ లిని పిలిచాము. చెప్పగలిగితే నాలుగు ముక్కలు దానిని గూర్చి చెప్పండి. లేకపోతే వెళ్ళికూర్చోండి, మీరు సభలో వెక్కి వెక్కి యేడవ కూడదు.

దశ—ఏడవకూడదూ? ఏడుపువస్తే యేంజెయ్యమన్నారు? వాళ్ళంతాయిప్పుడు నవ్వొస్తే నవ్వలేదు? నన్నుచూస్తే మీకింత కోప మెందుకు? నేను చెప్పేమాటల్లో అబద్ధమేముంది? మాఅమ్మ చచ్చి పోవడ మబద్ధమా? మాఅమ్మ బాగా పులుసుకాచడ మబద్ధమా? ఇల్లాటిమాటలు చెప్పకూడదంటారుమీరు! తమరేయీలాటి మాట లంటే నేనేమి మనవిచెయ్యను? ప్రజలకష్టనిష్ఠూరాలు చెప్పుకోవడం విషయమై యీసభ పుట్టించవని అందరు చెప్పుకొంటున్నారు. అంచేత నాకష్టాలు చెప్పుకోనేటందుకు నేనొచ్చాను. సభచేస్తామంటే నాలుగు రూపాయలిచ్చాను. నాలుగురూపాయలకి నాల్గుగళ్ళైనా మాటాడ నియ్యరా యేంటి? ఏడీ నన్నెవ్వడు కదుపుతాడో కదపమనండి? అళ్ళంతా నవ్వేరంటే మీరుకూడా యిల్లాగంటారా? సిగ్గులేనిమొకా లకి నవ్వేసింగారమని కీసబాస తెలియక నళ్ళునవ్వుతారు. అళ్ళమాట కేమికు మీరిల్లాఅంటారా? ఇంకా నాలుగు మాటలున్నాయి చెప్పి పోతాను ఊరుకోండి.

సభ్యులు—చెప్పనియ్యండి, చెప్పనియ్యండి కథపట్టుచాల రసవంతంగా వుంది.

సభ్యులు—చాలు, చాలు, దింపండి ఇదివరకు వినిపించిన కలాపంచాలు.

దశ—ఊరుకొన్నకొద్దీ పొగరెక్కి పోయేరు మీరంతాను ఈతూరి నోరెత్తారంటే నంకలు తెగమొదుత్తాను జాగ్రత్త.

అధ్య—సభవారంద రూరుకోండి. నేనున్నాను. జాగ్రత్తపెట్టుతాను. దశరథరామయ్యగారు! మీరు చెప్పదలచుకొన్న దేదో చెప్పండి. త్వరగా కానియ్యండి.

దశ—త్వరగానే కానిస్తాను. అవరసని చెప్పనిస్తే జల్లుమంట మెల్లిపోను పెవాఘం. పీళ్ళంతా గొల్లుమంటే ఆధార మెనక్కుమోయింది. కొంచెం నేపుండండి, గేపకంచేసి చెప్పుతాను—మావూళ్లో నేను బైల్దేరేటప్పటికి చాలపొద్దుంది. ఆపాటికి పడవమీద పడ్డాను. ఆపడవలో చెక్కవూటుగా బస్తాలేశారు. ఆడబ్బసిగ్గొయ్యా! పంనల్లులని చెప్పను! ఈగలంతేసి నల్లులున్నాయి. తొంగున్నిద్రోతూంటే ఆకభాసోడు చింతపండు బుట్ట నాయీపుమీదేశాడు. ఆలంకణాలపడవ రెండుజాములకొచ్చింది ఇక్కడకురాగానే పప్పాదప్పళాలతో భోజనాలు మూబాగా పెట్టారు. పప్పాధప్పళాలు మారుచిగా వున్నాయి నబేంటి మూబాగావుంది. ఇల్లాంటినబే చూళ్ళేదు నేను. మావూరు కాశీలబవాగు గారు చేసినపెళ్ళిలాగుంది. నన్ను మీరంతా ఓపెద్దమ్మను జేసి నువ్వు పెద్దోడవు చెప్పవయ్యా అంటేనేను చెపుతున్నాను. నేనాట్టే గెందాలు గిందాలు చదువుకొనోణ్ణికాను. గెరిడిటీలు పేపరులు సూశినోణ్ణికాను. సూడకపోయినా యీసూశినోళ్ళకంటె బాగానె శెప్పాను.

సభాధ్యక్షుడు—తూరలనిగురించి కూడా చెప్పండి మరి కొంచెము.

దళ — చెవుతావుంటేనే తొందరపెడితే యెల్లాగా నోటిలో నుంచి మాటరానియ్యరేమి. నీటితూరలు బాగావున్నాయి మానేలకి నీరుసరిగా వస్తూంది డెంటానూవరెంటు ఆడుచ్చుకునే దాడుచ్చుకొన్నా యాలకి నీరొదలిపెడ్తాను.

సభా — మీరాలా చెప్పగూడదు. అదతీర్మానానికివ్యతిరేకము.

దళ — యెతిరేకమైతే నాకేంయి. అను బోగమైతేనాకేంయి ఉన్నామాటేంటో యేకరమెట్టాను. మీరల్లా శెలవిస్తే నేనేం శెలవియ్యాను డెంటానూపరెంటు మంచోడుకాడంటే రేప్రొద్దున్న శెలిగర కట్టుకుమోవాలి. అప్పుడు మీరొత్తారా యీళ్ళొత్తారా? ఛీసి, యీలాంటి సభలోకి రావడం నాదే బుద్ధిపొరబాటు. (అని దిగుచున్నాడు)

(సభాసదులు చప్పట్లు మిక్కిలిగట్టిగా గొట్టుచున్నారు )

దీని తరువాయి రెండవ భాగము చదువవలెను.



# ఆంధ్ర నాటకములు

| | రు | అ |
|---|---|---|
| పద్మవ్యూహం చ॥ మా॥ | 0 | 8 |
| శ్రీకృష్ణగాయఖారం డిటో | 0 | 8 |
| కనక్తార డిటో | 0 | 8 |
| సంగీత కృష్ణలీల | 0 | 8 |
| లవకుశ డిటో | 0 | 8 |
| మోహినీ రుక్మాంగద అ॥ శే॥ | 0 | 8 |
| దశావతారములు మ॥ శ్రీ॥ | 0 | 8 |
| సతీ సక్కుబాయి కో॥ కా॥ | 0 | 8 |
| సంగీత సారంగధర | 0 | 8 |
| సతీ అనసూయ శొం॥ గ॥ | 0 | 8 |
| చింతామణి జో॥ మృ॥ | 0 | 8 |
| సంగీత గులోబకావళి | 0 | 8 |
| భక్తకుచేల | 0 | 8 |
| అర్జున ప్రతిజ్ఞ | 0 | 8 |
| రోషనార | 0 | 8 |
| భక్తతుకారాం | 0 | 8 |
| భక్తకబీరు | 0 | 8 |
| దానవీరకర్ణ | 0 | 8 |
| సంగీత జయంత జయపాల మ॥ శ్రీ॥ | 0 | 8 |
| రామదాసు డిటో | 0 | 8 |
| కాంతామతి డిటో | 0 | 8 |
| సంపూర్ణ భారతము చ॥ మా॥ | 1 | 0 |
| లంకాదహనం ఆ॥ శే॥ | 0 | 8 |
| సంగీత ప్రహ్లాద అ॥ సో॥ | 0 | 8 |
| సంగీత శశిరేఖ డిటో | 0 | 8 |

## చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి నవలలు

| | | రు | అ |
|---|---|---|---|
| అహల్యాబాయి | | 1 | 0 |
| రాజరత్నం | | 1 | 0 |
| కృష్ణవేణి | | 0 | 12 |
| హేమలత | | 1 | 0 |
| కర్పూరమంజరి | 1 వ భా॥ | 1 | 8 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 |
| రామచంద్ర విజయము | | 1 | 0 |
| సౌందర్యతిలక | | 1 | 8 |
| వినోదములు | 1 వ భా॥ | 0 | 12 |
| డిటో | 2 వ భా॥ | 0 | 12 |
| Tales of Rajasthan అను రాజస్థానకథావళి | 1 వ భా॥ | 1 | 4 |
| డిటో | 2 వ భా॥ | 1 | 4 |
| మణిమంజరి | | 0 | 6 |
| సువర్ణగుప్తుడు | | 0 | 6 |
| చమత్కారమంజరి | 1 వ భా॥ | 1 | 0 |
| డిటో | 2 వ భా॥ | 1 | 0 |
| Lives of great men మహాపురుషుల జీవితచరిత్రలు | 1 వ భా॥ | 1 | 0 |
| డిటో | 2 వ భా॥ | 1 | 0 |
| డిటో | 3 వ భా॥ | 1 | 0 |
| రామకృష్ణ పరమహంస Life and Teachings | | 1 | 0 |
| ప్రహసనమంజరి | | 0 | 12 |
| నవ్వులగని | | 1 | 8 |
| నానక్ చరిత్ర | | 0 | 12 |
| గురుగోవింద చరిత్ర | | 0 | 12 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమంద్రి.